# పురాణపరిచయం



**డా॥ జానమద్ది రామకృష్ణ**

ఎం.ఏ., పిహెచ్.డి.

రీడర్, వ్యాకరణ విభాగాధ్యక్షుడు

**రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం**

తిరుపతి

ప్రకాశకులు

**శారద పబ్లికేషన్స్**

తిరుపతి

1997

Purāṇapariçayam



ప్రథమ ముద్రణ : 1997

వెల : రూ. 100/-

ప్రతులు - 1000



**This book is published under the Financial Aid of Tirumala Tirupati Devasthanams, Tirupati. Under their scheme Aid to Religious Publications**

ప్రతులకు :

**శ్రీమతి జె. లీలావతి**

సద్గురునిలయం

1097/ఎ, ఎన్.జి.ఓ. కాలని,

కె.టి.రోడ్

తిరుపతి - 517 507

ఫోన్ : 51628

ముద్రణ : **అన్నపూర్ణ గ్రాఫిక్స్**

53, (మిద్దెపైన) ఆర్.ఎస్. గార్డెన్స్

తిరుపతి - 517 507

నాకు జీవితాన్ని ప్రసాదించిన





అస్మద్గురుదేవులు

**మహామహోపాధ్యాయ**

**పేరి సూర్యనారాయణశాస్త్రి గారి**

పాదారవిందములందు

సవినయంగా సమర్పించే ప్రథమ పుష్పము

# విషయసూచిక

వినివేదనము | పుట

# వినివేదనము

అనంతపురం జిల్లా రాయదుర్గం నా జన్మభూమి. బ్ర.వే. చిదంబరశాస్త్రి గారు శ్రీమతి నరసమ్మగారు నాకు పుట్టుకనిచ్చారు. హైస్కూల్ విద్యాభ్యాసం అనంతపురం జిల్లా పామిడిలో సాగింది. 1971లో శృంగేరికి వెళ్ళి సంస్కృతాధ్యాయనం చేయాలనే దృఢమైన సంకల్పం కలిగింది. వెళ్ళాను. మూడేళ్ళపాటు అక్కడ అధ్యయనం సాగింది. ఆ సమయంలో వ్యాకరణశాస్త్రం ఓ మోస్తరుగ ఒంటబట్టింది. సమగ్ర వ్యాకరణాధ్యయనసంకల్పం కలిగింది. శృంగేరి జగద్గురువులు అనంతశ్రీ విభూషిత **భారతీతీర్థస్వాములవారితో** సవినయంగా మనవి చేసికొన్నాను. వారి అపారమైన కృపాకటాక్ష వీక్షణాలు నా మీద ప్రసరించాయి. రాజమండ్రిలో మహామహోపాధ్యాయ **పేరిసూర్యనారాయణశాస్త్రి** గారి వద్ద నా అధ్యయనానికి ఏర్పాటుచేశారు. ప్రియమిత్రుడు **గణపతి భట్టు** సహాధ్యాయిగ నాకు తోడొచ్చాడు. 1974 జూలైలో ఇద్దఱము రాజమండ్రి చేరుకొన్నాము. ఓ శుభముహూర్తంలో శాస్త్రాధ్యయనం ఆరంభమైంది. 1977 లో వ్యాకరణ విద్యాప్రవీణ ప్రిలిమినరీ పరీక్షలు వ్రాశాము. సరిగ్గా అప్పడే మంత్రాలయం **శ్రీరాఘవేంద్రస్వామి** పీఠాధిపతుల నుండి మా గురువు గారికి పిలుపొచ్చింది తమ ఆస్థాన విద్వాంసులుగ అక్కడికి రావలసినదిగ ఆ పిలుపుసారం. తమ ఇద్దఱు శిష్యులకు వసతి - భోజనాలు ఏర్పాటు చేయగలిగితే తప్పక మంత్రాలయం రాగలనని గురువుగారి సమాధానం. ఎంతో సంతోషంతో అంగీకరించారు పీఠాధిపతులు **శ్రీశ్రీశ్రీసుజయీంద్రస్వాములు.** గురువుగారి వద్ద అధ్యయనం చేస్తూ అక్కడి విద్యార్థులకు అధ్యాపనం కూడ చేయవలసినదిగ స్వాములవారు కోరారు. నా ఆనందానికి అవధుల్లేక పోయాయి. 1979 లో వ్యాకరణ విద్యాప్రవీణ పూర్తి అవడంతో విద్యాభ్యాసం ఓ స్థాయికి చేరింది. 1980లో P.O.L. వ్రాశాను. అదే సంవత్సరం తి.తి.దే. వారి వేదశాస్త్ర ఆగమ సదస్సు నిర్వహించే శాస్త్రపరీక్షల్లో ఉత్తీర్ణుడయ్యాను.

1982 అక్టోబర్‌లో కృష్ణాజిల్లా ఆగిరిపల్లి శ్రీమార్కండేయ ఓరియంటల్ కళాశాలలో సంస్కృత అధ్యాపకుడుగ ప్రవేశించాను. ఆ సమయంలో సంస్కృతం ఎం.ఏ. మరియు భాషాప్రవీణ పరీక్షలు పూర్తిచేశాను. 1987లో

జూలైలో ఒరిస్సాలోని ప్రసిద్ధమైన పూరీ క్షేత్రము లోని సదాశివ కేంద్రీయ సంస్కృత విద్యాపీఠంలో ఉపన్యాసకుడుగ ప్రవేశించాను. అక్కడ ఉన్న కాలంలో పి.హెచ్.డి. చేశాను. 1991 నవంబర్‌లో బదిలీ మీద తిరుపతి రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం ప్రవేశించాను. 1995 అక్టోబర్‌లో రీడర్‌గ పదోన్నతి లభించింది. ప్రస్తుతం వ్యాకరణ విభాగాధ్యక్షుడుగ వ్యవహరిస్తున్నాను. ఇదీ నా సంక్షిప్త పరిచయం.

మా బాబాయి పూజ్యులు జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారు రచనా వ్యాసంగా బాగా అలవరచుకోవాలని నాకెన్నో సార్లు ఉపదేశించారు. 'సరే' అంటూ కొంత బద్ధకిస్తూ వచ్చాను.

ఇలా ఉండగ 1994 మే నెలలో మాన్యశ్రీ ప్రొ. ఎస్. బి. రఘునాథాచార్య గారు మా విద్యాపీఠం వైస్ ఛాన్సలర్‌గ పదవీ బాధ్యతలు స్వీకరించారు. వీరి రాకతో విద్యాపీఠంలో ఎన్నో నూతన సంస్కరణలు చోటుచేసుకొన్నాయి. మూర్తీభూత సముత్సాహస్వరూపులు వీరు. ''సంస్కృతాధ్యాపకులు సమాజానికేవిధంగా ఉపయోగపడుతున్నారు?'' – ఈ దృష్టితో సమాజం మనల్ని వేయి కళ్ళతో పరిశీలిస్తున్నదని ఎన్నోసార్లు తమ ప్రసంగాల్లో వెల్లడించారు. వారి మాటలు నాకు స్ఫూర్తినిచ్చాయి. బాధ్యత తెలిసింది. తీవ్రంగా ఆలోచించాను. బాబాయిగారిని కలిశాను. సలహా అడిగాను. సగటు మనిషి సైతం తెలిసికోగలిగేలాగ సరళ శైలిలో అష్టాదశ పురాణాలకు సంబంధించిన పరిచయాన్ని సంక్షిప్తంగా అందించమని ఆదేశించారు బాబాయిగారు. సుమారు 3సంవత్సరాల పాటు అష్టాదశ మహాపురాణాలను ఒక కోణం లోంచి అధ్యయనం చేశాను. కొంత అవగాహన కలిగింది. దాని ఫలితమే ఈ – '**పురాణ పరిచయం**'.

18 మహాపురాణాలు మాత్రమేగాక మరో 18 ఉపపురాణాలు సైతం ఉన్నాయి. అయితే వాటి గురించి ఈ గ్రంథంలో ప్రస్తావన చేయలేదు. అలాచేస్తే ఈ పుస్తకం కూడ ఒక పురాణమే అవుతుందేమోనని నా భయం. పాఠకుల పట్ల జాగ్రత్తగ వ్యవహరించాలి కదా!

**కృతజ్ఞతాంజలి : -**

నా అభ్యుత్థానానికి ఇద్దఱు మహానుభావులు కారకులు. ఒకరు శృంగేరి

జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములు. రెండవ వారు విద్యా గురువులు మహామహోపాధ్యాయ పేరి సూర్యనారాయణశాస్త్రి గారు. శాస్త్రిపాదులవారు వ్యాకరణ పాఠాలతో పాటు అదేశైలితో లోకంలో నడచుకోవలసిన తీరును సైతం అద్భుతంగా పుత్రవాత్సల్యంతో నాకుపదేశించారు. ఈవిధంగా వైయాకరణుడిగ మాత్రమేగాక సగటుమనిషిగ కూడ నన్ను మలచిన కీర్తిశేషులు మా గురుపాదులు. ఈ ప్రథమగ్రంథపుష్పాన్ని వారికి సవినయంగా సమర్పించుకొంటున్నాను. ఈ సందర్భంగా అన్నపూర్ణ స్వరూపిణియైన మా గురుపత్నిగారిని స్మరించడం నా కర్తవ్యం

ఈ గ్రంథానికి ఆర్థిక సహాయమందించడం ద్వారా **శ్రీపద్మావతీ శ్రీనివాసుల** సంపూర్ణానుగ్రహానికి నన్ను పాత్రుణ్ణి జేసిన **తిరుమల -తిరుపతి దేవస్థానం** యాజమాన్యానికి నా ధన్యవాదాలు.

సర్వదా నా అభ్యుదయాన్ని కోరే పెద్దలు మా పెదనాన్నగారు జా. రామచంద్రశాస్త్రి గారు, బాబాయిలు జా. సత్యనారాయణ శాస్త్రిగారు, జా. మాధవశర్మగారు మరియు నాలోని విద్యార్థి, ఉద్యోగి, గృహస్థు, గృహస్వామి మొదలైన అన్నిదశల్లోనూ అన్ని విధాలా కొండంత అండగ నిలచిన బుల్లిబాబాయి శ్రీకాంత్ గారు (సీనియర్ టెలిగ్రాఫ్ మాస్టర్, విజయవాడ). మా అన్నయ్య జా. మల్లికార్జున శాస్త్రి గారి శుభాశీస్సులు పరిపూర్ణంగా ఉన్నాయి. ఈ అందర్నీ ఈ సందర్భంగా భక్తితో స్మరిస్తాను

**వినయ పుష్పాంజలి : -**

ఈ శిష్యపరమాణువు పట్ల సంపూర్ణానుగ్రహంతో పురాణపరిచయానికి 'నారాయణస్మరణము'ను ప్రసాదించిన శృంగేరి జగద్గురుచరణులు అనంత శ్రీవిభూషిత **శ్రీమద్భారతీతీర్థచరణుల** పాదారవిందములందు సవినయంగా సాష్టాంగ ప్రణతులను సమర్పించు కొంటున్నాను.

పురాణపరిచయానికి మొక్కుబడిగ కాక నిండుమనసుతో ప్రత్యక్షరము చదివి చల్లనిదీవెనలందించిన మహానుభావులు.

- తిరుపతి రాష్ట్రియ సంస్కృత విద్యాపీఠం కులపతులు కార్యదక్షులు **ప్రొ. యస్. బి. రఘునాథాచార్య** గారికి,

- రాజమండ్రి గౌతమీ విద్యాపీఠం ఓరియంటల్ కళాశాల ప్రిన్సిపాల్ మరియు మా మాష్టారు **శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ** గారికి,

- తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు విభాగాధిపతులు సహృదయులు **ప్రొ. కె. సర్వోత్తమరావు** గారికి,

- తిరుమల - తిరుపతి దేవస్థానములు అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టర్ అవధాన చక్రవర్తి, **డా॥ మేడసాని మోహన్** గారికి,

- కడప పట్టణంలోని సి.పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్ లైబ్రరి కార్యదర్శి, మా బాబాయి **జానమద్ది హనుమచ్ఛాస్త్రి** గారికి,

నమ్రతతో కృతజ్ఞతలను తెలియజేసికొంటున్నాను.

***స్నేహాంజలి : -***

- ఈ పుస్తక ముద్రణకు సంబంధించి అమూల్యమైన సలహాలనిచ్చి, నా భుజం తట్టిన అస్మద్గురుపుత్రులు, తిరుపతి రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠంలోని శిక్షణ విభాగం ప్రత్యేకాధికారి (Special Officer, I.A.S.E.) **ప్రొ॥ పేరి సుబ్బరాయన్** గారు,

- ముఖచిత్రానికవసరమైన భగవాన్ వేదవ్యాస మహర్షుల పటమునందించుట ద్వారా ఈ పుస్తకానికి వన్నెతెచ్చిన శృంగేరి జగద్గురు చరణుల పాదారవిందసేవాతత్పరులు, ఆప్తమిత్రులు **శ్రీ తంగిరాల దక్షిణామూర్తి** మరియు **శ్రీ సి. కృష్ణభట్టు** గారలు,

- నిండు మనసుతో శుభాశయాలందించిన మిత్రులు **కోరాడ రామకృష్ణ** (తి.తి.దే.) గారికి

- వ్యాపార దృష్టితో గాక సుహృద్భావనతో ఈ పుస్తకాన్ని సుందరంగా ముద్రించి తమ సామర్థ్య నిరూపణలో యత్నశీలురైన **శ్రీఅన్నపూర్ణ గ్రాఫిక్స్** యాజమాన్యం (తిరుపతి) వారు.

ఈ అందరికీ నా స్నేహాంజలిని సమర్పిస్తూ సద్గురుస్మరణతో ముగిస్తాను.

కార్తీకపూర్ణిమ,

ఈశ్వరనామ సంవత్సరము

14-11-1997.

**- జానమద్ది రామకృష్ణ**

ॐ



॥ श्री श्रृङ्गेरी श्री जगद्गुरुमहासंस्थानम् ॥




श्रीमत्परमहंसपरिव्राजकाचार्यवर्य पदवाक्यप्रमाणपारावार-पारीण यमनियमासनप्राणायमप्रत्याहारधारणाध्यान-समाध्यष्टाङ्गयोगानुष्ठाननिष्ठ तपश्चक्रवर्त्यनाद्यविच्छिन्न श्रीशङ्कराचार्यगुरुपरम्पराप्राप्त षड्दर्शनस्थापनाचार्य व्याख्या-नरसिंहासनाधीश्वर सकल निगमागमसारहृदय संख्यत्रयप्रतिपादक वैदिकमार्गप्रवर्तक सर्वतन्त्रस्वतन्त्रादिराजधानीविद्यानगर-महाराजधानीकर्णाटक-सिंहासनप्रतिष्ठापनाचार्य श्रीमद्राजाधिरजगुरुभूमण्डलाचार्य ऋष्यश्रृङ्गपुरवराधीश्वर तुङ्गभद्रातीरवासि श्रीमद्विद्याशङ्करपादपद्माराधक श्री जगद्गुरु श्रीमदभिनवविद्यातीर्थस्वामिगुरुकरकमलसञ्जात

॥ श्री जगद्गुरु श्रृङ्गेरी श्रीमद्रभारतीतीर्थस्वामिभिः ॥

अस्मदत्यन्तप्रियशिष्य जानमद्दि रामकृष्णविषये नारायणस्मरणपुरस्सरं विरचिता आशिषस्समुल्लसन्तु।

भवान् पुराणपरिचयनामकं ग्रन्थं आन्ध्रभाषया उपनिबध्य अस्मत्सविधे समाप्रिपत्।

"इतिहासपुराणाभ्यां वेदं समुपबृंहयेत्" इति प्रमाणमनुसृत्य वेदार्थपरिज्ञाने पुराणानामस्तिमहती उपयोगिता। तानि च पुराणानि अष्टादशसंख्याकानि भगवता वेदव्यासेन लोकोपकाराय विरचितानि। तथाचोक्तं "अष्टादशपुराणानां कर्ता सत्यवतीसुतः" इति। भगवतो महिमा, भगवदाराधनक्रमः, भगवदवताराः, धर्माऽधर्मौ इत्यादयो बहवो विषयाः पुराणेषु प्रतिपादिताः ये सर्वैर्लोकैरवश्यं ज्ञातव्याः। अत एव चतुर्दशविद्यास्थानेषु पुराणमप्यन्यतमं विद्यास्थानम्। परन्तु तेषां पुराणानां विस्तृतत्वात्तत्प्रतिपाद्यमर्थं संक्षेपेण प्राकृतानपि लोकानवबुबोधविषुर्भवान् ग्रन्थमिममग्रथ्नादिति महतः प्रमोदस्य स्थानम्।

श्रीशारदाचन्द्रकलावतंसयोरसीमया कृपया ग्रन्थोऽयं विशिष्टं प्रचारमेतु भवांश्च श्रेयःपरम्पराभिस्समभिवर्धतामित्याशास्महे।

शृङ्गिगिरिः इति नारायणस्मरणम्

ईश्वरवत्सरीय आश्विनकृष्ण चतुर्दशी गुरुवासरः

३०.१०.१९९७





# అభినన్దనమ్

ప్రొ. ఎస్.బి. రఘునాథాచార్య
వైస్‌ఛాన్సలర్
రాష్ట్రియసంస్కృతవిద్యాపీఠం
తిరుపతి

భగవంతుని నిశ్వాసరూపాలైన వేదాలు భారతీయుల జీవనస్రవంతికి, ధర్మోత్తేజానికి, తత్త్వార్థ దర్శనానికి మూలకందాలు. ఇతిహాసపురాణాలు వేదాలను సముపబృంహణం చేస్తున్నాయి. అందుకే పెద్దలిలా చెబుతారు-

**''ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్''**

పురాణమంటే ఏమిటి? అనే మీమాంస ఏర్పడినపుడు ఆయా కోణాల్లో పురాణశబ్దం అనేక విధాలుగా నిర్వచింపబడింది. ''పురా పూర్వస్మిన్ జాతమితి పురాణమ్'' (అ.గు.ప్ర), ''పురా నవం భవతీతి పురాణమ్'' (యా.ని.3.4.19), ''పురా ఆగతానాగతౌ అణతి కథయతీతి పురాణమ్, పురా ప్రాచీనకాలోదన్తం అనక్తీతి పురాణమ్''. పురాణానికి సర్గ ప్రతిసర్గాది పంచ లక్షణాలుండాలని కొందఱంటే దశలక్షణాలుండాలని ఇంకొందరు ప్రతిపాదించారు. పురాణ వాఙ్మయం మహాపురాణాలని, ఉపపురాణాలని, ఉపోపపురాణాలని మూడు విధాలుగా విభజింపబడింది. అందులో మహాపురాణాలు పద్దెనిమిది అనే అంశంలో అందఱికి ఏకాభిప్రాయం ఉంది. కాని ఉపపురాణాలు 34 అని కొందరు 18 అని కొందరు, 17 అని కొందరు అంటున్నారు. అపౌరుషేయాలైన వేదాలలో గల నిత్యసత్యోపదేశాలు సోదాహరణంగా సమాజగమనానికి శాంతికి ఉపయోగపడేటట్లు పురాణవాఙ్మయంలో నిరూపించబడినాయనడంలో సందేహం లేదు.

అతివిస్తరమైన పురాణవాఙ్మయంలో మహాపురాణాలను గురించి సంక్షిప్తంగా పరిచయం చేస్తున్నది ''పురాణపరిచయం'' అనే ఈ చిన్న గ్రంథం దీని రచయిత మా విశ్వవిద్యాలయంలో వ్యాకరణవిభాగంలో రీడర్‌గా పనిచేస్తున్న

డా॥ జానమద్ది రామకృష్ణగారు. ఈయన 'మహోమహోపాధ్యాయ' బ్రహ్మశ్రీపేరి సూర్యనారాయణశాస్త్రివర్యుల అన్తేవాసిగా వ్యాకరణశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారు. అనేక శాస్త్ర సభల్లో తన పాండిత్యాన్ని బహుశః నిరూపించుకున్న వావదూకశిరోమణులు. ఈ గ్రంథాన్ని తమ గురువర్యులకే అంకితం చేయడం వారి గురుభక్తిని చెప్పకనే చెబుతున్నది.

''పురాణపరిచయం'' అనే ఈ చిన్న పుస్తకాన్ని తీర్చిదిద్దడంలో డా॥జానమద్ది రామకృష్ణగారి భావనాపరిణతి, లోకజ్ఞత మనకు స్పష్టమౌతాయి. పద్దెనిమిది పురాణాలను సంగ్రహంగా పరిచయం చేసిన పద్ధతి అన్యూనానతిరిక్తంగా పండితపామర మనోరంజకంగా కనబడుతున్నది. పద్మ - నారద - గరుడ పురాణాల్లోని సూక్తులను వీరు కూర్చిన సరణి ఎంతో ప్రశంసనీయంగా సాగింది. భవిష్యపురాణంలో వివాహపద్ధతులు, వరాహపురాణంలో అన్నదాన మహిమ, స్కాంద పురాణంలో వనభోజన విశేషాలు, వామన పురాణంలో పుత్రుని కంటే శిష్యుడే గొప్పవాడని నిరూపించడం, కూర్మపురాణంలో శివకేశవుల అభేదనిరూపణం, అందులోనే గురువుల దగ్గర ఎలా ప్రవర్తించాలో నిరూపించిన పద్ధతి, మత్స్యపురాణంలో పితృమహాత్మ్యం, ఈ పుస్తకానికి ఎంతో వన్నె తెచ్చే అంశాలుగా రూపొందాయి. ఇతర భాషల్లో ఇలాంటి రచనలు కొన్ని వచ్చాయిగాని తెలుగులో ఇలాంటివి అంత ఎక్కువగా లేవు. ఇంత చక్కని పుస్తకాన్ని అందించిన ఈ రచయిత తెలుగువారి అభినందనలకు తప్పక పాత్రమౌతారని నా విశ్వాసం. వీరిని మనసారా అభినందిస్తున్నాను.

ఇలాగే ఉపపురాణాలను గూడా డా॥ రామకృష్ణ ఆంధ్రులకు పరిచయం చేస్తే బాగుంటుందని నేను భావిస్తున్నాను. శ్రీ పద్మావతీజాని శ్రీశ్రీనివాసమూర్తి దయ ఆ ప్రయత్నాన్ని సుసాధం చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

పదశాస్త్రతలస్పర్శివైదుష్యసువిభాసురః ।
రామకృష్ణశ్చిరంజీయాత్పురాణపరిచాయకః ॥

సత్యమ్     *- ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య*

6.11.97.

# ఆనందం



**శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ**

ప్రిన్సిపాల్

శ్రీగౌతమీ విద్యాపీఠం ఓరియంటల్ కళాశాల

రాజమండ్రి - 533 105

శ్రీయుతులు డా॥ జానమద్ది రామకృష్ణ రచించిన 'పురాణ పరిచయం' గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివాను. ఈ రోజుల్లో అవసరమైన విషయాన్ని కావలసినవారికి అందరికీ అందేలా సరళశైలితో అందించారు గ్రంథకర్త.

భారతీయతకు మూలాధారం వేదం. వేదములన్నీ పురాణాలలో పోషింపబడుతున్నాయి -

**"వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణే నాత్ర సంశయః".**

పురాణ జ్ఞానం ఐహికాముష్మిక సుఖసాధనం. కాని పురాణాలకు తగిన ప్రచారం కొరవడింది. మన సంస్కృతి, సదాచారం తెలుసుకోవాలంటే పురాణాలు తప్పక తెలుసుకోవాలి.

పురాణాల్లో లేనిదేదీ కానరాదు. మానవులంతా కర్తవ్యాన్ని నిర్ణయించుకొని మోక్షాన్ని పొందడానికి పురాణవిజ్ఞానం ఎంతో ఉపయోగ పడుతుంది.

అత్యావశ్యకమైన ఈ పురాణాల గురించి జనసామాన్యానికి పరిచయం కావించాలనే సత్సంకల్పంతో శ్రీరామకృష్ణ ఈ గ్రంథాన్ని రాశారు. సామాన్యులకు సైతం పురాణాల పట్ల అవగాహన, పురాణపఠనాసక్తి పెంచడం ఈ గ్రంథం లక్ష్యం. సమాజానికి కావలసిన ఆచరణ యోగ్యాలైన ఎన్నో అమూల్య విషయాలు ఈ గ్రంథంలో పొందుపరచడం జరిగింది. పురాణాల సందేశం, పురాణాల

క్రమంలోని నిగూఢ తత్త్వం చక్కగా వివరించారు. కేవలం విషయానుక్రమణికగా కాకుండ మధ్యలో ఆసక్తిని కల్గించే కథలను రసవత్తరంగా అందించే గ్రంథకర్త శైలి అభినందనీయం. కార్తవీర్యార్జుని కథ, జడభరత వృత్తాంతం, ధుంధుకారుని ప్రేతత్వముక్తి బ్రహ్మదత్తుని కథ, నిశాకరుని వృత్తాంతం మున్నగు వాటిల్లో కలిధర్మాలు, భాగవత సప్తాహ వైశిష్ట్యం, పితృశ్రాద్ధావశ్యకత, గురుభక్తి మహిమ, శిష్యధర్మం మొదలైన విషయాలు ఎన్నో వర్ణింపబడ్డాయి. పాఠకులకు కరదీపిక ఈ గ్రంథం.

డా॥ రామకృష్ణ సంప్రదాయబద్ధంగా మహామహోపాధ్యాయ కీ॥శే॥పేరి సూర్యనారాయణ శాస్త్రి గారి వద్ద వ్యాకరణ శాస్త్రాన్ని అభ్యసించారు. స్వతః సౌశీల్యం గల ఆయనకు గురుకృప వలన విజ్ఞానాభివృద్ధి కలిగింది. లోకహితం కోరి శ్రీరామకృష్ణ చేసిన ఈ కృషి అభినందనీయం. గ్రంథకర్త ప్రయత్నం సఫలం కాగలదనీ, సాధకులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారనీ నాకు గట్టి నమ్మకం. ఇట్టి గ్రంథాలు అసంఖ్యాకంగా అందించేందుకు తగిన శక్తి సామర్థ్యాలు శ్రీశారదా కటాక్షం వలన డా॥ రామకృష్ణకు సిద్ధించాలని మనఃపూర్వకంగా కోరుతూ నా అభినందనలు తెలుపుచున్నాను .

శుభం భూయాత్

రాజమండ్రి

12 - 11 - 1997

**- విశ్వనాథగోపాలకృష్ణ**

# 'అభినందన'

ప్రొ. కె.సర్వోత్తమరావు
తెలుగు విభాగాధ్యక్షులు
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము
తిరుపతి - 517 507

డా॥ జానమద్ది రామకృష్ణగారు నాకు చిరపరిచితులయిన మిత్రులు. రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠంలో ప్రస్తుతం వ్యాకరణ విభాగ అధ్యక్షులుగా రాణిస్తున్నవారు. శ్రీరామకృష్ణగారు ఇటీవల వ్రాసిన పుస్తకం 'పురాణపరిచయం'. తిరుమల తిరుపతి దేవస్థానం ఆర్థిక సహాయంతో ఈ పుస్తకాన్ని రామకృష్ణగారు ప్రచురించారు.

వేదాలు 'అపౌరుషేయాలు' అంటే నమ్మని వారున్నారు. పద్దెనిమిది పురాణాలు వ్యాసమహర్షి వ్రాసినదే అంటే అసాధ్యమనే వారున్నారు. పౌరాణికాంశాలు సత్యాలే అంటే పుక్కిటి పురాణాలని పెదవి విరిచే వారున్నారు. పురాణాలలో భౌగోళిక సత్యాలు. ఖగోళ విజ్ఞానం. నిత్య జీవితముకు సంబంధించిన అనేక అంశాలున్నాయంటే కొట్టిపడేసేవారున్నారు. ఇలాంటి వారంతా చదువుకున్న మూర్ఖులు. వీళ్లకంటే ఆంగ్లేయులు నయం. వేదాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. పురాణాలను ముద్రించడానికి సహకరించారు. ప్రాచీన ఆర్ష సంప్రదాయం విశిష్టమని తేల్చిచెప్పారు. సంస్కృత విద్యాభ్యసనం వెనకపడడంతో సంస్కృత గ్రంథాలలోని అనేకాంశాలు పండిత పామరులకు రమ్యంగా, హృద్యంగా, సంగ్రహంగా సారభూతంగా చెప్పవలసిన అవసరమేర్పడింది. ఈ కొరతను తీర్చడంలో ప్రయత్నశీలురయిన వ్యక్తి శ్రీరామకృష్ణ.

తెలుగులో లోగడ పురాణాలకు సంబంధించి కొన్ని చిన్న పుస్తకాలు వచ్చాయి. భారతీయతను స్పష్టం చేసే సందర్భాలలో పురాణాలను వివరించిన వారున్నారు. అలాగే హిందూధర్మ పరిచయం లాంటి పుస్తకాలలో పురాణాల ప్రశంసలున్నాయి. కాని డా॥ రామకృష్ణ 'పురాణ పరిచయం' పై వాటి కంటే భిన్నమనడంలో సందేహం లేదు. పురాణనామసార్థక్యం పురాణంలోని భాగాల

ప్రస్తావన, కొన్ని కథల వివరణ, చివర ఎపుడూ గుర్తుపెట్టుకోదగ్గ శ్లోకాలు వాటి వివరణ చెప్పడం శ్రీరామకృష్ణ రచనా ప్రణాళిక అనవచ్చు. ఇతర అంశాల కన్నా ప్రతిపురాణ పరిచయంలోనూ ఒక కథను ఎన్నుకొని వివరించే విధానం రసవత్తరంగా ఉంది. బ్రహ్మపురాణంలో 'కండువు కథ', భాగవతపురాణంలో 'ఆత్మదేవుని కథ' మార్కండేయ పురాణంలో ఋతుధ్వజుని కథ, లింగపురాణంలో అదృశ్యంతి కథ, మత్స్యపురాణంలో బ్రహ్మదత్తుని కథలు చెప్పిన తీరు చాలా బాగుంది.

ఈ 'పురాణ పరిచయం' లో నాకు నచ్చిన రెండవ అంశం సూక్తుల వివరణ. 'గరుడపురాణ' మనగానే మాట మార్చేయడం అలవాటు. కాని ఆ పురాణంలోని సూక్తుల్ని చాల చక్కగా వివరించారు రామకృష్ణగారు. అలాగే ఇతర పురాణాలలోని సదాచారాలను, సార్వత్రిక ధర్మాలను విశదీకరించారు. రచన సరళంగా చదువరుల్ని ఆకట్టుకునేలా ఉండడం మరో ప్రత్యేకత.

కాలం మారినా విదేశాలలో కూడా 'పురాణాలపై' చర్చా గోష్ఠులు సాగుతున్నాయి. ప్రాచీన కావ్యాలలో సభావర్ణనలలో 'పౌరాణికుల్ని' తప్పక చెప్పడం సాంప్రదాయం. పురాణాలు వ్రాసిన వారిని, పౌరాణికుల్ని గౌరవించడం ఆర్ష సంప్రదాయం, అలాగే రామకృష్ణ కృషికి మనసారా 'అభినందనొ' చెప్పడం సబబు. భవిష్యత్తులో ఈలాగే సమాజానికి పనికి వచ్చే సద్గ్రంథాలు అందివ్వాలని ఆకాంక్ష.

దీపావళి, — కె. సర్వోత్తమరావు.

31 - 10 - 1997.



# పురాణ భారతి

డా॥ మేడసాని మోహన్
డైరెక్టర్, అన్నమాచార్య ప్రాజెక్ట్
తి.తి దేవస్థానములు
తిరుపతి - 517 501

అధ్యాత్మచింతన, జ్ఞానసముపార్జన, అంతశ్చేతనా తత్త్వవివేచన ప్రాచీన భారతీయ సంస్కృతిలో ప్రధాన లక్షణాలు. అనాదిగా భారతీయ సహృదయ నిష్ఠకు ప్రతిబింబాలైన ఈ సద్గుణాలచే ప్రేరితమైన మహర్షుల తపోనిష్ఠ యొక్క అక్షర రూపాలే వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు మొ॥ నవి. కథాప్రవచనరూపంలో ఉండటంవల్ల పురాణాలు అందరికీ అందుబాటులో ఉన్నవని చెప్పవచ్చు. అష్టాదశ పురాణాలుగా ప్రసిద్ధి చెందిన ఈ సాహిత్యం మానవజాతి సుఖశాంతులతో మనుగడ సాగించడానికి కావలసిన సకల ధర్మ సూత్రాలనూ ప్రబోధిస్తూ ఉంది. మనుస్మృతిలో పురాణ వైశిష్ట్యం ఇలా పేర్కొనబడి ఉంది.

**''బిభేత్యల్పశ్రుతాద్వేదో**
**మామయం ప్రహరేదితి ।**
**ఇతిహాస పురాణాభ్యాం**
**వేదం సముపబృంహయేత్ ॥'' -**

**తా ॥** అల్పపాండిత్యము గలవాని వలన వేదము ''ఇతడు నన్ను మోసగించు'' నని భయపడునట. కావున ఇతిహాసపురాణముల నాధారముగా గొని వేదప్రతిపాద్యార్థమును పోషింపవలెను.'' -

పై మనుస్మృతి ప్రవచనాన్ని బట్టి పురాణ వాఙ్మయం ఎంత ప్రాధాన్యమును సంతరించుకొని ఉందో తెలుస్తూ ఉంది.

కానీ అధునాతన కాలంలో బాగా చదువుకొన్న పండితులూ, కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను ప్రముఖమైన ఔద్యోగిక వ్యాసంగంలో ఉన్నవారు కూడా వరుసగా పదునెనిమిది పురాణాల పేర్లు పేర్కొనలేని స్థితిలో

ఉన్నారు. ప్రాచీన వాఙ్మయంలో ఎంతో ప్రాశస్త్యాన్ని వహించిన ఈ పురాణాంతర్గత విశేషాల్ని అధ్యయనం చేయాలన్న తపన గలిగిన విద్యార్థులకు ఉత్తేజం కల్గింపలేకపోతున్నారు. ఇటువంటి పరిస్థితులలో సాహితీమిత్రులు శ్రీజానమద్ది రామకృష్ణ గారు ''పురాణపరిచయం'' అను పొత్తమును వెలువరించడం మిక్కిలి ప్రశంసనీయమైన అంశం. అధునాతన యుగంలో ఇటువంటి గ్రంథాల అవసరం ఎంతైనా ఉంది. పదునెనిమిది పురాణాలలో ఒక్కొక్క పురాణంలోని విశేషాలను, సారాంశాన్ని పొందికగా విశదీకరించారు. వస్తు ప్రతిపాదనలో ఔచిత్యం చెడకుండా, గ్రంథవిస్తర భీతి లేకుండా రామకృష్ణ గారు వెలువరించిన ఈ ''కృతి'' ని చూస్తుంటే పురాణ భారతి బాలాస్వరూపంతో సాక్షాత్కరించినట్లనిపించింది. కాల ప్రవాహంలో ప్రతి క్షణం ఎంత విలువైనదో బ్రహ్మపురాణంలో కండువు మహర్షి కథ ద్వారా తెలుస్తూ ఉంది. ఉసిరికాయ, తులసి ఎంత అమోఘ శక్తి సంపన్నాలో పద్మపురాణం చెబుతూ ఉంది. అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడే వారికి భాగవతంలోని గోకర్ణాఖ్యానం ఒక కనువిప్పు. ఇలా ప్రతి పురాణంలోని సారభూతములుగా ఒకటో, రెండో ఉపాఖ్యానాలు విశదీకరిస్తూ పురాణవాఙ్మయ వైశిష్ట్యాన్ని రామకృష్ణ గారు ప్రసన్న ధారాళశైలిలో అందించారు. అందుకు వారికి నా నమోవాకాలర్పిస్తున్నాను.

సప్తగిరీశ్వరుడైన శ్రీవేంకటేశ్వరుడు వీరికి సకల సౌఖ్యములు సమకూర్పగలడని ఆకాంక్షిస్తున్నాను.

తిరుపతి, **- మేడసాని మోహన్**

30 - 11 - 97.



# ఆకాంక్ష

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి
సెక్రటరీ
సి.పి.బ్రౌన్ లైబ్రరీ ట్రస్ట్
కడప - 516004

వేదములు గూఢమైనవి. సామాన్యులకు దురవగాహనమైనవి. వాటి సారసర్వస్వములుగ అవతరించిన గ్రంథత్రయమే భారత, భాగవత, రామాయణములు. ఇవి భారతీయసంస్కృతికి ఆకరములుగ ఉన్నవి.

**'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'** అన్నట్లు భారతీయుల ఆచార విచారవ్యవహారాలకు ప్రామాణికమైనవీ గ్రంథరాజములు. ఇతిహాస పురాణాదులు పంచమ వేదములు. ఆయా కాలాల్లో భారతీయ జీవన విధానాన్ని, సంస్కృతి, స్వరూప, స్వభావాలను సమగ్రంగా, కళాత్మకంగా చిత్రించాయి. మన పురాణాలు భారతీయ సంస్కృతీ విశ్వకోశాలు.

'పురాభవం పురాణం' అని మత్స్య పురాణం పేర్కొన్నది. విశిష్టమైన లక్షణములు గల శాస్త్రగ్రంథములు పురాణములు.

సృష్టి, పునః సృష్టి, దేవతలు, ప్రసిద్ధరాజుల వివరములు, ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విద పురాషార్థములు, దాన, వ్రత, నీతి, చతుః షష్టికళలు, తీర్థయాత్ర, స్థలపురాణ, యోగ, సాంఖ్యములు మొదలగువాటితో పాటు జీవితము మరియు మరణోత్తరముల సమగ్రచింతనములు పురాణములు. వాటి యందు ఆదరము కలిగినట్లల్లా జనజీవనము ఉత్తమము కాగలదు.

పురాణముల గురించే ఒక పురాణమున్నది. మహాపురాణములు 18, ఉపపురాణములు 18 – పురాణముల మొత్తము శ్లోక సంఖ్య దాదాపు 4 లక్షలు.

సృష్టి, స్థితి, లయకారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కథలే పురాణములు. వీటిలో పదిపురాణాలు శివపరమైనవి. నాలుగు బ్రహ్మపరమైనవి. రెండు విష్ణుపరమైనవి, రెండు దేవీపరమైనవి.

పురాణములు విభిన్నకాలములలో వెలువడినవి క్రీ.శ. మొదటి శతాబ్ది నుండి, సుమారు 12, 13 శతాబ్దముల వరకు వీటి రచన సాగింది భాగవత పురాణము క్రీ.శ. 5వ శతాబ్దికి చెందినదని ఒక అభిప్రాయం.

సూతమహర్షి మొదలైనవారు పురాణ ప్రవచనం చేసేవారు రాజులతోను, మహర్షులతోను వారు అన్యోన్యంగా ఉండేవారు. రాజాధి రాజులు

యజ్ఞయాగాదులు చేయించే స్థలములకు వెళ్ళేవారు అనేక మంది సూతులు రాజుల మంత్రిమండలిలో 'గణ్నాగి' అను సభను అలంకరించారు వీరు యజ్ఞకాలములో వీరుల గాథలను, వంశచరిత్రలను గానం చేసేవారు. వాటిలో ఇహపరముల కల్పనలుండేవి. అవతారముల గురించి స్వర్గ - నరకముల గురించిన వర్ణనలుండేవి.

ఈ పురాణములను సర్వత్రా వ్యాప్తం కావించినవారు రోమ హర్ష, ఉగ్రశ్రవులు. వీరు సూత మండలికి చెందిన వారు. ఆనాడు అన్నీ ఒకే రూపమున ఉండేది. ఈ బృహత్ పురాణ సంహితను, సత్యవతీ తనయుడైన వ్యాసమహర్షి 18 పురాణములుగ విభజించి లోక కల్యాణము కొరకు ప్రచారమొనర్చినాడు. ప్రపంచములో ప్రప్రథమ గ్రంథ సంపాదకుడు వ్యాసమహర్షి.

వేదోపనిషత్తులు ప్రభుసమ్మితములు. వాటి సారమే మిత్ర సమ్మితములైన పురాణములు. సత్యధర్మముల ఆలంబనముతో జీవనము సాగినపుడే మానవునకు శ్రేయస్సు. వాటి సందేశములను అనుసరించి నడచుకొన్నపుడు జనజీవనములో నీతిధర్మముల స్థాయి పెరిగి సుఖ శాంతులు లభిస్తాయి.

పురాణాల సందేశాలు సార్వకాలికములే కాక సార్వజనీనములు. తమిళ ఆళ్వార్లు, కర్ణాటక దాస పరంపరకు చెందిన భక్తులు, బసవేశ్వరుని వంటి వచనకారులు, వంగ రాష్ట్రానికి చెందిన చైతన్యమహాప్రభు, మహారాష్ట్రమునకు చెందిన జ్ఞానదేవ్, నామదేవ్, ఏకనాథ్, తుకారాం, కబీర్, గురునానక్ మున్నగువారు పురాణాలలోని గాథలను వివిధ రూపాలలో చిత్రించి ప్రజానీకంలో ధర్మానురక్తిని, భక్తిని పెంపొందించారు.

మేరువు అంతటి పురాణ విజ్ఞానాన్ని సంగ్రహంగా, పరిచయాత్మకంగా, సుబోధకంగా సామాన్యులకు సైతం అందజేయుటకు ఉద్దేశించినది, ఈ 'పురాణ పరిచయం' అన్న గ్రంథం.

గ్రంథ ఉపోద్ఘాతంలో, పురాణాలకు ఆధారమైన అంశాలను, ప్రధానమైన సందేశాలను సంగ్రహంగా అందించుట అభినందనీయం.

చి. రామకృష్ణ, మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రి గారి అంతేవాసిగ వ్యాకరణ శాస్త్రాధ్యయనం కావించి వారి అనుగ్రహమునకు, ఆశీస్సులకు పాత్రుడు కావటం అతని పురాకృత సుకృతం.

చి. రామకృష్ణ అధ్యయన శీలుడై మరికొన్ని ఉత్తమ రచనలు చేయుటకు కృషి సాగించాలి. ఈ రచన అట్టి కృషికి నాందీవాచకం కావాలని ఆకాంక్షిస్తూ ఆశీస్సులందజేస్తున్నాను.

కడప, — జానమద్ది హనుమచ్ఛాస్త్రి

27-10-1997.

# పురాణపరిచయం

## ఉపోద్ఘాతము

భారతీయ సంస్కృతికి మూలాధారం వేదాలు. మనదేశంపై ఎన్నో దురాక్రమణలు జరిగినా మన సనాతన సంస్కృతి చెక్కు చెదరక పోవడానికి కారణం వేదాలే. వేదాలపట్ల మనకు గల పూజ్యభావం కారణంగానే ఐహిక, ఆముష్మిక సుఖాల్ని పొందగలుగుతున్నాము. మానవులు తమ జీవితంలో తప్పనిసరిగ ఆచరించవలసిన కర్తవ్యాల్ని ఎన్నిటినో ఉపదేశిస్తున్నాయి వేదాలు. ఉదాహరణకు - ''పుమాన్ పుమాంసం పరిపాతు విశ్వతః'' అనే వైదికమంత్రం ఒక మనిషికి మరియొక మనిషి సహాయం చేయడం ద్వారా తమ జన్మను పవిత్రం చేసికోవాలని ఉపదేశిస్తున్నది. ఇట్లే, ''మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని'' అనే మంత్రం సమస్త ప్రాణులను మైత్రీభావంతో చూడాలని హితబోధ చేస్తున్నది.'' కృణ్మో బ్రహ్మ వో గృహే సంజ్ఞానాం పురుషేభ్యః'' అనే మంత్రం - ఓ జనులారా! మనమందఱం కలసి మానవుల్లో సద్బుద్ధి కొఱకు, సద్భావనకోసం దైవాన్ని ప్రార్థిద్దామనే సుభావబీజం వేస్తోంది. ఈ విధంగా ఎన్నో ఆదర్శాలను చూపడం ద్వారా మానవుడు తన జన్మను సార్థకం చేసికోవడానికి సన్మార్గాన్ని ఉపదేశిస్తున్నాయి వేదాలు. ఇట్లే, ''సత్యం వద'' ''ధర్మం చర'' ''మాతృదేవో భవ'' ''పితృదేవో భవ'' ''ఆచార్యదేవో భవ'' ''అతిథి దేవో భవ'' మొదలైన మంత్రాలు సత్యాన్ని, ధర్మాన్ని, పెద్దలపట్ల గౌరవాన్ని, అతిథులను సన్మానించడాన్ని మన అవశ్యకర్తవ్యాలుగ బోధిస్తున్నాయి.

ప్రతిమానవుడు ధర్మార్థకామమోక్షాలనే పురుషార్థచతుష్టయాన్ని సాధించాలనేదే వేదాల అభిమతం.

ఈ వేదాల్లోని నిగూఢార్థాల్ని బయటకి తీసి సామాన్య మానవునికి సైతమర్థమయ్యేలా హితోపదేశం చేయడానికే పురాణాలు బయల్దేరాయి. ఈ కారణంగానే ఋగ్యజుస్సామాథర్వవేదాలనే నాలుగు వేదాలతో సమానంగా ''పురాణం పంచమో వేదః'' అని అయిదవ వేదంగా కీర్తింపబడుతోంది పురాణ వాఙ్మయం. పురావృత్తం = పురాణం అనే వ్యుత్పత్తినిబట్టి ఒకప్పుడు జరిగిన వృత్తాంతాన్ని తెలియజేస్తూ తద్వారా మంచిని చెప్పేవే పురాణాలు. పురాణాల్లో లేని విషయాలంటూ ఏవీ లేవు. దేవతల వర్ణన, సదాచారాలు, 14 విద్యలు, స్త్రీ-పురుషుల కర్తవ్యాలు, గురు-శిష్యసంబంధం, రాజ్య పరిపాలనా విధానం, పరోపకారం, పుణ్యక్షేత్రాలు, నదులు, భక్తి-జ్ఞాన-వైరాగ్యాలు మొదలైన పెక్కు విషయాల్ని తనలో దాచుకొంది పురాణం.

సాహితీప్రక్రియల్లో ఒకటైన పురాణప్రక్రియ ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకొంది. ఇంతటి విస్తృత ప్రక్రియ మరేదీ లేదు.

**14 ప్రాచీన విద్యలు -**

అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః।
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతాశ్చతుర్దశ॥

అని మన సాంప్రదాయ విద్యలు పద్నాలుగు చెప్పబడ్డాయి. అవి -
వేదాలు - 4 (ఋగ్వేదం - యజుర్వేదం - సామవేదం - అథర్వవేదం)
వేదాంగాలు-6 (శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పము)
మీమాంస-2 (పూర్వమీమాంస, ఉత్తరమీమాంస)
పురాణం మరియు ధర్మశాస్త్రం

వీటిలో వేదాలు మానవుల్ని కర్తవ్యనిర్వహణలో ప్రభువువలె శాసిస్తాయి. ఈ కారణంగా వేదాల్ని ప్రభుసమ్మితాలంటారు. స్మృతులు, శాస్త్రాలు కూడ ఈ కోవలోనికే వస్తాయి.

పురాణలీవిధంగా గాక ధర్మమార్గంలో గల లాభాలను, అధర్మ మార్గంలో గల నష్టాల్ని విడమఱిచి మిత్రుని వలె ఉపదేశిస్తూ ధార్మిక కార్యాల పట్ల ఆసక్తిని, అధార్మికకార్యాలపట్ల ఉదాసీన భావాన్ని కలుగజేస్తాయి. గనుకనే పురాణాలు మిత్రసమ్మితాలుగ ప్రశస్తినందు కొన్నాయి.

**పురాణ లక్షణం -**

ప్రతి పదార్థానికి లక్షణాలంటూ ఉంటాయి. ఈ విధంగా ఆలోచించేటపుడు పురాణలక్షణాలేవి? అనే సందేహం కలగడం సహజం. దీనికి సమాధానంగా -

''సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ।

వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్ ॥

అని పురాణలక్షణం చెప్పడమైనది. 1. సర్గ 2. ప్రతిసర్గ 3. వంశం 4. మన్వంతరం 5. వంశానుచరితమనే లక్షణాలు కలిగియున్నదే పురాణం. సర్గ అనగా ప్రపంచం యొక్క సృష్టి. ప్రతిసర్గ అనగా సమస్త ప్రపంచం యొక్క ప్రళయం. వంశమంటే రాజులు మరియు ఋషుల సంతాన పరంపర. మన్వంతరమనగా మనవు, మనుపుత్రులు, ఋషులు, దేవతలు, ఇంద్రుడు మరియు విష్ణువు యొక్క అవతారాలనే ఆరు విశేషాలతో కూడిన అంశము. వంశాను చరితమనగా రాజవంశాల్లోనూ మరియు ఋషి వంశాల్లోనూ పుట్టినవారిని గుఱించిన చరిత్ర చర్చ. ఇవీ పురాణ లక్షణాలు. శ్రీమద్భాగవతంలో 10 పురాణలక్షణాలున్నాయి. కాని, అవన్నియు ఈ ఐదు లక్షణాల క్రిందికే వస్తాయి.

**పురాణ కర్త -**

ఇంతటి మహత్త్వపూర్ణాలైన పురాణాల రచయిత ఎవరు? అనే ప్రశ్నకు-

విష్ణోరంశో మునిర్జాతః సత్యవత్యాం పరాశరాత్।

పురాణ సంహితాం దధ్యౌ తేషాం ధర్మవిధిత్సయా ॥

అనే ప్రమాణాన్ననుసరించి సత్యవతీ - పరాశరుల పుత్రుడుగ

శ్రీమహావిష్ణువు యొక్క అంశవల్ల పుట్టిన శ్రీ వ్యాసభగవానుడు ఈ పురాణాల్ని రచించినట్లు తెలుస్తోంది. ''అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః'' అనే వచనం కూడ ఈ అర్థాన్నే తెలియజేస్తున్నది. ఈ వ్యాసమహర్షియే వేదవిభాగం, బ్రహ్మ సూత్రరచన, మహాభారత రచన చేశాడు.

ఈ విధంగా పురాణకర్త వ్యాసభగవానుడు. కాగా పురాణవక్త అనగా వ్యాసవిరచిత పురాణాల్ని మొదటగ చెప్పింది సూతుడు. సూతుడు పురాణాల్ని చెబుతున్న సమయంలో విన్నవారు నైమిశారణ్యవాసులు, ప్రశాంత చిత్తులైన శౌనకుడు మొదలైన 88వేల మంది ఋషులు. ఈరీతిగా పురాణకర్తయగు వ్యాసమహర్షితో పాటు వక్తయగు సూతముని, శ్రోతలగు శౌనకాదులు మనకు సర్వదా సంస్మరణీయులు. పురాణ వాఙ్మయాన్ని అనుగ్రహదృష్టితో మనకందించడం ద్వారా మహోపకారం చేశారీమహానుభావులు.

## పురాణాలెన్ని?

మహాపురాణాలు, ఉపపురాణాలని పురాణాలు రెండు విధాలుగా ఉన్నాయి. వీటిలో మహాపురాణాలు -

బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవ చ।
భాగవతం నారదీయం మార్కండేయం చ కీర్తితమ్ ॥
ఆగ్నేయం చ భవిష్యం చ బ్రహ్మవైవర్తలింగకే।
వారాహం చ తథా స్కాందం వామనం కూర్మసంజ్ఞకమ్ ॥
మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్।

అనే ప్రమాణాన్ని బట్టి -

1. బ్రహ్మపురాణం
2. పద్మపురాణం
3. విష్ణుపురాణం
4. వాయుపురాణం
5. శ్రీమద్భాగవతపురాణం
6. నారదపురాణం
7. మార్కండేయపురాణం
8. అగ్నిపురాణం
9. భవిష్యపురాణం
10. బ్రహ్మవైవర్తపురాణం
11. లింగపురాణం
12. వరాహపురాణం

13. స్కాందపురాణం 14. వామనపురాణం
15. కూర్మపురాణం 16. మత్స్యపురాణం
17. గరుడపురాణం 18. బ్రహ్మాండపురాణం

అనురీతిగా ఇవి 18 విధాలు. ఈ పురాణాల్ని తేలిగ్గా తెలిసికోడానికి చిన్న చిట్కాలాగ ఉపయోగ పడుతుందీ క్రింది శ్లోకం -

**మ**ద్వయం **భ**ద్వయం చైవ **బ్ర**త్రయం **వ** చతుష్టయం।
**అ నా ప లిం గ కూ స్కా**ని పురాణాని ప్రచక్షతే॥

అనగా - మ-అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు రెండు.

1. మత్స్యపురాణం 2. మార్కండేయపురాణం.

భ-అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు రెండు.

1. భాగవతపురాణం 2. భవిష్యపురాణం

బ్ర-అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు మూడు.

1. బ్రహ్మపురాణం, 2. బ్రహ్మవైవర్తపురాణం, 3. బ్రహ్మాండపురాణం

వ-అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు నాలుగు.

1. వాయుపురాణం 2. విష్ణుపురాణం
3. వరాహపురాణం 4. విష్ణుపురాణం - వామన పురాణం

అ-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - అగ్నిపురాణం
నా-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - నారదపురాణం
ప-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - పద్మపురాణం
లిం-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - లింగపురాణం
గ-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - గరుడపురాణం
కూ-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - కూర్మపురాణం
స్క-అనే అక్షరంతో మొదలయ్యే పురాణం ఒకటి - స్కందపురాణం

## మహావిష్ణువుయొక్క అవయవాలు అష్టాదశపురాణాలు -

ఈ విధంగా అష్టాదశ మహాపురాణాలు లోకవ్యవహారంలో ఉన్నాయి. ఈ అష్టాదశ (18) పురాణాల్ని మహావిష్ణువు యొక్క శరీరంలోని 18 అవయవాలతో పోల్చారు.

బ్రాహ్మం మూర్ధా హరేరేవ హృదయం పద్మసంజ్ఞకం।
వైష్ణవం దక్షిణో బాహుః వాయుర్వామో మహేశితుః॥
ఊరూ భాగవతంప్రోక్తం నాభిః స్యాన్నారదీయకం।
మార్కండేయం చ దక్షాంఘ్రిః వామో హ్యాగ్నేయముచ్యతే॥
భవిష్యం దక్షిణో జానుర్విష్ణోరేవ మహాత్మనః।
బ్రహ్మవైవర్తసంజ్ఞం తు వామో జానురుదాహృతః॥
లైంగం తు గుల్ఫకం దక్షం వారాహం వామగుల్ఫకం।
స్కాందం పురాణం లోమాని త్వగస్య వామనం స్మృతమ్॥
కౌర్మం పృష్ఠం సమాఖ్యాతం మాత్స్యం మేదః ప్రకీర్త్యతే।
మజ్జా తు గారుడం ప్రోక్తం బ్రహ్మాండమస్థి గీయతే॥
ఏవమేవాభవద్విష్ణుః పురాణావయవో హరిః॥

**ఈ శ్లోకాల వివరణ -**

1. బ్రహ్మ పురాణం - మహావిష్ణువుయొక్క శిరస్సు
2. పద్మపురాణం - మహావిష్ణువుయొక్క హృదయం
3. విష్ణు పురాణం - మహావిష్ణువుయొక్క కుడిచేయి
4. వాయుపురాణం - మహావిష్ణువుయొక్క ఎడమచేయి
5. శ్రీమద్భాగవత పురాణం - మహావిష్ణువుయొక్క తొడలు
6. నారదపురాణం - మహావిష్ణువుయొక్క నాభి
7. మార్కండేయ పురాణం - మహావిష్ణువుయొక్క కుడిపాదం
8. అగ్నిపురాణం - మహావిష్ణువుయొక్క ఎడమపాదం
9. భవిష్యపురాణం - మహావిష్ణువుయొక్క కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్త పురాణం - మహావిష్ణువుయొక్క ఎడమ మోకాలు
11. లింగపురాణం - మహావిష్ణువుయొక్క కుడి చీలమండ
12. వరాహ పురాణం - మహావిష్ణువుయొక్క ఎడమ చీలమండ
13. స్కందపురాణం - మహావిష్ణువుయొక్క కేశములు
14. వామన పురాణం - మహావిష్ణువుయొక్కచర్మము
15. కూర్మపురాణం - మహావిష్ణువుయొక్క వీపుభాగం

18. మత్స్య పురాణం - మహావిష్ణువుయొక్క మెదడు
17. గరుడ పురాణం - మహావిష్ణువుయొక్క మాంససారము
18. బ్రహ్మాండ పురాణం - మహావిష్ణువుయొక్క ఎముకలు

## పురాణాల్లో నీతిబోధ -

పురాణకథలు వినడంవల్ల వాటిలోని విషయాలు వెంటనే మన బుద్ధిలోకి ప్రవేశిస్తాయి. ఇవే విషయాలు వేదాల్లో కూడ ఉన్నాయి. అయితే వేదాలు సులభంగా తెలిసేవి కావు. ఉదాహరణకు - మనిషి ఎలా పరిపూర్ణుడు కాగలడో, అందుకు కావలసిన సాధనాల గుఱించీ ఎంతో వివరంగా తెలియజేస్తున్నది ఈశావాస్యోపనిషత్తు. కాని, ఇది అర్థం కావడం ఎంతో కష్టం. ఇదే గనుక పురాణాల్లో అయితే దధీచిమహర్షి, శిబిచక్రవర్తికథలవలన ఉపకారగుణము, హరిశ్చంద్రుడు, ధర్మరాజు మొదలగు వారి కథలవలన సత్యనిష్ఠ, బలి చక్రవర్తి, కర్ణుడు మొదలైనవారి చరిత్రలవలన దానగుణము, అనసూయ, సీత, సావిత్రి, మదాలస, దమయంతి మొ॥ వారి చరిత్రల ద్వారా పాతివ్రత్యగుణము మొదలగు అంశాలు తేలిగ్గా తెలియడం ద్వారా ఆ సద్గుణాలు మనలో కూడ ప్రవేశించి మనం పరిపూర్ణులు కావడానికి ఎంతో సహకరిస్తాయి పురాణాలు.

## పురాణాలద్వారా కులతత్త్వజాడ్య నివారణ -

నేటివలె పురాణకాలంలోని ఆచార వ్యవహారాలు సంకుచితాలు కావు. ఈ రోజుల్లో కనిపిస్తున్న కులతత్త్వభావన అప్పట్లో లేదు. ఉదాహరణకు 1. రామాయణకర్తయైన వాల్మీకిని ఆదికవిగ, మహర్షిగ అందఱు పూజిస్తారు. 2. పవిత్రాంతఃకరణుడైన శుకముని మొదలగు వారు సైతం క్షత్రియుడైన జనకమహారాజునుండి తత్త్వోపదేశం పొందారు. 3. ధర్మవ్యాధునివలన కౌశికుడు ధర్మోపదేశం పొందాడు. 4. తులాధారుడనే వైశ్యునివలన జాజలిమునికి జ్ఞానోదయమైంది. 5. హిడింబ - భీమసేనుల పుత్రుడైన ఘటోత్కచుడు క్షత్రియులతో కలసి యుద్ధరంగంలో

పాల్గొన్నాడు. 6. శబరి సమర్పించిన ఎంగిలి పళ్లను శ్రీరామచంద్రుడు తినలేదా? ఈ ఉదాహరణల ద్వారా పురాణకాలంలో కులతత్త్వజాడ్యం లేదని స్పష్టమవుతోంది.

## స్త్రీలను గౌరవించిన పురాణాలు -

పురాణాల్లో స్త్రీలకెంతో ఉన్నతస్థానం కనిపిస్తున్నది. 1. ఒక్క సీతకోసం శ్రీరామచంద్రుడు రావణాసురుని సర్వస్వము నాశనం చేశాడు. 2. సభలో అవమానింపబడిన ద్రౌపదిని ఓదార్చేందుకు పాండవులు జరిపిన మహాభారత సంగ్రామంలో కురువంశం మొత్తం బలయింది. 3. సతీదేవికి జరిగిన అవమానం భరించలేక పరమశివుడు దక్షయాగాన్ని విధ్వంసం చేశాడు. ఈ సంఘటనలేగాక స్త్రీల గౌరవానికద్దం పట్టే మరికొన్ని ఉదాహరణలు :- మహావిష్ణువు లక్ష్మీపతిగ, శివుడు గౌరీపతిగ, శ్రీరామచంద్రుడు సీతాపతిగ పిలవబడుతున్నారు. అంతేగాక శ్రీరాముడు కౌసల్యానందనుడుగ, శ్రీకృష్ణుడు దేవకీసుతుడుగ, వినాయకుడు ఉమాసుతుడుగ, పాండవులు కుంతీపుత్రులుగ కీర్తింపబడుతున్నారు. ఇంకా చెప్పాలంటే - పూజాసమయంలో లక్ష్మీనారాయణులు, ఉమామహేశ్వరులు, వాణీ పురందరులు, సీతారాములు అనడం ద్వారా అయ్యగార్లతోపాటు అమ్మవార్లుకూడ పూజలందుకుంటున్నారు. అంటే తల్లిగ, భార్యగ స్త్రీమూర్తి లోకంలో మన్ననలను పొందుతోంది. మరో విశేషమేమంటే మనదేశంలో ఎక్కడాలేని విధంగా పూరి జగన్నాథక్షేత్రంలో బలరామ-శ్రీకృష్ణులతో సమానంగా తమ సోదరి సుభద్రాదేవి నేటికీ ఘనంగా పూజలందుకొంటున్నది. ఈ విధంగా అన్ని రకాలుగ ధన్యురాలు స్త్రీమూర్తి. ఈ ఉదాహరణలన్నీ మహిళను మనం ఎలా గౌరవించాలో తెలియజేస్తున్నాయి. గనుకనే - ''యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః'' అని ఆర్యోక్తి.

## పురాణాల క్రమం - అందులోని నిగూఢతత్త్వం -

అష్టాదశ మహాపురాణాల్లో ఒక క్రమమున్నది. మొదటిది బ్రహ్మపురాణమనీ, రెండవది పద్మపురాణమనీ, మూడవది విష్ణు

పురాణమనీ ఈవిధంగా వరుసగ ఆయా పురాణాలను పేర్కొనడమైనది. ఈ క్రమాన్ని పాటించడంలో ఒక నిగూఢతత్త్వం దాగియుంది. అదేమిటంటే -

మనకు కనిపిస్తున్న ఈ బ్రహ్మాండాన్ని ఎవరు సృష్టించారు? అనే సందేహం కలుగుతుంది. దీనికి సమాధానం బ్రహ్మపురాణం చెబుతుంది. స్థావర-జంగమాత్మకమైన ఈ లోకాలను సృష్టించింది బ్రహ్మయే అంటూ ఆ బ్రహ్మ స్వరూపాన్ని సమగ్రంగా తెలియజేస్తున్నది తొలిదైన బ్రహ్మపురాణం.

మరి, ఈ బ్రహ్మ ఎలా పుట్టాడు? అనే ప్రశ్న వస్తుంది. మహావిష్ణువు యొక్క నాభికమలంనుండి బ్రహ్మ ఉత్పన్నుడయ్యాడని చెబుతోంది రెండవదైన పద్మపురాణం.

బాగానే ఉందిగాని ఈ కమలం ఏమిటి? అనే ప్రశ్నకు జవాబుగ విష్ణుపురాణం ఉపదేశింపబడింది.

తరువాత ప్రశ్న, ఈ విష్ణువుకాధారమేమిటి? దీనికి సమాధానం-శేషతల్పం విష్ణువుకాధారమనీ, ఆ ఆదిశేషుని గురించి బోధించే పురాణం వాయుపురాణం.

ఈ ఆదిశేషునికాధారమైనది క్షీరసాగరమనియూ, ఈ క్షీరసాగరవర్ణన అద్భుతంగా కనిపిస్తుంది శ్రీమద్భాగవతంలో.

క్షీరసాగరంలోని మహావిష్ణువుయొక్క సన్నిధిలో సదా నారదమహర్షి ఉంటాడని, ఆనారదమహర్షికి సంబంధించిన వివరాలనందించేదే నారదపురాణం.

స్థూలంగా పై ఆరుపురాణాల మూల సిద్ధాంతాన్ని తెలియజేసేదే మార్కండేయపురాణం.

ఎనిమిదవదైన అగ్నిపురాణంలో అగ్నిదేవుని మాహాత్మ్యం చెప్పడమైనది.

చరాచరమైన ఈసృష్టి నిర్మాణంలోను, మరియు అగ్నియొక్క ఆవిర్భావంలోనూ విలక్షణమైన పాత్రను నిర్వహించేవాడు సూర్యుడు. ఈ సూర్యతత్త్వం గురించి వివరించడమైనది భవిష్యపురాణంలో.

ఈ ప్రశ్న-జవాబులన్నీ అయ్యాక సూక్ష్మదృష్టితో ఆలోచిస్తూ మళ్ళీ ఒక్కసారి వెనక్కి వెళ్ళి బ్రహ్మచేసిన పరిణామమే ఈ సృష్టియని పునరుద్ఘోషిస్తున్నది పదవదైన బ్రహ్మవైవర్తపురాణం.

ఈ విధంగా సృష్టికి మూలమైన సగుణ బ్రహ్మను ఉపాసించే మార్గాలనుపదేశిస్తున్నది పదకొండవదైన లింగపురాణం మరియు పదమూడవదైన స్కాందపురాణం.

ఇక, మహావిష్ణువు యొక్క అవతారాలను, లీలలను వర్ణిస్తున్నాయి. పన్నెండవదైన వరాహపురాణం, మరియు పదునాలుగు, పదిహేను, పదహారవ పురాణాలైన వామన-కూర్మ-మత్స్యపురాణాలు.

ఈ సృష్టిచక్రంలో అటూ ఇటూ తిరుగుతున్న జీవులు ఏయే కర్మలవలన ఏయే జన్మలను పొందగలరో ఆవివరాలను తెలియజేసే పురాణం పదిహేడవదైన గరుడపురాణం.

సృష్టిలోని లోకాల స్థితి-గతుల యొక్క ఆధారాన్ని తెలియజేసేదే చివరిదైన బ్రహ్మాండపురాణం.

ఇదీ పురాణాల క్రమం. ఇది ఒక కల్పన మాత్రమే. అయితే పైవిషయాలేగాక మరెన్నో ఇతర విషయాలు పై పురాణాలన్నిటిలోనూ ఉన్నాయి. కాని, ప్రధానంగా చెప్పబడిన విషయాలను మాత్రం దృష్టిలో ఉంచుకొని ఈక్రమం చెప్పవచ్చును.

## పురాణాల్లో యోగసిద్ధులు -

మానవుడు ఏకాగ్రచిత్తంతో వ్యవహరిస్తే అద్భుతాలైన సిద్ధులను పొందవచ్చును. తద్వారా ఏ అసాధ్యాన్నైనా సుసాధ్యం చేయవచ్చును. ఇలా చేయడం ద్వారా ఇహలోకంలో కీర్తి ప్రతిష్ఠలేగాక పరలోకంలో భగవత్సాయుజ్యం సైతం పొందవచ్చునని ఉద్బోధిస్తున్నాయి ఈ అష్టాదశ మహాపురాణాలు.

పరశురాముడు తన తండ్రియైన జమదగ్ని ఆజ్ఞను శిరసావహించి తన తల్లియైన రేణుకాదేవి శిరస్సును ఖండిస్తాడు. పితృవాక్య పరిపాలనతో

సంతుష్టుడైన జమదగ్ని తన తపస్సిద్ధి వలన మళ్ళీ భార్యను బ్రతికించు కుంటాడు. ఇలాగే, భగీరథుడు గంగను భూలోకానికి తేవడము, అగస్త్యుడు మహాసముద్రాన్ని ఆచమనం చేయడం మొదలైన సంఘటనలకు కారణం వారి **తపస్సిద్ధి**యే.

దేవతల ప్రార్థనను మన్నించి దధీచిమహర్షి తన ఎముకలను ఇంద్రుని వజ్రాయుధ నిర్మాణం కొఱకు సంతోషంగా ఇచ్చాడు. అతడు సమాధి స్థితిలోనికి వెళ్ళినపుడు దేవతలు అతని ఎముకలను తీసికొన్నారు. తన శరీరాన్ని సునాయాసంగా సమర్పించేందుకు గల కారణం ఆ మహర్షియొక్క **సమాధిస్థితి**యే.

సీతాన్వేషణకై లంకకు వెళ్తున్న హనుమంతుణ్ణి సముద్రమధ్యంలో ఆపుతుంది సురస అనే రాక్షసి. అతన్ని మింగాలని ప్రయత్నిస్తుంది. అపుడు ఆ రాక్షసికంటె ఎన్నోరెట్లు తన శరీరాన్ని పెంచాడు వాయుపుత్రుడు. ఈ సంఘటన అతని **మహిమాసిద్ధి**ని సూచిస్తున్నది.

సంజయుడు యుద్ధభూమికెంతో దూరంలో ఉన్నప్పటికీ మహాభారత సంగ్రామాన్ని సంపూర్ణంగా చూడగలిగాడు. దీనికి కారణం వ్యాసమహర్షి తన**యోగసిద్ధి**ద్వారా అతనికిచ్చిన దివ్యదృష్టియే.

యోగసిద్ధులను గుఱించి ఇలాంటి ఉదాహరణలెన్నైనా యివ్వ వచ్చును. బ్రహ్మవైవర్తపురాణంలో ఈవిధమైన యోగసిద్ధులు 22 చెప్పడమైనవి. అవి –

1. అణిమ 2. లఘిమ 3. ప్రాప్తి
4. ప్రాకామ్యం 5. మహిమ 6. ఈశిత్వం
7. వశిత్వం 8. కామావసాయిత్వం 9. దూరశ్రవణం
10. పరకాయప్రవేశం 11. మనోజవిత్వం 12. సర్వజ్ఞత్వం
13. అభీష్టం 14. అగ్నిస్తంభనం 15. జలస్తంభనం
16. చిరజీవిత్వం 17. వాయుస్తంభనం
18. క్షుత్పిపాసానిద్రాస్తంభనం 19. వాక్సిద్ధి 20. మృతానయనం
21. సృష్టికరణం 22. ప్రాణాకర్షణం.

వీటిని చెప్పాక ఇవి ఎలా సిద్ధిస్తాయో కూడా చెబుతోంది పై పురాణం. అయితే సాధనలో పరిశుద్ధత లేకపోవడం, యమ-నియమాదుల అనుష్ఠానలోపం మొదలైన కారణాలవల్ల ఈసిద్ధులు వశంకావడం లేదు. కాని, నిర్మలాంతః కరణంతో, ఏ ఇతర వాసనలను దగ్గఱకు చేరనీయక ప్రయత్నిస్తే ఇవి తప్పక సిద్ధిస్తాయి.

ఈవిధంగా మానవాళికుపయోగపడే ఎన్నో రహస్యాలు పురాణాల్లో ఉన్నాయి.

**పురాణాల్లోని ప్రధానమైన సందేశాలు -**

1. ధర్మాన్ని రక్షించడం ద్వారా రాజ్యం, స్వర్గం, ఆయువు, కీర్తిప్రతిష్ఠలు, మోక్షం మొదలైనవి సిద్ధిస్తాయని బ్రహ్మపురాణం చెబుతోంది.
2. సృష్టిలోని సమస్తమూ హరిమయమే అని ఉపదేశిస్తున్నది పద్మపురాణం.
3. శివ-కేశవుల మధ్య భేదం లేదనీ ఈ కారణంగా వారిని భేద భావంతో చూడరాదని విష్ణుపురాణం సందేశం.
4. గయాక్షేత్రాన్ని దర్శించి వచ్చిన పుత్రుడు తల్లిదండ్రులకు అమితానందాన్ని కలుగజేస్తాడని వాయుపురాణ కథనం.
5. మోక్ష సాధనాల్లో అత్యుత్తమమైనది భక్తియే అంటూ భక్తితత్త్వాన్ని సూచిస్తోంది శ్రీమద్భాగవతం.
6. ఏకాదశీవ్రతాన్ని నియమ-నిష్ఠలతో ఆచరించాలని తద్ద్వారా అభీష్టాలన్నీ సిద్ధిస్తాయని రుక్మాంగదచరిత్ర ద్వారా ఉపదేశిస్తోంది నారదపురాణం.
7. దుర్గాసప్తశతి పారాయణద్వారా సంపదల్లోనూ, ఆపదల్లోనూ శ్రేయస్సుకలుగుతుందని మార్కండేయ పురాణోక్తి.
8. ఉత్పత్తి-ప్రళయాలను, ప్రాణుల జీవన-మరణాలను, విద్య-అవిద్యలను తెలిసినవాడే భగవంతుడని నిర్దేశిస్తున్నది అగ్నిపురాణం.
9. సూర్యభగవానుని మహిమలను తెలియజేస్తోంది భవిష్య- పురాణం.

10. అతిథులను గౌరవించడమలవఱచుకోవాలని హితోపదేశం చేస్తోంది బ్రహ్మవైవర్తపురాణం.
11. కాశీక్షేత్ర మాహాత్మ్యాన్ని బోధిస్తున్నది లింగపురాణం.
12. యమునా-సరస్వతుల సంగమంలో విష్ణుపూజ సకలాభీష్ట ప్రదాయకమని వరాహపురాణం వక్కాణిస్తోంది.
13. శ్రీ సత్యనారాయణస్వామి వ్రతమాహాత్మ్యాన్ని, దేవాలయ జీర్ణోద్ధరణ ఫలాన్ని తెలియజేస్తున్నది స్కంద పురాణం.
14. విష్ణుభక్తులు, విష్ణుమందిరాలను గుఱించి విశదపఱుస్తోంది వామన పురాణం.
15. తమ బాధ్యతల్ని విస్మరించి పుణ్యక్షేత్రాల దర్శనపేరంతో వెళ్ళరాదని కూర్మపురాణ హితోక్తి.
16. మరణించిన పితృదేవతలకు భక్తిశ్రద్ధలతో శ్రాద్ధవిధిని జరపాలని ఉపదేశిస్తున్నది మత్స్యపురాణం.
17. అగ్రవర్ణాలవారు తమ క్రింది కులాలవారిని నీచదృష్టితో చూడరాదని హెచ్చరిస్తోంది గరుడపురాణం.
18. భారతదేశపు భౌగోళిక వర్ణన, గ్రహ-నక్షత్రాలకు సంబంధించిన వివరణనిస్తోంది బ్రహ్మాండ పురాణం.

పురాణాల్లో ఇన్ని నిక్షేపాలున్నాయి గనుకనే మనదేశంలో నేటికీ ఎన్నో దేవాలయాల్లో నిత్యపురాణ ప్రవచనాలు జరుగుతున్నాయి. ఈ విధంగా పురాణాల్లో ఆధ్యాత్మిక విషయాలు మాత్రమే గాక సామాన్యులకుపయోగపడే రీతులు, నీతులు ఎన్నో దర్శనమిస్తాయి.

## వ్యాసమహర్షి పురాణాలకు ఆధారమేమి?

ఇలా ఉండగా వ్యాసమహర్షి అష్టాదశ పురాణాల రచనలో దేన్ని ఆధారంగా చేసికొన్నాడనే ప్రశ్నకలుగుతుంది. దీనికి సమాధానంగా 1. ఆఖ్యానం 2. ఉపాఖ్యానం 3. గాథ 4. కల్పశుద్ధి అనే నాలుగంశాలు పురాణాలకాధారమని చెప్పవచ్చును. ఇందులో 1. ఆఖ్యానమంటే

స్వయంగా తనుచూసిన వృత్తాంతాన్ని కథారూపంగా చెప్పడం. 2. ఇతరుల ద్వారా వినిన వృత్తాంతాలను కథారూపంగా పేర్కొనడం ఉపాఖ్యానం. వ్యాసుడు తన పురాణాల్లో వ్రాసిన శ్రీరామకథ, సత్యహరిశ్చంద్ర కథ మొదలైనవి ఉపాఖ్యానాలవుతాయి. 3. ఇక, కొందఱు మహాపురుషుల వైశిష్ట్యాన్ని తెలియజేసే శ్లోకాలుంటాయి. కాని, వాటి కర్త ఎవరో తెలియదు. అటువంటి శ్లోకాలను తీసికొని వర్ణిస్తే వాటినే గాథలంటారు. ఉదాహరణకు :- వాయుపురాణంలోని పితృగాథ, విష్ణుపురాణంలోని కార్తవీర్యగాథ. 4. కల్పశుద్ధియనగా శ్రాద్ధకల్పమని అర్థము.

ఈ విధంగా పై నాలుగు అంశాల్ని ఆధారంగా చేసికొని వ్యాసమహర్షి తన పురాణరచనను సాగించాడని చెప్పవచ్చును.

## పురాణాలు మోక్షదాయకాలు : -

సృష్టిలోని ప్రతిమానవుడు సుఖాన్నే కోరుకొంటాడు. దుఃఖాలు తనకు రాకూడదని తలుస్తాడు. అయితే, మోక్షం తప్ప మిగిలిన సుఖాలన్నీ తాత్కాలికాలే. దరిద్రుడు తనకు ఒక వందరూపాయలు కావాలని కోరుకుంటాడు. వందరూపాయలున్నవాడు వెయ్యిరూపాయల్ని కోరుకుంటాడు. వెయ్యి గలవాడు లక్షను, లక్షాధికారి కోటీశ్వరుడు కావాలనీ, కోటీశ్వరుడు రాజ్యాధిపతి కావాలనీ, రాజ్యాధిపతి చక్రవర్తి పదవినీ, చక్రవర్తి ఇంద్రస్థానాన్ని, ఇంద్రుడు బ్రహ్మపదవినీ, బ్రహ్మ విష్ణు స్థానాన్ని, విష్ణువు శివస్థానాన్ని పొందవలెనని ప్రయత్నిసుంటారు. ఈ విధంగా మనిషి ఆశకు అంతుండదు గనుక, శాశ్వతమైన సుఖం మోక్షం మాత్రమే. ఈ మోక్షాన్నే ముక్తి అనీ, కైవల్యమనీ, నిశ్శ్రేయసమనీ, పరమ పురుషార్థమనీ అంటారు. ఈ భావాన్ని భర్తృహరి ఒక శ్లోకంలో తెలియజేశాడు. పురాణాల అధ్యయనం వల్ల మోక్షం ప్రాప్తిస్తుంది. పురాణాల్లో ఈ మహత్త్వమున్నది గనుకనే నేటికీ పెక్కుచోట్ల పురాణ ప్రవచనం అవిచ్ఛిన్నంగా సాగుతోంది. భవరోగానికి అద్భుతమైన ఔషధం పురాణాలు.

అష్టాదశపురాణానాం నామధేయాని యః పఠేత్ ।
త్రి సంధ్యం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ - మధ్యాహ్న - సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

ఇంతటి గొప్పదనాన్ని సంతరించుకొన్న అష్టాదశ మహాపురాణాలను మనకందించిన విష్ణుస్వరూపుడైన వ్యాసమహర్షి ధన్యజీవి. ఈవిధంగా సర్వదా సంస్మరణీయుడు వ్యాసభగవానుడు.

వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥



శ్రీః

# 1. బ్రహ్మపురాణము

''ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రాహ్మముచ్యతే'' అష్టాదశ మహాపురాణాల్లో మొట్టమొదటి పురాణం బ్రహ్మపురాణం. ''బ్రాహ్మం మూర్ధా హరేరేవ'' అనే వచనానుసారం మహావిష్ణువుయొక్క శిరస్సుతో పోల్చబడిందీపురాణం. సగటు మనిషి ధర్మార్థ కామ మోక్షాల్ని ఎలా సాధించగలడో తెలియజేయడానికెన్నో ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలిందులో ఉన్నాయి. ''నానాఖ్యానేతిహాసాఢ్యం దశసాహస్రముచ్యతే'' అను వచనాన్ని బట్టి బ్రహ్మపురాణంలో పదివేల శ్లోకాలున్నాయి. పూర్వభాగం, ఉత్తరభాగమని రెండు భాగాలున్నాయి. మొత్తం 246 అధ్యాయాలగుపిస్తాయి.

ధర్మం తాలూకు మహిమ ఈ విధంగా వర్ణించడమైనదీ పురాణంలో-

ధర్మేణ రాజ్యం లభతే మనుష్యః స్వర్గం చ ధర్మేణ నరః ప్రయాతి।
ఆయుశ్చ కీర్తిం చ తపః ప్రతిష్ఠాం ధర్మేణ మోక్షం లభతే మనుష్యః॥

ధర్మం వల్ల రాజ్యప్రాప్తి, స్వర్గప్రాప్తి, ఆయువు, కీర్తి, తపస్సు, ప్రతిష్ఠ, మోక్షం మొదలైన కోరికలన్నీ సిద్ధిస్తాయని భావం.

బ్రహ్మపురాణం పేరు వినేసరికి బహుశ బ్రహ్మదేవునికి సంబంధించిన విషయాలిందులో ఉంటాయేమో అనే ఊహ కలుగవచ్చు. అయితే, వాస్తవానికి మహావిష్ణువు యొక్క మాహాత్మ్యాన్ని తెలియజేస్తున్నదీ పురాణం.

నైమిశారణ్య వర్ణన, మహాప్రళయ - అవాంతర ప్రళయాలు, హరిశ్చంద్ర - సగర - భగీరథుల చరిత్ర, వసుదేవుని పుట్టుక, భూగోళ - సప్తద్వీపవర్ణన, సూర్యపూజా మాహాత్మ్యం, కామదహనం, పార్వతీ స్వయంవరం, ఇంద్రద్యుమ్న చరితం, పూరీజగన్నాథక్షేత్రవర్ణన,

నరసింహస్వామి పూజా విధానం, సముద్ర స్నానవిధి, ఉమామహేశ్వర స్తోత్రం, గోదావరీనదిపవిత్రత, అహల్యావృత్తాంతం, సరస్వతీదేవి వృత్తాంతం, శునశ్శేఫచరితం, క్షీరసాగరమథనం, దధీచిమహర్షి వృత్తాంతం, ఆత్రేయఋషి వృత్తాంతం, మార్కండేయ ప్రభావం, అప్సరసలు విశ్వామిత్రుని తపస్సు భంగపఱచడం ద్వారా శాపవశముచే నదులుగ రూపం పొందుట, వరాహ - నరసింహ - దత్తాత్రేయ - పరశురామ - శ్రీరామ - శ్రీకృష్ణావతారాల వర్ణన, మొదలైన పెక్కు విషయాలు బ్రహ్మపురాణంలో ఉన్నాయి.

సమస్త భూమండలంలో భారతదేశం సర్వశ్రేష్ఠమైనదనీ అందునా దండకారణ్యం పుణ్యప్రదాయక ప్రదేశమనీ, ఈ దేశంలో ప్రవహించే నదుల్లో గంగా - గోదావరీ నదులు ప్రముఖమైనవనీ, ఈ ప్రాంతంలో ఆచరించే శుభకర్మలు భుక్తి - ముక్తులనివ్వగలవనీ ఈ క్రింది శ్లోకాలు తెలియజేస్తున్నాయి. -

పృథివ్యాం భారతం వర్షం దండకం తత్ర పుణ్యదం ।
తస్మిన్ క్షేత్రే కృతం కర్మ భుక్తి - ముక్తిప్రదం నృణామ్ ॥

తీర్థానాం గౌతమీ - గంగా శ్రేష్ఠా ముక్తిప్రదా నృణామ్ ।
తత్ర యజ్ఞేన దానేన భోగాన్ముక్తిరవాప్స్యతి ॥

పరస్త్రీలను కామించరాదనీ, అలాచేస్తే ఆ పురుషులు పాపాత్ములై నపుంసకులవుతారని హెచ్చరిస్తున్నది బ్రహ్మపురాణం.

భక్తి - ముక్తి ప్రదాయకమైన ఒక కథ ఈ పురాణంలో ఇలా ఉంది.

పూర్వం గౌతమీనదీతీరంలో ''కండువు'' అనే మహర్షి ఉండేవాడు. ఇతడు సత్యవాది. ఇంద్రియనిగ్రహం కలవాడు మరియు వేద - వేదాంగల్లో నిష్ణాతుడు. కంద - మూలాలు, సమిధలు, చక్కని పుష్పాలతో కూడిన ఒక ఆశ్రమంలో మౌనదీక్షతో ఉగ్రతపస్సు చేస్తుండేవాడు. వేసవిలో పంచాగ్నులనడుమ, వానాకాలంలో కటికనేలమీద, చలికాలంలో

తడిబట్టలతోనూ సాగిందీతపస్సు. ఈ తపోదీక్షను చూసి దేవతలాశ్చర్యపోయారు. తపోభంగానికి ''ప్రమ్లోచ'' అనే అప్సరసను ఆదేశించాడింద్రుడు. తనకంతటి శక్తి - సామర్థ్యాలు లేవనీ, ఊర్వశి మొదలైనవారే ఇందుకు తగినవారనీ అంది ప్రమ్లోచ. ''మరేంపరవాలేదు, మన్మథుడు, వసంతుడు, వాయువు నీకు తోడుగా ఉంటారు. నిర్భయంగా వెళ్ళు'' అన్నాడింద్రుడు.

కండువు ఆశ్రమానికి వెళ్ళిందామె. తన గీత - నృత్యాలతో ముని తపస్సును భంగం చేసింది. ఆమె సౌందర్యాన్ని చూసి ఖంగుతిన్నాడు ముని. మనసు వశం తప్పింది. ఆ సుందరీమణి వివరాలనడిగాడు. పూలకోసం వచ్చానన్నది. ఆదేశిస్తే ఆజ్ఞను శిరసావహిస్తానన్నది. మరేమీ మాట్లాడక సాదరంగా ఆశ్రమంలోనికి తీసికెళ్ళాడు ప్రమ్లోచను. తపోబలంతో దివ్యరూప - యౌవనాలు, చక్కని వస్త్రాలు పొందాడు. ఇదివఱకున్న గడ్డాలడ్డులేవిపుడు. అతని సౌందర్యం చూసి ఆశ్చర్యపోయింది ప్రమ్లోచ. కామవశుడయ్యాడాముని. జప - హోమాదులు, ఉపవాసనియమాలు పూర్తిగా మరచాడు. పగలు - రేయనే తేడా లేక ఆమెతో సర్వదా కలిసే ఉన్నాడు. ఇలా నూరేళ్ళు గడిచాయి. ''నేను స్వర్గానికి వెళ్ళాలి'' అంది ప్రమ్లోచ. మరి కొద్దిరోజులాగమన్నాడు. సరే అంది. ఇంకో నూరేళ్ళు గడిచాయి. ఇలా ఎన్నోసార్లు జరిగింది.

ఇలా ఉండగ, ఒకరోజు హడావిడిగ ఆశ్రమం నుంచి బయల్దేరాడు ముని. ''ఎక్కడికి?'' అడిగింది ప్రమ్లోచ. ''తెల్లవారింది కదా సంధ్యావందనానికెళ్ళాలి. లేకపోతే అనుష్ఠానం లోపిస్తుంది'' అని ముని సమాధానం. ''ఇప్పుడా నీకు తెల్లవారింది? నీ అనుష్ఠానం ఎప్పుడో దారి తప్పింది'' అన్నది ఆ అప్సరస. ''అదేమిటి? కొద్దిసేపటిక్రితమే కదా నీవొచ్చావు'' అన్నాడు. '' నేను వేకువఝాముున వచ్చిన విషయం వాస్తవమే. అయితే అది ఇవాళ కాదు. కొన్ని వందల సంవత్సరాల క్రితము'' అన్నదామె. నమ్మలేదామహాముని. ఇప్పటికి ౯౦౭ సంవత్సరాల, ఆరునెలల, మూడు రోజులైనదనే నగ్నసత్యం తెలియజేసింది ప్రమ్లోచ.

జ్ఞానోదయమైంది మునికి. తన అపచారాం తెలిసికొన్నాడు. వివేకం దారి తప్పినందుకు పశ్చాత్తాపం చెందాడు. తనను తాను తిట్టుకొన్నాడు. ప్రమ్లోచను వెంటనే వెళ్ళిపొమ్మన్నాడు. భయంతో స్వర్గానికి తిరిగి వెళ్ళిందామె.

తన పాప ప్రక్షాళనకై ఆశ్రమం వదలి పురుషోత్తమ క్షేత్రానికెళ్ళాడు. దక్షిణ సముద్రతీరంలో ఉన్నదా క్షేత్రం. మోక్షప్రదాయకమాక్షేత్రం. అదే, పూరీజగన్నాథం. ఏకాగ్రచిత్తుడై జగన్నాథస్వామిని సేవించాడు. ఊర్ధ్వబాహువులతో ''బ్రహ్మపారము'' అనే మహామంత్రం జపించాడు. అచంచలమైన అతని భక్తి సంతోషించాడు స్వామి. ప్రత్యక్షమయ్యాడు. మోక్షం కోరాడు ముని. ఈ క్షేత్రంలో నిత్యము తనను కొలిస్తే అభీష్టం నెఱవేఱుతుందన్నాడు జగన్నాథుడు. అలాగే ఆచరించాడు ముని. కొంతకాలం తర్వాత స్వామి అతనికి ముక్తినిచ్చాడు.

**కార్తవీర్యార్జుని కథ** : –

పురువంశంలో కనకుడనే రాజుండేవాడు. అతనికి (1) కృతవీరుడు, (2) కృతౌజసుడు (3) కృతధన్వుడు (4) కృతాగ్ని అని నలుగురు కొడుకులు. కృతవీరుని పుత్రుడే కార్తవీర్యార్జునుడు. ఇతడు సమస్త భూమండలాన్ని పాలించాడు. పదివేల సంవత్సరాలపాటు మహాభయంకరమైన తపస్సు చేసి దత్తాత్రేయస్వామిని ప్రసన్నం చేసికొన్నాడు. నాలుగు కోరికల్ని కోరాడు. (1) వేయిచేతులుండటం (2) సజ్జనులను రక్షించడం (3) ధర్మపరిపాలన (4) యుద్ధరంగంలో తనకంటె గొప్పవీరుని చేతిలో వీరమరణం పొందడం. ఇవీ అతని కోరికలు. ''తథాఽస్తు'' అన్నాడు దత్తాత్రేయస్వామి. సప్తద్వీపాల్లో ఏడు వందల యాగాలు చేశాడు. ఇతని అద్భుతచరిత్రను నారదుడనే గంధర్వుడు గానం చేశాడు. లంకాధిపతి రావణున్ని అవలీలగా గెలిచి మాహిష్మతీ నగరంలో బంధించాడు. చివటికి పులస్త్య బ్రహ్మ పుత్రభిక్ష కోరగా అతన్ని వదిలేశాడు కార్తవీర్యార్జునుడు.

ఒకసారి అగ్నిదేవుడు తన దాహం తీర్చమని కార్తవీర్యార్జునుణ్ణి కోరాడు. వెంటనే సప్తద్వీపాల్ని అతనికి భిక్షగ ఇచ్చాడు. అంతే, సప్తదీపాల్లోని, కొండలు, అడవులు మొదలైన వాటినన్నిటినీ దహించాడగ్ని. ఆపవుడు అనే ముని ఆశ్రమం కూడ అగ్నికాహుతైంది. వరుణపుత్రుడైన ఆపవుడు మహాతపస్వి. ఆ దృశ్యాన్ని భరింపలేక జమదగ్నికి పుట్టబోయే పరశురాముడు కార్తవీర్యార్జునుణ్ణి సంహరించగలడని శపించాడాముని. ఆ శాపప్రభావమైతేనేమి, తను కోరిన వరం ప్రకారమైతేనేమి చివరికి పరశురాముని చేతిలో వీరమరణం పొందాడు కార్తవీర్యార్జునుడు.

కార్తవీర్యస్య యోజన్మ కథయేదిహ నిత్యశః ।
న తస్య విత్తనాశః స్యాన్నష్టం ప్రతిలభేచ్చ సః ॥

ఈ కార్తవీర్యార్జుని చరిత్రను ఎవరైతే నిత్యము చదువుతారో వారికి ధననాశం కలుగదు. పోయిన సొమ్ము తిరిగి వస్తుందనీ ఈ శ్లోకం భావం.

అద్భుతమైన ఈ కార్తవీర్యార్జుని చరిత్ర బ్రహ్మపురాణంలో ఎంతో విపులంగా ఉంది.

ఇదం యః శ్రద్ధయా నిత్యం పురాణం వేదసమ్మితమ్ ।
యః పఠేచ్ఛృణుయాన్మర్త్యః స యాతి భువనం హరేః ॥

ఎవరైతే ఈ బ్రహ్మపురాణాన్ని శ్రద్ధగా విందురో లేక చదివెదరో వారు హరినిలయమైన వైకుంఠం చేరగలరు.



# ౨. పద్మపురాణము

''హృదయం పద్మసంజ్ఞితమ్'' మహా విష్ణువు యొక్క హృదయస్థానంతో పోల్చబడినదీపురాణం. శ్రీమన్నారాయణుని నాభికమలంనుండి మొదలైన సృష్టిప్రక్రియనాధారంగా చేసికొని బయల్దేరిన పురాణం గనుక దీనికి పద్మపురాణమనే పేరు వచ్చింది. ''పాద్మం పంచపంచాశత్సహస్రాణీహ పఠ్యతే'' అను వచనం ప్రకారం 55వేల శ్లోకాలిందులో ఉన్నాయి.

యథా పంచేంద్రియస్సర్వః శరీరీతి నిగద్యతే ।
తథేదం పంచభిః ఖండైరుదితం పాపనాశనమ్ ॥

మానవునికి కళ్ళు, ముక్కు, చెవులు, నాలుక, చర్మమనే పంచ జ్ఞానేంద్రియాల వలె ఈ పురాణంలో అయిదు ఖండాలున్నాయి. అవి (1) సృష్టిఖండం (2) భూఖండం (3) స్వర్గఖండం (4) పాతాళఖండం (5) ఉత్తరఖండం.

| | ఖండం | అధ్యాయాలు |
|---|---|---|
| (1) | సృష్టిఖండం | 82 |
| (2) | భూఖండం | 125 |
| (3) | స్వర్గఖండం | 39 |
| (4) | పాతాళఖండం | 113 |
| (5) | ఉత్తరఖండం | 282 |
| | మొత్తం అధ్యాయాలు - | 641 |

కాలపరిమాణవివరణము, క్షీరసాగరమథనం, దక్షయాగవినాశం, చంద్రవంశవర్ణన, కర్ణార్జునుల పుట్టుక - వారి విరోధకారణం, వృత్రాసురవధ, వామనావతార వర్ణన, తారకాసురవృత్తాంతం, నరసింహావతారవర్ణన, సదాచారవర్ణన, తల్లి-దండ్రుల సేవా మాహాత్మ్యం, ఉసిరి-తులసి మొక్కల ప్రాశస్త్యం, గంగా మాహాత్మ్యం, సూర్య

మాహాత్మ్యం, పంచ భూతాత్మక శరీరవర్ణన, ఆత్మస్వరూపం, బ్రహ్మచర్యలక్షణాలు, పాపాత్ములు మరణించే తీరు, భారతదేశంలోని నదులు మరియు పర్వతాల వర్ణన, నర్మదానదీ మాహాత్మం, గృహస్థధర్మాలు, విష్ణుభక్తిమహిమ, కార్తీకమాస ప్రాశస్త్యం, ఏకాదశీవ్రత మాహాత్మ్యం, రామాయణ కథలు, శనిపీడా నివారణ విధానం, విష్ణుసహస్రనామమహిమ, వైష్ణవ లక్షణాలు, దీపావళీ మాహాత్మ్యం, హరిపూజా విధానం, ఆయా మాసాల్లో దేవపూజకు వాడవలసిన ఫల - పుష్పాల వివరణ, యుగధర్మాలు, పురాణాల మహత్త్వం మొదలైన విషయాలు పద్మపురాణంలో విస్తృతంగా ఉన్నాయి.

మానవుని మనసులో కలిగే సంకల్పం, ఇంద్రియాలతో చూసే వస్తువు, బుద్ధితో తెలిసికొనే విషయం ఇవన్నీ శ్రీహరిరూపాలే అని వక్కాణిస్తోంది పద్మపురాణం.

యద్రూపం మనసా గ్రాహ్యం యద్గ్రాహ్యం చక్షురాదిభిః।
బుద్ధ్యాచ యత్పరిచ్ఛిన్నం తద్రూపమఖిలం హరేః ॥

ఈ శ్లోకం పై భావాన్ని చెబుతోంది. ప్రపంచంలోని సమస్తమూ హరిమయమే అనడం పద్మపురాణ సిద్ధాంతం. ''పురుష ఏవేదం సర్వం'' ''సర్వం ఖల్విదం బ్రహ్మ'' మొదలైన శ్రుతివచనాలు కూడ ఈ సిద్ధాంతాన్నే బోధిస్తున్నాయి.

ఈ మహాపురాణంలో ఎన్నో సదాచారాలు దర్శనమిస్తాయి. వాటిలో కొన్నిటిని పరిశీలిద్దాం -

- ''న స్థాతవ్యం న గంతవ్యం క్షణమప్యసతా సహ.'' దుర్జనులతో కనీసం క్షణకాలం సైతం కలసి ఉండరాదు మరియు కలసి నడువరాదు. అంటే కేవలం క్షణకాలంలో వారిలోని దుర్గుణాలు ఇవతలి వారిలో చాల వేగంగా చొచ్చుకుని పోగలవు. అందువల్ల వారికి దూరంగా ఉండాలి.
- ''న క్షౌరం కారయేద్ధీరః కుజస్యాహ్ని కదాచన.'' మంగళవారం నాడెట్టి పరిస్థితుల్లోనూ క్షురకర్మ (క్షౌరము) చేసికోరాదు.

❁ ఆది, మంగళవారాల్లో అభ్యంగన స్నానం చేయరాదని పెద్దలు చెబుతుంటారు. ''తైలాభ్యంగం న కుర్వీత వాసరే రవిభౌమయోః'' అనే పద్మపురాణవచనం వారి మాటల్లో ప్రమాణం కాగలదు.

❁ తడి కాళ్ళతో నిద్రపోరాదు. కాళ్ళకు తడి లేకుండా (కాళ్ళు కడుక్కోకుండ) భోంచేయరాదు. చీకట్లో పడుకోరాదు. కనీసం చిన్న దీపమైనా ఉండాలి. ఇలాగే దీపం లేకుండా భోజనం చేయడం తగదు. ఈ నియమాలను సాధారణంగా అందరు పాటిస్తారు. ఇది పరంపరగ వస్తున్నది. ఈ అంశాలను స్పష్టం చేస్తున్నదీ పురాణం లోని వచనం –

శయనం చార్ద్రపాదేన శుష్కపాదేన భోజనమ్।
నాంధకారే చ శయనం భోజనం నైవ కారయేత్॥

❁ పడమర, దక్షిణం ఈ రెండు దిక్కులకభిముఖంగా దంతధావనం చేయరాదు. ఇలాగే పడమర, ఉత్తర దిక్కులందు తలపెట్టి పడుకోరాదని పద్మపురాణకథనం –

పశ్చిమే దక్షిణే చైవ న కుర్యాద్దంతధావనమ్।
ఉత్తరే పశ్చిమే చైవ న స్వపేద్ధి కదాచన॥

❁ ప్రతి మనిషి తన జీవితంలో తప్పని సరిగ ఆచరించ వలసిన అంశాలైదున్నాయి. అవి –

పిత్రోరర్చా చ పత్యుశ్చ సామ్యం సర్వజనేషు చ।
మిత్రాద్రోహో విష్ణు భక్తిరేతే పంచమహామఖాః॥
పంచానామేకకం కృత్వా విందన్ మోక్షం దివం యశః॥

(1) తల్లిదండ్రుల సేవ (2) పతిసేవ (3) జనులందర్నీ సమానంగా చూడటం (4) మిత్రద్రోహం చేయకుండుట (5) విష్ణుభక్తి అనే అయిదు లక్షణాలు అందరిలోనూ ఉండాలి. వీటిలో ఏ ఒక్క సుగుణమున్నా మంచి కీర్తి, స్వర్గము, మోక్షము సిద్ధిస్తాయని భావం.

పితా ధర్మః పితా స్వర్గః పితా హి పరమం తపః।
పితరి ప్రీతిమాపన్నే ప్రీయన్తే సర్వదేవతాః॥

సర్వతీర్థమయీ మాతా సర్వదేవమయః పితా ।
మాతరం పితరం తస్మాత్ సర్వయత్నేన పూజయేత్ ॥

తండ్రియే ధర్మము, తండ్రియే స్వర్గము, మరియు తపస్సు. కొడుకు పట్ల తండ్రి సంతుష్టుడైతే సకల దేవతలు ప్రీతులవుతారు. సర్వతీర్థ స్వరూపిణి తల్లి. సర్వదేవతా స్వరూపుడు తండ్రి. అందువల్ల ఎన్ని కష్టాలెదురైనా తల్లి-దండ్రుల సేవ తప్పక చేయాలని హితబోధ చేస్తున్నదీ పురాణం. ''మాతృదేవో భవ'', ''పితృదేవో భవ'' అనే వేదవచనాల సారమూ ఇదే.

**ధాత్రీఫల ప్రాశస్త్యం --**

ధాత్రీఫలమంటే ఉసిరికాయ. దీన్ని దాదాపుగ అందఱు ఇష్టపడతారు. అందుకు కారణమేమైనా ఉందా? అని పరిశీలిస్తే పద్మపురాణంలో సమాధానాలగుపిస్తాయి.

ధాత్రీఫలం పరం పూతం సర్వలోకేషు విశ్రుతమ్ ।
యస్య రోపాన్నరో నారీ ముచ్యతే జన్మబంధనాత్ ॥
భక్షణే చ భవేదాయుః పానే పై ధర్మ సంచయః ॥
అలక్ష్మీ నాశనం స్నానే సర్వైశ్వర్య మవాప్నుయాత్ ॥
యస్మిన్ గృహే మహాసేన! ధాత్రీ తిష్ఠతి సర్వదా ।
తస్మిన్ గృహే న గచ్ఛన్తి ప్రేతా దైతేయరాక్షసాః ॥

ఉసిరికాయ ఎంతో పవిత్రమైనదిగ అన్ని లోకాల్లోనూ కీర్తింపబడుతోంది. ఉసిరి మొక్కను నాటడం ద్వారా సంసారబంధాలు దూరమౌతాయి. దీన్ని తింటే ఆయువు పెరుగుతుంది. ఈ రసాన్ని తాగితే ధర్మం వర్ధిల్లుతుంది. ఈ రసంతో స్నానం చేస్తే దారిద్ర్యం తొలగి సకలైశ్వర్యాలు ప్రాప్తిస్తాయి. ఈమొక్క ఉన్న ఇంట ప్రేత - రాక్షసాది బాధలుండవు.

ఏకాదశ్యాం పక్షయుగే ధాత్రీస్నానం కరోతియః ।
సర్వపాపక్షయం యాతి విష్ణులోకే మహీయతే ॥
ధాత్రీద్రవేణ సతతం యస్య కేశాః సురంజితాః ।
న పిబేత్స పునర్మాతుః స్తనం కశ్చిత్ షడానన ॥

ధాత్రీదర్శనసంస్పర్శాన్నామ్న ఉచ్చారణేఽపి వా।
వరదః సమ్ముఖో విష్ణుః సంతుష్టో భవతి ప్రియః॥

ధాత్రీఫలం చ యత్రాస్తే తత్ర తిష్ఠతి కేశవః।
తత్ర బ్రహ్మా స్థిరా పద్మా తస్మాత్తాం తు గృహే న్యసేత్॥

శుక్లపక్షంలో గాని, కృష్ణపక్షంలో గాని ఏకాదశి నాడెవరైతే ఈ ఉసిరిస్నానం చేస్తారో వారి పాపాలన్నీ క్షీణిస్తాయి. తద్వారా వారు వైకుంఠం చేరుకోగలరు. నిత్యము ఉసిరి రసంతో స్నానం చేస్తే కేశాలు నిగనిగలాడుతాయి. అంతేగాక, వారెప్పటికీ తల్లిపాలు త్రాగవలసిన అవసరం ఉండదు. అంటే వారికి పునర్జన్మ ఉండదు. ధాత్రీవృక్షాన్ని దర్శించినా లేక స్పర్శించినా లేక ''ధాత్రీ'' అని ఉచ్చరించినా విష్ణుభగవానుడు సంతుష్టుడవుతాడు. ధాత్రీఫలమున్న చోట శ్రీమన్నారాయణమూర్తి, లక్ష్మీదేవి మరియు బ్రహ్మదేవుడు నివసిస్తారు. ఈ కారణంగానే ప్రతి ఇంట ఉసిరి మొక్కను తప్పక నాటాలని భావం.

సర్వయజ్ఞేషు కార్యేషు శస్తం చామలకీ ఫలమ్।
సర్వదేవస్య పూజాయాం వర్జయిత్వా రవిం సుత॥

తస్మాద్రవిదినే తాత సప్తమ్యాం చ విశేషతః।
ధాత్రీఫలాని సతతం దూరతః పరివర్జయేత్॥

అన్నియాగాల్లోనూ, అన్ని దేవతా పూజల్లోనూ ఉసిరికాయ వాడతారు. అయితే ఒక్క సూర్యపూజకు మాత్రం దీన్ని వాడరు. ఈ కారణంగానే సూర్యునికిష్టమైన ఆదివారం, మరియు సప్తమీ తిథుల్లోనూ ఉసిరికాయను ముట్టుకోరాదని పై శ్లోకాల భావం.

**తులసీప్రాశస్త్యం** –

సర్వేభ్యః పత్రపుష్పేభ్యః సత్తమా తులసీ శివా।
సర్వకామప్రదా శుద్ధా వైష్ణవీ విష్ణుసుప్రియా॥

భక్తిముక్తిప్రదా ముఖ్యా సర్వలోకపరా శుభా।
యామాశ్రిత్య గతాః స్వర్గమక్షయం మునిసత్తమా॥

కులం శీలం కళత్రం చ పుత్రం దుహితరం తథా।
ధనం రాజ్యమరోగిత్వం జ్ఞానం విజ్ఞాన మేవ చ॥
వేదవేదాంగ శాస్త్రం చ పురాణాగమసంహితాః।
సర్వం కరగతం మన్యే తులస్యభ్యర్చనే హరేః॥
కిం చ గంగాజలేనైవ కిం చ పుష్కర సేవయా।
తులసీదళ మిశ్రేణ జలేనైవ ప్రమోద్యతే॥

పత్ర - పుష్పాలన్నిటిలో శ్రేష్ఠము, శుభప్రదము తులసీపత్రము. మహావిష్ణుపత్ని అయిన ఈ తులసీదేవిని పూజిస్తే కోరిన కోరికలన్నిటినీ తీర్చగలదు. శ్రేష్ఠురాలైన ఈమెను పూజించడం ద్వారా మహామునులు స్వర్గసుఖాలను పొందారు. భక్తి శ్రద్ధలతో కూడిన పూజలందుకొన్న తులసీదేవి తన భక్తులకు మంచి వంశము, గుణాలు, భార్య (భర్త), సంతానం, ధనము, రాజ్యం, ఆరోగ్యం, జ్ఞాన - విజ్ఞానాలు (జ్ఞానమంటే మోక్షసంబంధమైన బుద్ధి; విజ్ఞానమనగా శాస్త్రాలు, కళల్లో తెలివితేటలు) వేద - వేదాంగాలు, పురాణాలు మొదలైన సకల సంపదలనిస్తుంది. గంగానదీ జలాలు, పుష్కరజలాలు మొదలైన వాటికంటె తులసీదళాలతో మిశ్రితమైన సామాన్యజలాలతోటి పూజిస్తే విష్ణుభగవానుడు సంతుష్టుడౌతాడు.

పూజనే కీర్తనే ధ్యానే రోపణే ధారణే కలౌ।
తులసీ దహతే పాపం స్వర్గం మోక్షం దదాతి చ॥

కలియుగంలో ఎవరైతే తులసీదేవిని పూజిస్తారో, ధ్యానం చేస్తారో, తులసీ మొక్కను నాటుతారో, ఆ దళాలను శిరస్సుపై ధరిస్తారో వారి పాపాలన్నీ రూపుమాపి తద్వారా ఆమె స్వర్గ - మోక్షాలనివ్వగలదు. ఈ విధంగా తులసీ ప్రాశస్త్యమెంతో విపులంగా సాక్షాత్కరిస్తుంది పద్మపురాణంలో.

**పురాణాలెందుకు చదవాలి?**

పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్భ్రాతరన్వహమ్।
తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః॥

యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।
తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥
యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।
ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥
అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।
విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥
యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।
పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ- కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి - శ్రద్ధలతో పురాణ పఠన - శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

**కలిధర్మాలు** –

కలౌ యాస్యన్తి నిర్వృత్తా ఉత్తమా అతినీచతామ్ ।
నీచాశ్చ ధనసంపన్నా యాస్యన్త్యుచ్చపదం ప్రతి ॥

కలియుగంలో ఉత్తములు అధఃస్థితినిపొంది చరిత్రహీనులవుతారు. అదే సమయంలో నీచులు సకలైశ్వర్యాలను, ఉన్నత పదవులను పొంది ప్రతిష్ఠితులవుతారు.

పరోక్షనిందకాః క్రూరాః సమ్ముఖే ప్రియవాదినః ।
సాధ్వీవాదం వదిష్యన్తి భర్తారం పుంశ్చలీ స్త్రియః ॥

ఎదుట తీపిగ మాట్లాడటం, పరోక్షంలోనేమో తిట్టుకోవడం ఇది సర్వసాధారణమౌతుంది కలియుగంలో. ఇక, కొందఱు స్త్రీలు తమ భర్తల పట్ల ప్రేమను ఒలకపోస్తూ వారి కంటపడకుండా ఎన్నో చెడ్డ పనులు చేస్తుంటారు.

స్త్రీజితాః పురుషాస్సర్వే స్త్రియోఽప్యత్యంత చంచలాః।
కలౌ యుగే భవిష్యన్తి కలౌ మర్త్యా దురాశయాః॥

కలౌ విడ్భోజినో గావః స్వల్ప క్షీరాశ్చ జైమినే।
ఘృత హీనం చ తత్క్షీరం భవిష్యతి న సంశయః॥

పురుషులందఱు స్త్రీదాసులవుతారు. స్త్రీల స్వభావం చాల చంచలమవుతుంది. మొత్తం మీద కలియుగ మానవులు మంచి ఆశయాలు లేనివారవుతారు. ఇక, గోవులు గడ్డిని మాత్రమే గాక పనికిమాలిన పదార్థాలను తింటాయి. కొద్దిపాటి పాలను మాత్రమే ఇస్తాయి. ఆ పాలలో నెయ్యి ససేమిరా ఉండదు.

ఆత్మస్తుతి పరాలోకాః పరనిందాపరాయణాః।
భవిష్యన్తి చ ఖర్వాంగా బాలా బహ్వన్నభోజనాః॥

నేతుకామాశ్చ సర్వేఽపి దాతుకామా న కేఽపిచ।
కలౌ మ్లేచ్ఛా భవిష్యన్తి రాజానః పాపతత్పరాః॥

కలియుగ మానవులు సర్వదా ఆత్మస్తుతి, పరనిందలను చేస్తుంటారు. మరుగుజ్జులుగ పుడతారు. చిన్న పిల్లలు సైతం మితిమీరిన భోజనం చేస్తారు. సంపాదించడమే వారి ధ్యేయమవుతుంది. నలుగురికేదో చేతనైన సహాయం చేయాలనే భావన ఏ కోశానా ఉండదు. ''నరాన్ ధర్మపరాన్ దృష్ట్వా సర్వే చోపహసన్తిచ'' ఎవరైనా ధర్మమార్గంలో నడుస్తూ ధార్మిక కార్యాలు చేస్తూ ఉంటే అలాంటివారిని చూసి ''సత్తెకాలపు మనిషి'' అనీ, ''చాదస్తగాడు'' అనీ అవహేళన చేస్తారు.

''పంచమే వాపి షష్ఠే వా వర్షే స్త్రీ గర్భధారిణీ'' కలియుగంలో జరగబోయే మరో భయంకరమైన వింత ఏమంటే అయిదు లేక ఆరేళ్ళ వయసు కలిగిన ముక్కుపచ్చలారని పాపలు గర్భిణులవుతారు. ఈ రీతిగా

కలియుగధర్మాలను గురించి విస్తృతంగా చెబుతోంది పద్మపురాణం.

కలియుగంలోని ఒక విశేషం -

యత్కించిత్ కురుతే కర్మ మర్త్యో ధర్మం కలౌయుగే।
తదర్పయేన్మహావిష్ణౌ భక్తిభావసమన్వితః॥

ఏ చిన్న ధర్మకార్యమైనా ''గోవిందార్పణమస్తు'' అంటూ భక్తి భావంతో ఎవరైతే చేస్తారో వారి పాపాలన్నీ పటాపంచలవుతాయి.

యద్యదిష్టం పఠంత్యేతత్ శృణ్వంతి చ ముముక్షవః।
లభంతే తత్తదేవాశు ప్రసాదాత్కమలాపతేః॥

ఏ కోరికలతో ఈ పురాణం పఠిస్తారో లేక వింటారో వారి కోరికలన్నీ లక్ష్మీపతి అనుగ్రహం వల్ల వెంటనే నెఱవేఱగలవు.



# 3. విష్ణుపురాణము

అష్టాదశ మహాపురాణాల్లో మూడవది విష్ణుపురాణం ''వైష్ణవం దక్షిణో బాహుః'' అను వచనానుసారం మహావిష్ణువుయొక్క కుడిభుజంతో పోల్చబడింది పురాణం ''త్రయోవింశతి సాహస్రం తత్ప్రమాణం విదుర్బుధాః'' ఇందులో 23వేల శ్లోకాలున్నాయని భావం. ఈ పురాణంలో మొత్తం 126 అధ్యాయాలున్నాయి. ఆరు అంశాలుగ ఇది విభజించడమైనది.

ప్రకృతి-పురుషుడు మొదలగు 24 తత్త్వాలు, జగదుత్పత్తి, కాలస్వరూపం, వరాహావతారం, హిరణ్యాక్షవధ, నగరము-గ్రామము మొ॥ పేర్లతో భూమి విభజన, సనక-సనందాదుల పుట్టుక, స్వాయంభువమనువు పుట్టుక, దక్షప్రజాపతి పుత్రికల వివాహం, లక్ష్మీ-నారాయణుల సర్వత్రవ్యాప్తి, దుర్వాసముని ఇంద్రుణ్ణి శపించడం, ధ్రువుని వృత్తాంతం, నృసింహావతారవర్ణన, భక్తప్రహ్లాద చరితం, భరతవంశ వర్ణన, సప్తలోకాలు, నరకలోకంలో పాపాలనుభవించేతీరు, గంగానది ఉత్పత్తి, నవగ్రహాల సంచారవిధానం, జడభరతుని వృత్తాంతం, బ్రహ్మజ్ఞాన ప్రాశస్త్యం, వేదవ్యాసుడు వేదాల్ని విభజించడం, పురాణ లక్షణాలు, విష్ణు ఆరాధన - తత్ఫలితాలు, బ్రహ్మచర్యము మొ॥ ఆశ్రమాల వర్ణన, నిత్య - నైమిత్తిక - కామ్య కార్యకలాపాలు, గృహస్థధర్మాలు, దేవాసురసంగ్రామం, సగరవంశ వర్ణన, యయాతి చరితం, అతి విస్తరంగా శ్రీకృష్ణావతార వర్ణన, కలిపురుష లక్షణాలు, భగవత్సంకీర్తన మాహాత్మ్యం మొదలైన విషయాలెన్నో ఈ పురాణంలో దర్శనమిస్తాయి.

వైష్ణవ సిద్ధాంతాలకు మూలాధారమీ పురాణం అందుకే వైష్ణవులు మహాభారతంలో భగవద్గీతను, ధర్మశాస్త్రంలో మనుస్మృతిని, వేదాల్లో పురుష సూక్తాన్ని, పురాణాల్లో విష్ణుపురాణాన్ని ఎంతో ఆరాధిస్తారు.

భారతే భగవద్గీతా ధర్మశాస్త్రేషు మానవః।
వేదేషు పౌరుషం సూక్తం పురాణేషు చ వైష్ణవమ్ ॥

అనే శ్లోకం పై భావాన్ని స్పష్టం చేస్తోంది. ఈ కారణంగానే శ్రీరామానుజాచార్యులు శ్రీభాష్యంలో వైష్ణవ సిద్ధాంతాలకనుకూలంగా విష్ణుపురాణంలోని శ్లోకాలను పలుచోట్ల ప్రమాణంగా ప్రదర్శించారు. ద్వైతమతానికనుకూలంగా ఈ పురాణంలోని శ్లోకాలను చూపెట్టారు శ్రీమధ్వాచార్యులు.

శరణుకోరుట, భగవంతుని గుణగానం, మనోవాక్కాయములతో చేసిన కర్మలను మహావిష్ణువునకే సమర్పించడం ఈ పురాణంలో ప్రధానంగా పేర్కొనబడింది.

శ్రవణము, కీర్తన, స్మరణ, పాదసేవ, అర్చన, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనమను రీతిన తొమ్మిది విధాలైన భక్తిని గురించిన వర్ణన విపులంగా ఉన్నదీ పురాణంలో. భక్తిని గురించి ఇంత వివరంగా మరే ఇతర పురాణంలోనూ లేదంటే అది అతిశయోక్తి కానేరదు.

విష్ణుపురాణంలోని ఒక ప్రధాన ఘట్టం గురించి ఇక్కడ ప్రస్తావన చేయాల్సి ఉంది. ఛాందసవాదులు శివ-కేశవులను వేరుగాచూస్తారు. కాని, తమ ఇద్దరి మధ్య ఏవిధమైన భేదము లేదని సాక్షాత్తు శ్రీకృష్ణుడు సదాశివునితో ఇలా అంటాడు -

యోऽహం స త్వం జగచ్చేదం సదేవాసురమానుషమ్ ।
మత్తో నాన్యదశేషం యత్తత్త్వం విజ్ఞాతుమర్హసి ॥
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః ।
వదంతి భేదం పశ్యన్తి చావయోరన్తం హర!

ఓ పరమేశ్వరా! ఈ ప్రపంచంలో దేవతలుగాని, అసురులుగాని, మానవులు గాని మనకంటె వేరుకారు. మన ఇద్దరి మధ్య ఏవిధమైన భేదం లేదు. కాని, అజ్ఞానవశంతో కొందరు మనల్ని భేదదృష్టితో చూస్తున్నారని భావం.

కలిధర్మాల వర్ణన ఇలా ఉన్నదీ పురాణంలో -

వేదోక్తధర్మం విషయంలో మానవులకు ప్రవృత్తి కలగదు. వర్ణధర్మాలు, ఆశ్రమ ధర్మాలు నశిస్తాయి. దాంపత్య బంధం, గురుశిష్య సంబంధం

మొదలైనవి దృఢంగా ఉండవు. వివాహ విషయంలో విద్యకు కాక ధనానికే ప్రాధాన్యం. పురుషులు ధనమదాంధులు, స్త్రీలు రూపమదాంధులు అవుతారు. సువర్ణ- మణి- రత్నాదులు లేని కారణంగా స్త్రీలకు కేశాలంకరణే ప్రధానమవుతుంది. ధనంలేని భర్తలను భార్యలు వదిలేస్తారు. ధార్మిక కార్యాలకు గాక గృహనిర్మాణాదులకే పైకం వెచ్చిస్తారు జనాలు. తెలివితేటలను ఆత్మజ్ఞానం కోసం కాక ధనార్జనకే ఉపయోగిస్తారు. మైత్రికి విలువుండదు. విద్వాంసులు అవమానాల పాలవుతారు. పాలిచ్చే గోవులైతేనే పోషిస్తారు. అనావృష్టి, ఆకలితో బాధలు పడతారు ప్రజలు. వర్షం కోసం ఎంతో ఆశతో ఆకాశంకేసి చూస్తుంటారు. ఆకలి చావులు తప్పవు. పూజలు సరే, కనీసం స్నానం కూడ లేకుండ సుష్ఠుగా భోంచేస్తారు. శ్రాద్ధకర్మలు చేయరు. స్త్రీలు అస్తమానం రెండుచేతుల్తో తలల్ని గోక్కొంటూ పెద్దల మాటలను, భర్తల మాటలను ఏ మాత్రం లక్ష్యపెట్టరు. పరుషంగా మాట్లాడటం, అబద్ధాలాడటం సర్వసాధారణమౌతుంది. సన్యాసులు బంధాలకు లోనవుతారు. ప్రభువులు ప్రజారక్షణను పట్టించుకోక పన్నులు మాత్రం ఘనంగా వసూలు చేస్తారు. ఆహారం కోసం ప్రజలు వలసపోతారు. అధర్మం బాగా వ్యాపిస్తుంది. తద్వారా అల్పాయుష్కులౌతారు జనాలు. మిడిమిడి జ్ఞానంతోను, చెడు స్వభావంతోనూ మిడిసిపోతారు మూర్ఖులు. సత్పురుషుల- కవమానాలెక్కువైన కొద్దీ కలిధార్మాలు తీవ్రమౌతాయి. సర్వజగద్రక్షకుడైన మహావిష్ణువును పూజింపక క్షుద్రోపాసనలకు ప్రాధాన్యమిస్తారు. దేవతలు, వేదాలు ఇవన్నీ వట్టి బూటకాలనే విమర్శలొస్తాయి. ధాన్యాలు, పాడి అంతంతమాత్రంగానే ఉంటాయి. పురుషులు తమ అత్త-మామలను గౌరవిస్తారేగాని తల్లి-దండ్రులను పట్టించుకోరు. కాయా వాచా మనసా నిత్యమూ ఏదో పాప కార్యం చేస్తూనే ఉంటారు. ఇన్ని అవలక్షణాలున్నా, కృతయుగంలో ఎంతో గొప్ప తపస్సు చేస్తే గాని పొందలేని పుణ్యరాశిని కేవలం హరి సంకీర్తన మొదలైన చిన్న ప్రయత్నాలతో సాధించగలరు మానవులు. ఇది కలియుగ ధర్మాల్లో ఒక విశేషం.

తత్రాల్పేనైవ యత్నేన పుణ్యస్కంధమనుత్తమమ్ ।
కరోతి యః కృతయుగే క్రియతే తపసా హి సః ॥

అనే శ్లోకం పై భావాన్ని తెలియజేస్తుంది. ఇలాంటి అద్భుతమైన విషయాలెన్నో శ్రీవిష్ణుపురాణంలో సాక్షాత్కరిస్తాయి.

**జడభరతవృత్తాంతం -**

మన సమాజంలో ఎవడైనా మందబుద్ధితో ఉంటే అలాంటి వాణ్ణి జడభరతుడు అంటుంటారు. అసలీ జడభరతుడెవరు? అతని వృత్తాంతమేమిటి? అనే సందేహం పోవాలంటే జడభరతుని గురించి తెలిసికోవాలి.

ఋషభమహారాజు కుమారుడు భరతుడు. ఇతని తల్లి జయంతి. భార్య పంచజని. ఎంతోకాలం రాజ్యపరిపాలన చేశాక వార్ధక్యంలో రాజ్యాన్ని తన కుమారులకప్పగించి తపోవనానికి వెళ్ళాడు మహారాజు భరతుడు. అతడు నివసించిన ప్రాంతం పేరు సాలగ్రామం. ఒకరోజు నదీస్నానం చేస్తున్నాడు. ఆ సమయంలో గర్భిణిగ ఉన్న ఒక జింక అక్కడ నీరు త్రాగడానికి వచ్చింది. సింహగర్జన వినిపించింది. బాగా బెదిరిందా జింక. ఆ భయంతో వెంటనే ప్రసవించి తన ప్రాణాల్ని వదిలింది. ఆ దృశ్యాన్ని చూశాడు భరతుడు. మనసు కరిగింది. ఆ పుట్టిన జింకపిల్లను తన కుటీరానికి తీసికెళ్ళాడు. సంసారబంధాలన్నీ తెంచుకొన్నా ఈ జింకపిల్లతో బంధం మాత్రం నానాటికీ బలపడింది. చివరికి జింకనే స్మరిస్తూ మరణించాడు భరతుడు ఈ కారణంగా తరువాతి జన్మలో జింకగా పుట్టాడు. అయితే, పూర్వ జన్మ తాలూకు జ్ఞాపకాలు పూర్తిగా ఉన్నాయి.

జింక జన్మము ముగిసింది. ఆ తరువాతి జన్మలో ఆంగీరసుడనే మునికి పుత్రుడై పుట్టాడు. ఒకచోట ఉండక జడుని వలె అన్నిచోట్లా తిరుగుతుండేవాడు. ఈ కారణంగా అందరు ఇతన్ని జడభరతుడని పిలిచేవారు. ఒకనాడు కొంతమంది రాజభటులు కాళికాదేవికి బలి ఇవ్వడానికితన్ని తీసికెళ్ళారు. దేవి ప్రత్యక్షమై రాజును, రాజభటుల్నీ సంహరించింది. దయాదృష్టితో ఇతన్ని వదిలింది. భరతుడు నిలకడగ ఉండక దేశ సంచారం చేస్తున్నాడు.

ఇలా ఉండగ, ఒకరోజు రహూగణుడనే రాజు వేదాంతాధ్యయనం కోసం కపిలముని దగ్గఱికి వెళ్తున్నాడు. ఆ రాజుగారి పల్లకిని మోస్తున్న బోయలకలసటైయింది. ఈ భరతుణ్ణి పిలిచి పల్లకి మోయించారు. అలవాటులేని కారణంగా ఆ పని చేతకాలేదు. అపుడారాజు తిట్టాడు భరతుణ్ణి. ఏమాత్రం విచారించక మళ్ళీ తంటాలు పడుతూ మోస్తున్నాడు. ఎత్తుపల్లాల్లో పల్లకి ఊగింది. బాగా కోపం వచ్చింది. తెగ తిట్టడారాజు. అపుడు భరతుడన్నాడు– ''మహారాజా! దూషణ – భూషణాలు శరీరానికే చెందుతాయి గాని ఆత్మకు కాదు'' మొదలైన వేదాంత వచనాలనువిని ఆశ్చర్యపోయాడు రహూగణుడు. వెంటనే పల్లకి దిగాడు. సాష్టాంగ ప్రణామం చేసి భరతుని దగ్గఱ వేదాంత శ్రవణం చేశాడు.

ఈ విధంగా మూడవజన్మలో మోక్షం పొందాడు భరతుడు. ఇదీ జడ భరతుని వృత్తాంతం. ఇలాంటి అమూల్యమైన వృత్తాంతాలెన్నో ఉన్నాయి విష్ణుపురాణంలో.

యోనరః పఠతే భక్త్యాయః శృణోతి చ సాదరం ।
తావుభౌ విష్ణులోకం హి వ్రజేతాం భుక్తభోగకౌ ॥

ఈ పురాణాన్ని భక్తి శ్రద్ధలతో పఠించువారు మరియు వినువారు ఇహలోకంలో సమస్త భోగాలను అనుభవించి ఆ పిమ్మట వైకుంఠం చేరుకోగలరని భావం.



# 4. వాయుపురాణము

అష్టాదశమహాపురాణాల్లో నాలుగవది వాయుపురాణం. ధర్మం గురించి మరియు శివలీలలను గురించి వాయుదేవుడు చెప్పిన పురాణమిది. ''చతుర్వింశతిసాహస్రం పురాణం తదిహోచ్యతే'' అనే వచనం ప్రకారం ఇందులో 24 వేల శ్లోకాలున్నాయి. ''వాయుర్వామో మహేశితుః'' మహావిష్ణువు యొక్క ఎడమ భుజంగా కీర్తింపబడినదీ పురాణం. (1) ప్రక్రియాపాదం (2)అనుషంగపాదం (3) ఉపోద్ఘాతపాదం (4) ఉపసంహారపాదమను నాలుగు భాగాలిందులో ఉన్నాయి. వాయుపురాణంలో ప్రస్తుతం మనకందుబాటులో ఉన్నవి 11 వేల శ్లోకాలు మాత్రమే.

భూగోళ - ఖగోళాలకు సంబంధించిన విషయాలు, బ్రహ్మాండరచన, సృష్టిప్రక్రియ, అగ్నివంశవర్ణన, యుగధర్మాలు, కైలాసవర్ణన, గంగావతరణం, శివస్తుతి, ఋషిలక్షణాలు, వరుణవంశవర్ణన, జంబూద్వీపం మొ॥ ద్వీపాల వర్ణన, శ్రాద్ధప్రక్రియ, శ్రీవిష్ణుమాహాత్మ్యం, గయాక్షేత్రవర్ణన మొదలైన అంశాలిందులో అగుపిస్తాయి.

వాయుపురాణం శైవతత్త్వాన్ని బోధించేదే అయినప్పటికీ మహావిష్ణువు వర్ణన కూడ ఇందులో ఉంది. ఈ కారణంగా ఈ పురాణానికొక వైశిష్ట్యముంది.

యో విద్యాచ్చతురోవేదాన్ సాంగోపనిషదో నరః।
న చేత్పురాణం సంవిద్యాన్నైవ స స్యాద్విచక్షణః॥

నాలుగు వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు మొదలైన వాటినన్నిటినీ క్షుణ్ణంగా తెలిసికొన్నప్పటికీ ఎవడైతే పురాణాల గురించి ఎఱుగడో అతడు పండితుడు కానేరడని చెబుతున్నది వాయుపురాణం. కొందఱు విద్వాంసులు పురాణాలను మంచిదృష్టితో చూడరు. అటువంటి వారికి చురకే ఈ శ్లోకం తాలూకు ఉద్దేశ్యం.

మనిషి యోగి కావాలంటే ప్రాణాయామం ఒక సాధనం. మరి, ఈ ప్రాణాయామ స్వరూపం, దాని భేదాలు మరియు వైశిష్ట్యం మొదలైన అంశాలెంతో చక్కగా ఇందులో అగుపిస్తాయి. ప్రాణాయామానికి సంబంధించి బహుశ మరేపురాణమూ ఇంత వివరంగ చెప్పలేదంటే అతిశయోక్తి కానేరదు.

తస్మాద్యుక్తః సదాయోగీ ప్రాణాయామపరో భవేత్ ।
సర్వపాపవిశుద్ధాత్మా పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥

ఎవరైతే నిత్యము ప్రాణాయామమాచరిస్తారో వారు తమ పాపాలను రూపుమాపుకొని యోగులై బ్రహ్మసాయుజ్యం పొందగలరని భావం.

ప్రాణాయామాన్ని ఆచరిస్తే వచ్చే ప్రయోజనమింకా ఇలా చెప్పడమైనది-

ప్రయోజనాని చత్వారి ప్రాణాయామస్య విద్ధి వై ।
శాంతిః ప్రశాంతిర్దీప్తిశ్చ ప్రసాదశ్చ చతుష్టయమ్ ॥

శాంతి, ప్రశాంతి, దీప్తి, ప్రసాదమనే నాలుగు ప్రయోజనాలు ప్రాణాయామానికి చెప్పబడ్డాయి. శాంతి, ప్రశాంతి ఒకటి కాదు. వీటి నిర్వచనం ఎంతో వివరంగా ఉంది. అయితే గ్రంథ విస్తరభీతిలో ఇక్కడ పొందుపఱచడం లేదు.

బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులనే మూర్తిత్రయాత్మకమైనది ఓంకారము. ఈ ఓంకారాన్ని ఉచ్చరిస్తే మనసెంతో ప్రశాంతంగా ఉంటుంది. అయితే దీన్ని ఉచ్చరించేటపుడు పదిమంది పదివిధాలుగ ఉచ్చరిస్తుంటారు. ఇది మనకు ప్రత్యక్ష సిద్ధమే. అలా కాకుండ దీని ఉచ్చారణలో ఒక పద్ధతంటూ ఉంది. ఆ రీతిగా ఉచ్చరిస్తేనే సంపూర్ణ ఫలం సిద్ధిస్తుందంటూ -

''ఏష త్రిమాత్రో విజ్ఞేయో వ్యంజనం చాత్ర సస్వరమ్''

అని చెప్పడమైనది. అంటే మూడు మాత్రల కాలంలో (ప్లుతంగా) 'ఓ'కారాన్ని ఉచ్చరించి ఆ తరువాత 'మ'కారాన్ని ఉచ్చరించాలని భావం. (ఓ....౩మ్)

ఇత్యేతదక్షరం బ్రహ్మ పరమోంకార సంజ్ఞితమ్ ।
యస్తు వేదయతే సమ్యక్తదా ధ్యాయతి వా పునః ॥
సంసారచక్రముత్సృజ్య ముక్తబంధనబంధనః ।
అచలం నిర్గుణం స్థానం శివం ప్రాప్నోత్యసంశయః ॥

ఎవరైతే ఓంకారమనే అక్షరబ్రహ్మను తెలిసికొంటారో, మరియు ధ్యానం చేస్తారో వారిసంసార బంధాలను తెంచుకొని శాశ్వతమైన శివసాయుజ్యం పొందగలరని భావము ఈ విధంగా ఓంకారానికి సంబంధించిన వర్ణన ఒక అధ్యాయంలో ఎంతో విపులంగా ఉన్నది

ఇక, లోకాలను వర్ణించే సమయంలో పర్వతాలు, నదులు, వృక్షాలను వర్ణిస్తూ ఆయా ప్రాంతాల్లో మానవుల ఆయుః ప్రమాణం ఇలా వర్ణితమైంది–

శ్వేతపర్వతానికి దక్షిణ దిశలో ''రమణకము'' అనే దేశంలోని ప్రజలు మంచి బలసంపన్నులు మరియు సుందరాంగులు వారి ఆయుః ప్రమాణం 10 వేల సంవత్సరాలు శ్వేత పర్వతానికి ఉత్తర దిశలో ''హిరణ్మతము'' అనే దేశం అక్కడి మానవులు ధనసంపన్నులు వారి ఆయుః ప్రమాణం 11 వేల సంవత్సరాలు అక్కడి భవనాలు కొన్ని రత్నమయాలైతే, కొన్నేమో మణిమయాలు, మరికొన్ని స్వర్ణమయాలు ఇలాగే ఆ పరిసరాల్లోని మరో దేశాన్ని వర్ణిస్తూ అక్కడి చెట్లు నిత్యమూ ఫలపుష్పాలతో నిండియుండేవనీ, ఆ చెట్లు వారికి కావలసిన వస్త్రాలను, ఆభరణాలను ఇచ్చేవనీ చెప్పడమైనది ఆశ్చర్యంగా ఉంది కదూ!

తత్ర వృక్షా మధుఫలా నిత్యం పుష్పఫలోపగాః ।
వస్త్రాణి చ ప్రసూయన్తే ఫలేష్వభరణాని చ ॥

అనే శ్లోకం పై భావాన్ని చెబుతోంది కాళిదాసు రచించిన 'అభిజ్ఞాన శాకుంతలం' లో వృక్షాలు వస్త్రాలనిచ్చే అంశం సాక్షాత్కరిస్తుంది

ఈ విధంగా వాయుపురాణంలో కథలకంటె ఎక్కువగా ఇలాంటి వర్ణనలే దర్శనమిస్తాయి

గయా క్షేత్రమాహాత్మ్యాన్ని తెలియజేస్తూ –

గయాం యాస్యతి యః పుత్రః స నస్త్రాతా భవిష్యతి ।
గయాప్రాప్తం సుతం దృష్ట్వా పితౄణాముత్సవో భవేత్ ॥

తల్లిదండ్రులకెందరో కొడుకులుండొచ్చు కాని, ఎవడైతే గయా క్షేత్రం దర్శించి వస్తాడో అతడే తమను ఉద్ధరించే వాడని తలుస్తారు గయకు వెళ్ళి స్వామిని దర్శించి వచ్చిన పుత్రుణ్ణి చూస్తే తల్లిదండ్రులకు అమితమైన ఆనందం కలుగుతుందని దీని భావం

ధన్యం యశస్యమాయుష్యం పుణ్యం పాపప్రణాశనమ్ ।
కీర్తనం శ్రవణం చాస్య ధారణం చ విశేషతః ॥

ఈ వాయుపురాణం వినువారు మరియు పఠించువారు కీర్తిమంతులై, ఆయుష్మంతులై తమ పాపాలను పోగొట్టుకొని పుణ్యాన్ని పొందగలరని భావము

  

# 5. శ్రీమద్భాగవతపురాణము

మహాపురాణాల్లో అయిదవది శ్రీమద్భాగవతము ''ఊరూ భాగవతం ప్రోక్తమ్'' శ్రీమహావిష్ణువు యొక్క ఊరు స్థానంగా (తొడలు) వర్ణితమైనది ఇందులో 12 స్కంధాలు, 18 వేల శ్లోకాలున్నాయి

భగవంతుని అద్భుతలీలలిందులో దర్శనమిస్తాయి మానసిక క్షోభననుభవించే వారికి ఉపశమనమిస్తాయి ఇందులోని కథలు ఈ పురాణాన్ని పారాయణం చేస్తే సకలమనోభీష్టాలు నెఱవేఱుతాయి అందుకే భాగవతమంటే కల్పవృక్షమంటారు విద్వాంసులు భక్తి - జ్ఞాన-వైరాగ్య పరిపూర్ణమైన ఈ భాగవతరసాస్వాదనలో మునిగిన వారికి సాంసారికవిషయాలు పట్టవు సర్వవేదాంతసారమిందులో దాగియుంది భాగవతపారాయణ చేసేటపుడు మనస్సు ఎంతో తేలికగా ఉంటుంది

మొదటి స్కంధంలో - భగవద్భక్తిమాహాత్మ్యం, భగవత్కథల శ్రవణ - కీర్తనల ఫలితాలు, నారదమహర్షిపూర్వజన్మవృత్తాంతము, పాండవుల చరిత్ర, భీష్మపితామహుని మహాప్రస్థానం మొదలైన అంశాలున్నాయి.

రెండవ స్కంధంలోని విషయాలు - శ్రీమన్నారాయణమూర్తి విరాట్స్వరూప వర్ణన, సద్యోముక్తి విధానం, కోరికల సాధనకై ఆయా దేవతల ఉపాసన, బ్రహ్మాండ నిర్మాణం, భగవదవతారాల వర్ణన, పురాణ లక్షణాలు.

మూడవ స్కంధంలోని విషయాలు - శ్రీకృష్ణలీలలు, మహావిష్ణువు నాభికమలం నుండి బ్రహ్మదేవుని పుట్టుక, పదివిధాలైన సృష్టి, మానవుల ఆయుః ప్రమాణము, వైకుంఠలోకవర్ణన, హిరణ్యాక్ష - హిరణ్యకశిపుల వృత్తాంతం, మోక్షప్రాప్తి వర్ణన, మాతృగర్భంలో జీవోత్పత్తిక్రమము మొదలైనవి

నాలుగవస్కందంలో - దక్షయాగవర్ణన, ధ్రువచరితం, పృధు మహారాజ చరితం, పురంజనోపాఖ్యానం మొదలైన విషయాలున్నాయి

అయిదవ స్కంధంలోని విషయాలు - ప్రియవ్రత చరితము, ఆగ్నీధ్ర చరితము, భరత చరితము, జడభరత వృత్తాంతము, సంసార సాగర వర్ణన, భరతవంశ వర్ణన, భూగోళ - ఖగోళ వివరణ, అనేక విధనరకయాతనలు మొదలైనవి

ఆరవ స్కంధంలో - అజామిళోపాఖ్యానం, దధీచి వృత్తాంతం, వృత్రాసురవధ, చిత్రకేతువృత్తాంతం మొదలైన అంశాలున్నాయి

ఏడవ స్కంధంలో - హిరణ్యకశిపుని పరిపాలన, ప్రహ్లాదచరిత్ర, మానవధర్మాలు, ఆశ్రమధర్మాలు దర్శనమిస్తాయి

ఎనిమిదవ స్కంధం - గజేంద్రమోక్షం, క్షీరసాగరమథనం, మోహినీ వేషంతో ఉన్న మహావిష్ణువును శివుడు మోహించడం, బలిచక్రవర్తి చరితం మొదలైన అంశాలతో కూడియున్నది

తొమ్మిదవ స్కంధం - సుకన్య - రేవతకన్యల చరితము, నాభగచరితం, అంబరీషోపాఖ్యానం, మాంధాతృ చరితం, త్రిశంకుకథ, హరిశ్చంద్ర చరితం, సగర వృత్తాంతం, భగీరథ వృత్తాంతం, యయాతి చరితం, పురువంశ వర్ణన, దుష్యంత చరితం, రంతిదేవుని చరిత్ర, యదువంశ వర్ణన మొదలైన ఘట్టాలిందులో ఉన్నాయి

పదవ స్కంధంలో - శ్రీకృష్ణావతార వర్ణన ఎంతో వివరంగా ఉంది

పదకొండవ స్కంధం - సాధువుల లక్షణాలు, సత్సంగమహిమ, అష్టాదశసిద్ధులు, యమ-నియమాది అష్టాంగయోగాలు మొదలైన విషయాలిందులో కనిపిస్తాయి

చివరిదైన పన్నెండవస్కంధంలో - కలియుగ రాజుల వర్ణన, కలిధర్మాలు, కల్క్యవతార సమయం, నాలుగు విధాలైన ప్రళయాలు, వేదవిభజన, మార్కండేయ చరితం మొదలైన అంశాలున్నాయి

హిందూ ధార్మిక వాఙ్మయంలో అత్యద్భుతంగా ప్రకాశించే అత్యుత్తమ గ్రంథం శ్రీమద్భాగవతం వ్యాసభగవానుడు వేదవిభాగం చేశాడు బ్రహ్మపురాణం మొదలుకొని 17 మహాపురాణాలు రచించాడు

వేదాంతసూత్రాలు, మహాభారతం మొదలైన గ్రంధాలు వ్రాశాడు కాని, ఏదో అసంతృప్తి మహర్షిలో చోటు చేసికొంది మానసిక ప్రశాంతతలేదు ఆ సమయంలో నారదముని ఇతని దగ్గఱకొచ్చాడు తన పరిస్థితిని చెప్పకొన్నాడు పరాశరపుత్రుడు శ్రీకృష్ణలీలలను విశదం చేస్తూ శ్రీమద్భాతవతరచన చేయమని ఉద్బోధించాడు నారదమహర్షి తత్ఫలితమే ఈ భాగవతగ్రంధం సాంసారిక జీవనము ధార్మికము, ప్రశాంతము, సఫలము, సుఖమయము చేసికోవడానికెంతో ఉపకరిస్తుంది పురాణం ''మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'' మోక్షమార్గాలెన్నో ఉన్నా వాటిలో శ్రేష్ఠమైంది భక్తిమార్గం ఈ భక్తితత్త్వాన్ని ఉపదేశించడం ద్వారా విశేషప్రశస్తిని పొందింది శ్రీమద్భాగవతం అందుకే ''ఏకం భాగవతం శాస్త్రం ముక్తి దానేన గర్జతి'' ముక్తినివ్వగలిగిన శాస్త్రాల్లో ప్రధానమైంది భాగవతమని వక్కాణించారు పౌరాణికులు ''విద్యావతాం భాగవతే పరీక్షా '' శ్రీమద్భాగవతంలో గల పాండిత్యాన్ని బట్టి ఎవరు పండితులో ఎవరు కారో నిర్ణయం చేయవచ్చునని భావం అంటే, భాగవతంలోని విషయాలెంతో గాంభీర్యంతో ఉంటాయని దీన్నిబట్టి తెలుస్తోంది

దారిద్ర్యదుఃఖ జ్వరదాహితానాం
మాయాపిశాచీపరిమర్దితానామ్ ।
సంసార సింధౌ పరిపాతితానాం
క్షేమాయ వై భాగవతం ప్రగర్జతి ॥

దారిద్ర్య పీడితులు, దుఃఖితులు, అనారోగ్యబాధితులు, 'మాయ' అనే పిశాచికి బలైనవారు, సంసారమనే సముద్రంలో పడినవారు ఇలాంటి వారిని రక్షించడం కోసమే భాగవతం పుట్టింది

ఏతస్మాదపరం కించిన్మనః శుద్ధ్యైన విద్యతే ।
జన్మాంతరే భవేత్పుణ్యం తదా భాగవతం లభేత్ ॥

మనస్సు నిష్కల్మషం కావడానికి భాగవతాన్ని మించిన సాధనం లేదు ఎన్నో జన్మల్లో పుణ్యం చేసికొంటేగాని భాగవతకథాశ్రవణం లభ్యం కాదు ఒక ఆసక్తి కరమైన అంశం –

పరీక్షితే కథాం వక్తుం సభాయాం సంస్థితే శుకే।
సుదాకుంభం గృహీత్వైవ దేవాస్తత్ర సమాగమన్॥
శుకం నత్వాऽవదన్సర్వే స్వకార్యకుశలాః సురాః।
కథాసుదాం ప్రయచ్ఛస్వ గృహీత్వైవ సుధామిమామ్॥
ఏవం వినిమయే జాతే సుధా రాజ్ఞా ప్రపీయతామ్।
క్వ సుధా క్వ కథా లోకే క్వ కాచః క్వ మణిర్మహాన్॥
బ్రహ్మరాతో విచార్యైవం తధా దేవాన్ జహాస హ॥
అభక్తాన్ తాన్శ్చ విజ్ఞాయ న దదౌ స కథాऽమృతమ్।
శ్రీమద్భాగవతీ వార్తా సురాణామపి దుర్లభా॥

అది పరీక్షిన్మహో రాజా వారి ఆస్థానం మహారాజు గారి కోరికను మన్నించి భాగవతకథలను వినిపించడానికి వచ్చాడు శుకమహర్షి ఈ శుభవార్త దేవతలకు తెలిసింది అమృత భాండంతో మహానందంతో వచ్చారక్కడికి మహర్షిని నమస్కరించారు ''మహర్షీ! మీకు సమ్మతమైతే భాగవతకథామృతం మాకు వినిపించండి కథామృత పానం చేస్తాము దానికి బదులుగ ఈ అమృత భాండంలోని అమృతాన్ని ఈ మహారాజుకిస్తాము ఇతడు దీన్ని సేవించి స్వర్గసుఖాలు పొందవచ్చును'' అన్నారు ఆశ్చర్యపోయాడు మునీశ్వరుడు దేవతల అమృతానికి, భాగవతకథామృతంతో పోలికా! గాజుముక్క, విలువైన మణి ఒకటవుతాయా? తనలో నవ్వుకొన్నాడు దేవతల బేరధోరణి నచ్చలేదు భక్తి భావం స్థానంలో అహంభావం కనిపించింది దేవతల్లో రాజీకి రాలేకపోయాడు ఫలితంగా శ్రీమద్భాగవత కథామృత శ్రవణం దేవతలకు లభ్యం కాలేదు ఈ విధంగా భాగవతం తాలూకు ఔన్నత్యం ఎంతటిదో తెలియజేస్తున్నదీ వృత్తాంతం

భారతే మానవం జన్మ ప్రాప్య భాగవతం న యైః।
శ్రుతం పాపపరాధీనైరాత్మఘాతస్తు తైః కృతః॥

పవిత్రభారతావనిలో పుట్టిన ప్రతి మనిషి భాగవత శ్రవణం చేయాలి పాపవశులై అలా చేయకపోతే అది ఆత్మహత్యాసదృశమే కాగలదు

# శ్రీమద్భాగవతాస్మ్కతిః

తుంగభద్రానదీ తీరంలో ఒక పట్టణముండేది అక్కడి ప్రజలందరూ ధార్మికులు ఆ పట్టణంలో ఒక పండితుడుండేవాడు పేరు ఆత్మదేవుడు అతని భార్య ధుంధులి పెద్ద గయ్యాళి తనమాటే నడిపించుకొనేది అందరిళ్ళల్లో జరిగే సంగతులు తనకు కావాలి ప్రతివారితో కలహమే వాగుడుకాయ అయితే భర్తవిషయంలో ప్రేమతోనే ఉండేది ఈ దంపతులకర్థకామాలే ప్రధానం ఏనాడూ ధర్మమాచరించలేదు కాపురం నడుస్తోంది ఎంతోకాలమైంది సంతానం కలగలేదు అప్పటికి జ్ఞానోదయమైంది ధర్మకార్యాలు మొదలెట్టారు ఎన్నో దానాలు చేశారు ప్రయోజనం లేకపోయింది ఈ బాధను భరించలేకపోయాడాత్మదేవుడు ఒకనాడడవికెళ్ళాడు దాహం వేసింది దగ్గర్లో ఉన్న ఓ సరస్సులో దాహం తీర్చుకొన్నాడు నీరసంగా కూర్చొన్నాడక్కడ ఆ సమయంలో ఒక సన్న్యాసి వచ్చాడక్కడికి గట్టిగా ఏడుస్తూ అతని కాళ్ళమీద పడ్డాడాత్మదేవుడు సన్న్యాసి అడిగాడు -

కథం రోదిషి విప్ర! త్వం కా తే చింతా బలీయసీ ।
వద త్వం సత్వరం మహ్యం స్వస్య దుఃఖస్య కారణమ్ ॥

ఓ బ్రాహ్మణుడా! ఎందుకేడుస్తున్నావు? నీ దుఃఖానికి కారణమేమో వెంటనే నాకు చెప్పు - అని దీని భావం

మహాత్మా! ఏమని చెప్పను? పూర్వ జన్మలో ఎన్నో పాపాలు చేశాను దాని ఫలితమే నాకు సంతాన భాగ్యం లేకపోవడం ఆత్మహత్య చేసికొందామని ఇక్కడికొచ్చాను సంతానం లేనివానికి బ్రతుకు, ఇల్లు, సంపదలు ఇవన్నీ దండుగ

పాల్యతే యా మయా ధేనుః సా వంధ్యా సర్వధా భవేత్ ।
యో మయా రోపితో వృక్షః సోఽపి వంధ్యత్వమాశ్రయేత్ ॥
యత్ఫలం మద్గృహాయాతం తచ్చ శీఘ్రం వినశ్యతి ।
నిర్భాగ్యస్యానపత్యస్య కిమతో జీవితేన మే ॥

ఓ యతీశ్వరా! నేను పెంచుకొనే ఆవు గొడ్డుది నా ఇంట్లో పెరిగే మొక్కలు పూతకు నోచుకోవు ఇంటికి పళ్ళైనా తెస్తే అవి వెంటనే కుళ్ళిపోతాయి దౌర్భాగ్యుడనైన నాకు సంతాన యోగం లేదు ఇన్ని విధాలుగ బాధలుపడే నేను ఎందుకని బ్రతకాలి? అంటూ మళ్ళీ ఏడవసాగాడు ఈ మాటల్లో ఎంతో దైన్యముంది ఆ సన్యాసి మనసు కరిగింది దివ్యదృష్టితో కారణం తెలిసికొన్నాడు ''సంతానం గురించి బెంగపడవద్దు మొత్తం ఏడు జన్మల్లో నీకాప్రాప్తం లేదు సంసార వాసనలు వదలుకో సన్యాసం పుచ్చుకొని భగవత్సాన్నిధ్యం కోసం ప్రయత్నించు'' అని ఉపదేశించాడు

ఈ ఉపదేశవచనాలాత్మదేవుని తలకెక్కలేదు ''మహాత్మా! నాకు వైరాగ్యమవసరం లేదు సంతానసుఖమే కావాలి సన్యాసం పుచ్చుకోను నీవు దయతలిస్తే నాకు పుత్రప్రాప్తి కాగలదు లేకపోతే నేనాత్మహత్యకు సిద్ధమౌతాను ఇదే నా నిర్ణయం'' అన్నాడు ఇతని పట్టుదల చూశాడాసన్యాసి ఇక లాభం లేదనిపించింది ఆత్మదేవుని కొక పండునిచ్చాడు ''ఈ ఫలాన్ని నీభార్యతో కలసి తినాలి సత్యము, దానము, పవిత్రత, ఒంటిపూట భోజనం మొదలైన నియమాలతో ఒక సంవత్సరకాలం గడిపితే బుద్ధిమంతుడైన పుత్రుడు కలుగుతాడు'' అని సెలవిచ్చి తన దారిన వెళ్ళిపోయాడు సన్యాసి ఎంతో సంతోషంతో ఇంటికెళ్ళాడాత్మదేవుడు అడవిలో జరిగిన వృత్తాంతం చెప్పాడు భార్యతో సన్యాసి ఇచ్చిన పండునామెకిచ్చాడు ఏదో పని మీద బయటికెళ్ళాడు

అపుడతని భార్య ధుంధులి గట్టిగ ఏడుస్తూ తన సఖితో ఇలా అంది–

అహో చిన్తా మమోత్పన్నా ఫలం చాహం న భక్షయే।
ఫలభక్షేణ గర్భః స్యాద్గర్భేణోదరవృద్ధితా ।
స్వల్పభక్షం తతోऽశక్తిర్గృహకార్యం కథం భవేత్ ॥

దైవాద్ధాటీ వ్రజేద్గ్రామే పలాయే ద్గర్భిణీ కథం।
శుకవన్నివసేద్గర్భః తం కుక్షేః కథముత్సృజేత్ ॥

తిర్యక్ఛేదాగతో గర్భస్తదామే మరణం భవేత్ ।
ప్రసూతౌ దారుణం దుఃఖం సుకుమారీ కథం సహే ॥
మందాయాం మయి సర్వస్వం ననాందా సంహరేత్తదా ।
సత్యశౌచాదినియమో దురారాధ్యః స దృశ్యతే ॥
లాలనే పాలనే దుఃఖం ప్రసూతా యాశ్చ వర్తతే ।
వంధ్యా వా విధవా నారీ సుఖినీ చేతి మే మతిః ॥

''సఖీ! నాకిప్పుడు పెద్ద చింత వచ్చి పడింది నేను ససేమిరా ఈ పండు తినను పండు తింటే గర్భమొస్తుంది గర్భమొస్తే పొట్ట పెద్దదవుతుంది ఎక్కువగ తినరాదు తినకపోతే నీరసం ఇంట్లో పనులు జరగవు ప్రమాద పరిస్థితి ఏదైనా వస్తే పరుగెత్తలేను ఒకవేళ పిండం అడ్డంగా బయటికొస్తే నాకు చావు తప్పదు ప్రసవంలో ఎన్నో కష్టాలున్నాయి నేనేమో సుకుమారిని తట్టుకోలేను నా ఆరోగ్యం దెబ్బతింటే ఇదే సమయమని నా సంపదంతా నా ఆడపడచు కాజేయవచ్చు ఇక మావారు చెప్పిన సత్యము, పవిత్రత మొదలైన నియమాల్ని నేను పాటించలేను పుట్టిన బిడ్డను పెంచడం నావల్ల కాని పని అందువల్ల నా దృష్టిలో ఆడది సుఖపడాలంటే గొడ్రాలుగ బ్రతకాలి లేక విధవ కావాలి ఎట్టి పరిస్థితుల్లో సంతానవతి కారాదు'' – ఇదీ నా అభిప్రాయమంది

చివరికి ఆ పండు తినలేదు భర్త వచ్చి పండు విషయమై అడిగాడు ఎప్పుడో తినేశానని అబద్ధమాడింది సరిగ్గా అదేసమయంలో ఈమె చెల్లెలొచ్చింది విషయమంతా తన చెల్లితో చెప్పకొంది ధుంధులి

అపుడాచెల్లి – ''అక్కా! ప్రస్తుతం నేను గర్భవతిని నాకు పుట్టబోయే బిడ్డను నీకిస్తాను అప్పటిదాకి నీవు గర్భిణిలా నటించాలి గుమ్మం దాటి బయటికెళ్ళకు ప్రసవం జరిగిన వెంటనే నాభర్తతో బిడ్డను నీ దగ్గఱకు పంపుతాను మరి, నీవేమో నాభర్తకు కావలసినంత డబ్బులివ్వాలి నన్నెవరైనా అడిగితే గర్భస్రావం జరిగిందని చెబుతాను ఆ తరువాత నీ ఇంట్లోనే ఉండి బిడ్డను పెంచుతాను మరి, ఆ సన్యాసి ఇచ్చిన పండు ఉన్నది కదా! దాని ప్రభావం పరీక్షించాలి దాన్ని మీ ఆవుకు పెట్టు'' అంది

అలాగే చేసింది అక్క ధుంధులి కొంత కాలం తర్వాత చెల్లెలు మగబిడ్డను ప్రసవించింది పథకం ప్రకారం ఆ బిడ్డ ధుంధులి ఒళ్ళోకి చేరాడు సుఖప్రసవం జరిగిందని భర్తతో అబద్ధమాడింది పరమానందభరితుడయ్యాడాత్మానందుడు ఎంతో వైభవంగా దానాలు చేశాడు

భర్తురగ్రేఽబ్రవీద్వాక్యం స్తనం నాస్తి కుచే మమ।
అన్యస్తన్యేన నిర్దుగ్ధా కథం పుష్ణామి బాలకమ్ ॥

మత్స్వసుశ్చ ప్రసూతాయా మృతో బాలస్తు వర్తతే।
తామాకార్య గృహే రక్ష సాతేఽర్భం పోషయిష్యతి ॥

ధుంధులి తన భర్తతో – ''నాథా! చనుబాలు లేవు ఇంకొకరి పాలతో నా బిడ్డపెరగడం నాకిష్టం లేదు మా చెల్లికి ఇటీవల గర్భస్రావం జరిగింది ఆమెను పిలిపించి మన ఇంట ఉంచుకొందాం ఆమె చనుబాలతో మన బాబు పెరుగుతాడు'' అంది సంతోషంగా ''సరే'' అన్నాడతడు. ''ధుంధుకారుడు'' అని పేరు పెట్టారా శిశువుకు

త్రిమాసే నిర్గతే చాథ సా ధేనుః సుషువేఽర్భకమ్।
సర్వాంగసుందరం దివ్యం నిర్మలం కనకప్రభమ్ ॥

భాగ్యోదయోఽధునా జాత ఆత్మదేవస్య పశ్యత।
ధేన్వా బాలః ప్రసూతస్తు దేవరూపీతి కౌతుకమ్ ॥

న జ్ఞాతం తద్రహస్యంతు కేనాపి విధియోగతః।
గోకర్ణం తం సుతం దృష్ట్వా గోకర్ణం నామ చాకరోత్ ॥

మూడు మాసాలు గడిచాయి ఆత్మదేవుని ఇంట ఆవుకు ప్రసవమైంది. సర్వాంగసుందరుడు, బంగారు వన్నెతో మనిషి రూపంతో ఉన్న బాలునికి జన్మనిచ్చిందాగోవు శుభపరంపరతో పరవశించాడాత్మదేవుడు అక్కడి జనాలందఱు ఈ వింతను దైవఘటనగ అభివర్ణించారు అసలు గుట్టు ఎవ్వరికీ తెలియదు ఆ బాలుడికి చెవులు మాత్రం ఆవు చెవులొచ్చాయి ఈ కారణంగా అతనికి గోకర్ణుడని నామకరణం చేశారు ధుంధుకారుడు,

గోకర్ణుడు కలసి పెరుగుతున్నారు గోకర్ణునికి మంచిగుణాలబ్బినాయి. మేధావి, అన్ని శాస్త్రాలు చక్కగ చదువుకొన్నాడు

ధుంధుకారుడు దుర్మార్గుడయ్యాడు నిత్యము స్నానం చేయడు చెడుతిళ్ళు, చెడుతిరుగుళ్ళు, దొంగతనాలు అలవాటయ్యాయి పట్టణం లోని వారందఱు ఇతన్ని అసహ్యంగ చూసేవారు ఆటకోసం పిల్లల్ని పిలిచి నూతుల్లోకి తోసేవాడు కత్తులు, పిడిబాకులు అన్ని వేళల్లో అతనితో ఉండేవి అమాయకులను, గుడ్డివారిని పీడించేవాడు వేశ్యాలోలుడయ్యాడు. తల్లిదండ్రులను చితకబాదేవాడు తండ్రి ఆస్తిని మొత్తం హారతి కర్పూరం చేశాడు ఇతని బాధలు భరించలేకపోయారు తల్లిదండ్రులు ''వంధ్యత్వం తు సమీచీనం కుపుత్రో దుఃఖదాయకః'' ఇలాంటి నీచుడైన కొడుకు పుట్టక పోయినా బాగుండేదని రోదించారు ''నేనెక్కడికి వెళ్ళాలి? ఎవరినాశ్రయించాలి? నా బాధలెవరితో చెప్పకోవాలి? నాకు మరణమే శరణం'' అని గట్టిక ఏడవసాగాడు ఆత్మదేవుడు ఆ సమయంలో తండ్రి దగ్గఱి కొచ్చాడు గోకర్ణుడు సంసారం సారంలేనిదనీ, బంధాలు తెంచుకోవాలేగాని పెంచుకోరాదనీ వైరాగ్యముపదేశించాడు ఏకాంతంలోనే సుఖముంది ధనము, బిడ్డలు అంతా మిధ్య వెంటనే అడవులకెళ్ళమన్నాడు ''అడవులకెళ్ళి ఏం చేయాలి'' అడిగాడు తండ్రి గోకర్ణుడిలా తత్త్వబోధ చేశాడు –

ధర్మం భజస్వ సతతం త్యజ లోకధర్మాన్
సేవస్వ సాధు పురుషాన్ జహి కామతృష్ణామ్।
అన్యస్య దోషగుణచింతనమాశు త్యక్త్వా
సేవాకథారసమహో నితరాం పిబ త్వమ్ ॥

ఎల్లవేళలా ధర్మమార్గంలోనే నడచుకో లౌకిక వ్యవహారాలు వదులుకో సత్పురుషులను సేవించాలి కోరికలను దూరంగా ఉంచాలి ఇతరుల్లో ఉన్న దోషాలను వెదకరాదు సర్వదా సేవాభావం పెంపొందించుకోవాలి

గోకర్ణుని ఉపదేశవచనాలను త్రికరణశుద్ధిగ పాటించాడాత్మదేవుడు సర్వకాలసర్వావస్థల్లో హరిసేవలో లీనమయ్యాడు కొంత కాలమయ్యాక

శ్రీకృష్ణభగవానుని సాయుజ్యం పొందాడు

తండ్రి మరణించాక తల్లిని మరింత పీడించాడు ధుంధుకారుడు ఈ బాధలు తట్టుకోలేక నూతిలో దూకి ఆత్మహత్యచేసికొంది ధుంధులి

గోకర్ణుడు స్థిత ప్రజ్ఞుడు సుఖ-దుఃఖాలు, రాగ-ద్వేషాలు, స్వకీయులు-పరకీయులు ఇలాంటి తేడాలేవీ అతనిలో అగుపించవు తీర్థయాత్రలకెళ్ళాడు

ధుంధుకారుడు అయిదుగురు వేశ్యలను తన ఇంట తెచ్చి ఉంచుకొన్నాడు వారిని పోషించాలి కదా। అందుకని మరిన్ని భయంకర కృత్యాలారంభించాడు ఒకరోజు విలువైన ఆభరణాలు తెచ్చిపెట్టమని అతన్ని కోరారు వారు వారి ఆనందమే అతనిక్కావాలి ఆ రాత్రికే వారి కోరికను తీర్చాడు ఆభరణాలు మాత్రమే కాక విలువైన వస్త్రాలు కూడ తెచ్చిపెట్టాడు గజదొంగ అయిన అతనికి సాధ్యం కానిదేముంది? ఆ రాత్రి హాయిగ నిద్రపోతున్నాడు ఈ వేశ్యలైదుగురు సమావేశమయ్యారు "ఈ ధుంధుకారుడు ప్రతిదినము దొంగతనాలు చేస్తున్నాడు ఏదో ఒకనాడు పట్టుబడక తప్పదు అపుడు ఇతని వద్ద ఉన్న ధనం మొత్తం రాజాధీనమవుతుంది ఇతనికి మరణశిక్ష ఎలాగూ తప్పదు అందువల్ల మనమే ఇతన్ని గుట్టుగ హత్య చేద్దాం అపుడు మొత్తం ఆ ధనం మన వశమౌతుంది" అని నిర్ణయించారు అంతే దారుణంగా హత్య చేశారు ధనం మూటగట్టుకొని తమ పథకం ప్రకారం దూరప్రాంతాలకు వెళ్ళిపోయారు

సుధామయం వచోయాసాం కామినాం రసవర్ధనమ్।
హృదయం క్షురధారాభం ప్రియః కో నామ యోషితామ్ ॥

వేశ్యల మాటలు అమృతం కురిపిస్తాయి ఆ మాటలకు దాసులౌతారు కాముకులు అయితే ఆ వేశ్యల మనసు పదునైన కత్తి లాంటిది వారికి ప్రియమైన వారంటూ ఎవ్వరూ ఉండరు ధనం మాత్రమే వారికి ప్రీతిపాత్రమైనది అందువల్ల వారిని నమ్మరాదు

చివరికి ధుంధుకారుడు తన పాపాల కారణంగా ప్రేతమయ్యాడు ఒకచోట నిలకడగ ఉండక ఆకలి - దప్పికలతో అన్ని దిక్కుల్లోనూ తిరగసాగాడు చివరికి ఒకచోట మరణించాడు ఇతని మరణవార్త తీర్థయాత్రల్లో ఉన్న గోకర్ణునికి తెలిసింది ఇతని ఆత్మశాంతి కోసం గయాశ్రాద్ధం చేశాడు కొంత కాలమయ్యాక తన పట్టణానికి తిరిగివచ్చాడు అది రాత్రి సమయం కావడం వల్ల అతన్ని ఎవ్వరూ చూడలేదు తన ఇంటి గుమ్మం ముందు పడుకొన్నాడు అర్ధరాత్రి సమయంలో ప్రేత రూపంలో ఉన్న ధుంధుకారుడొచ్చాడు ఒకసారి మేక రూపంతో , మరోసారి ఏనుగు రూపంతో, ఇంకోసారి దున్నపోతు రూపంతో ఇలాగ నానా రూపాలతో గోకర్ణుని ముందుకొచ్చాడు నిద్రలేచాడు గోకర్ణుడు ''నీవెవరు? ప్రేతమా? పిశాచమా? రాక్షసుడివా? ఎందుకిలా తిరుగుతున్నావు?'' అని అడిగాడు ప్రేతం గట్టిగా ఏడ్చింది సమాధానం చెప్పాలనుకొంది కాని ఆహారం లేని కారణంగా నీరసంతో మాట బయటికి రాలేదు సైగలు మాత్రమే చేయసాగింది గోకర్ణుడు నీటితో ప్రోక్షించాడు ఆప్రేతాన్ని దాంతో కొంత శక్తి వచ్చింది అపుడా ప్రేతమిలా అంది - ''సోదరా! నేను నీ అన్నయ్యను ధుంధుకారుడను నా స్వయంకృతాపరాధకారణంగా ప్రేతమయ్యాను నేను చేసిన మహాపాతకాలకు నిష్కృతి లేదు ప్రస్తుతం గాలియే నాకాహారం. ఎంతో దీనంగా బ్రతుకుతున్నాను నన్ను నీవే కాపాడాలి'' అని ప్రాధేయపడ్డాడు ''నీ ముక్తికోసం గయాశ్రాద్ధాలు చేశాను ముక్తి లభించకపోవడమాశ్చర్యంగా ఉందే'' అన్నాడు గోకర్ణుడు ''నూరు గయాశ్రాద్ధాలు చేసినా నాకు ముక్తి లేదు వేరే ఉపాయమాలోచించు'' అన్నాడు ధుందుకారుడు ''సరే, నేనాలోచిస్తాను నీవు వెళ్ళిపో'' అని గోకర్ణుడతన్ని పంపించాడు తెల్లవారింది ఇతని రాక అక్కడి వారందరికి తెలిసింది సాదరంగా పలకరించారు ధుందుకారుని వృత్తాంతం వారితో చెప్పాడు గోకర్ణుడు అతడు ముక్తుడయ్యే మార్గం చెప్పమని అక్కడి పండితులను కోరాడు లోకబాంధవుడైన సూర్యభగవానుడు మాత్రమే

ఉపాయం చెప్పగలడని పండితులభిప్రాయపడ్డారు సూర్యదేవుణ్ణి ప్రార్థించాడు గోకర్ణుడు ''శ్రీమద్భాగవతాన్ముక్తిః సప్తాహం వాచనం కురు'' అని సెలవిచ్చాడు దివాకరుడు శ్రీమద్భాగవత సప్తాహం చేస్తే ముక్తి తప్పక లభిస్తుందని తెలిసికొన్నాడు

వెంటనే భాగవత సప్తాహం ఏర్పాట్లు ప్రారంభించాడు గోకర్ణుడు ఈ శుభవార్త తెలిసి తాము కూడ ఈ కార్యంలో పాల్గొని జన్మ సార్థకం చేసికోవాలనే తలంపుతో దూర ప్రాంతాల నుండి తండోపతండాలుగ విచ్చేశారు జనాలు ఆసనమలంకరించాడు గోకర్ణుడు భాగవత పఠనం ప్రారంభించ బోతున్నాడు సరిగ్గా ఆ సమయానికే ప్రేత రూపంతో ఉన్న ధుంధుకారుడక్కడి కొచ్చాడు ఏడు సమభాగాలుగ ఉన్న ఒక వెదురుగడ అక్కడ దగ్గర్లో ఉంది అందులోకి ప్రవేశించాడు కథా పఠనం మొదలైంది భక్తి - శ్రద్ధలతో వింటున్నాడు ధుంధుకారుడు ఆ సాయంకాలానికి మను - కర్దమ సంవాదపర్యంతం కథ జరిగింది ఒక ఆశ్చర్యం జరిగింది శ్రోతలందరు చూస్తుండగనే పటపటమంటూ పెద్ద శబ్దంతో వెదురుగడలోని ఒక భాగం చీలింది. ఇలా ఆరు రోజులు ఆరు భాగాలు చీలాయి ఏడవ రోజు కార్యక్రమమైంది వెంటనే ఏడవ భాగం కూడ చీలింది ఆ వెదురుగడలో నుంచి పీతాంబరాలు, కుండలాలు, తులసీమాల ధరించి దేవతాకారంతో ప్రత్యక్షమయ్యాడు ధుంధుకారుడు గోకర్ణుని దగ్గఱకెళ్ళాడు ప్రణామం చేశాడు ''సోదరా! నీ కారణంగానే నా ప్రేతత్వం పోయింది భాగవత ప్రాశస్త్యం తెలిసింది'' అంటూ తన కృతజ్ఞతలను ఆర్ద్రహృదయంతో అందించాడు

ధన్యా భాగవతీ వార్తా ప్రేతపీడావినాశినీ।
సప్తాహోఽపి తథా ధన్యః కృష్ణలోక ఫలప్రదః॥

ప్రేతపీడను నాశమొందించగల శ్రీమద్భాగవత కథలు ధన్యములు భాగవత సప్తాహం ఎంతో శ్రేయస్కరమైనది శ్రీకృష్ణ సాయుజ్యమందించ గల ఏకైక మార్గం శ్రీమద్భాగవత సప్తాహం - అంటూ భాగవతాన్ని స్తుతించాడు

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి సప్తాహశ్రవణే కృతే॥

భాగవతసప్తాహంలో పాల్గొని భక్తి - శ్రద్ధలతో శ్రవణం చేస్తే హృదయం పరిశుద్ధమౌతుంది సంశయాలన్నీ పటాపంచలవుతాయి అంతేగాక సకల పాపాలు హరిస్తాయి.

ఈ విధంగా శ్రీకృష్ణభక్తి తన్మయుడయ్యాడు ధుంధుకారుడు ఇంతలోనే వైకుంఠం నుంచి దేదీప్యమానంగా విమాన మొకటి వచ్చి అతని ముందాగింది విష్ణుదూతలు సాదరంగా అందులోకతన్ని ఆహ్వానించారు

అపుడు గోకర్ణుడు విష్ణుదూతలనడిగాడు -

అత్రైవ బహవఃసన్తి శ్రోతారో మమ నిర్మలాః।
ఆనీతాని విమానాని న తేషాం యుగపత్ కుతః॥
శ్రవణం సమభాగేన సర్వేషామిహ దృశ్యతే।
ఫలభేదః కుతో జాతః ప్రబ్రువంతు హరిప్రియాః॥

''వైష్ణవోత్తములారా! భాగవత సప్తాహంలో పాల్గొని పరిశుద్ధ హృదయంతో శ్రవణం చేసిన వారెందరో ఇక్కడ ఉన్నారు కదా! మరి, వారందరినీ వైకుంఠం తీసికొని వెళ్ళేందుకు విమానాలెందుకు రాలేదు? ధుంధుకారుడితో సమానంగా వారందరు సమానంగా పాలుపంచుకొన్నారు అయితే, ధుంధుకారునికాయోగం పట్టింది ఇతరులకు లేదు ఇందులోని మర్మమేమిటి? దయచేసి నాకు తెలియజేయండి'' అన్నాడు

అపుడాహరిసేవకులన్నారు -

శ్రవణం తు కృతం సర్వైర్న తథా మననం కృతమ్।
ఫలభేదస్తతో జాతో భజనాదపి మానవ॥
సప్తరాత్రముపోష్యైవ ప్రేతేన శ్రవణం కృతమ్।
మననాది తథా తేన స్థిరచిత్తే కృతం భృశమ్॥
విశ్వాసో గురువాక్యేషు స్వస్మిన్ దీనత్వభావనా।
మనోదోషజయశ్చైవ కదాయాం నిశ్చలా మతిః॥

ఏవమాది కృతం స్యాచ్చేతదా వై శ్రవణే ఫలమ్ ॥
పునః శ్రవాన్తే సర్వేషాం వైకుంఠే వసతిర్ధ్రువమ్ ॥

''గోకర్ణా! భాగవత కథలనిక్కడి వారందఱు శ్రవణమైతే చేశారు గాని మననం చేయలేదు ఈ కారణంగా వారికి వైకుంఠంనుంచి పిలుపందలేదు ప్రేతరూపంలో ఉండిన ధుంధుకారుడు ఈ ఏడు రాత్రులు తాను శ్రవణం చేసిన విషయాలను ఏకాగ్ర చిత్తంతో చక్కగ మననం చేశాడు గురువుగారి మాటల పట్ల గౌరవము, తనయందహంకార రాహిత్యము ప్రతివాడలవఱచుకోవాలి మనస్సులోని మాలిన్యాన్ని దూరం చేయాలి నిశ్చలమైన మనసుతో భాగవత కథలను శ్రవణ - మననాలు చేసిననాడు తప్పక వైకుంఠం ప్రాప్తిస్తుంది'' అని భావం

హరిదూతల ఉపదేశ వచనాలు విన్నాడు గోకర్ణుడు ఓ శుభముహూర్తంలో మళ్ళీ భాగవతసప్తాహం ప్రారంభించాడు శ్రోతలు శ్రద్ధగా శ్రవణ మననాలు చేశారు సప్తాహం పూర్తయింది ఎన్నో విమానాలొచ్చాయి విష్ణుదూతలే గాక సాక్షాత్తు మహావిష్ణువే వచ్చాడక్కడికి జయ జయ ధ్వనులు మారుమ్రోగాయి

పాంచజన్యధ్వనిం చక్రే హర్షాత్తత్ర స్వయం హరిః ।
గోకర్ణం తం సమాలింగ్యాऽకరోత్ స్వసదృశం హరిః ॥

భక్తపరవశుడయ్యాడు శ్రీహరి మహానందంతో తన పాంచజన్యమనే శంఖం పూరించాడు ప్రేమతో గోకర్ణుని ఆలింగనం చేసికొన్నాడు భాగవత కథా శ్రోతల రూపురేఖలు మారిపోయాయి అందఱికీ హరిదూతల వేషం వచ్చింది

అయోధ్యావాసినః పూర్వం యథా రామేణ సంగతాః ।
తథా కృష్ణేన తే నీతా గోలోకం యోగిదుర్లభమ్ ॥

శ్రీరామావతారం చివర్లో ఎలాగైతే రామచంద్రుడు అయోధ్యావాసులందర్నీ తన వెంట తీసికొని వెళ్ళాడో అదే విధంగా శ్రీకృష్ణుడు ఈ భాగవత శ్రోతలందర్నీ తనతో వైకుంఠం తీసికొని వెళ్ళాడు

వాతాంబు పర్ణాశన దేహశోషణైః
తపోభిరుగ్రైశ్చిరకాల సంచితైః ।
యోగైశ్చ సంయాన్తి న తాం గతిం వై
సప్తాహగాథాశ్రవణేన యాన్తి మామ్ ॥

గాలి, నీరు, ఆకులను ఆహారంగా తీసికొంటూ శరీరాన్ని శుష్కింపచేస్తూ ఎంతోకాలం భయంకరమైన తపస్సు చేయడం ద్వారా, యోగాభ్యాసంద్వారానూ పొందలేని ఉత్తమగతిని భాగవత సప్తాహంలో పాల్గొని శ్రవణ – మననాలు చేయడం ద్వారా పొందగలరు

శ్రీమద్భాగత మహాపురాణం గురించి ఎంత వర్ణించినా అది పరిమితమే అవుతుంది

శ్రీకృష్ణపరమాత్ముడు ఇలా అన్నాడు –

మత్కథా వాచనే నిత్యం మత్కథాశ్రవణే రతమ్ ।
మత్కథాప్రీతమనసం నాహం త్యక్ష్యామి తం నరమ్ ॥

ఎవరైతే నా కథలను పఠిస్తారో, ఎవరైతే భక్తి శ్రద్ధలతో వింటారో తద్వారా సంతుష్ట హృదయులవుతారో అలాంటి వారిని సర్వకాల సర్వావస్థల యందు నేను రక్షిస్తాను

  

# ౬. నారదపురాణము

నారదమహాముని ఉపదేశించిన దీపురాణం ''నాభిః స్యాన్నారదీయకమ్'' మహావిష్ణువు యొక్క నాభిస్థానంతో పోల్చబడింది నారదపురాణం ''పంచవింశత్సహస్రాణి నారదీయం తదుచ్యతే'' ఇందులో 25 వేల శ్లోకాలున్నాయని భావం పూర్వ ఖండం, ఉత్తర ఖండమని రెండు భాగాలు మొదటి ఖండంలో 125, రెండవ ఖంగంలో 82 కలిపి మొత్తం 207 అధ్యాయాలున్నాయి

పురాణాల ప్రాశస్త్యం, శివకేశవుల అభేదం, భక్తివిశిష్టత, సదాచారం, పురాణప్రవక్తల గురుత్వం, కలియుగంలో చేయరాని కర్మలు, వివాహానికి పనికిరాని స్త్రీ లక్షణాలు, సత్యహరిశ్చంద్ర వృత్తాంతం, శ్రీకృష్ణమాహాత్మ్యం, బ్రహ్మాండోత్పత్తి వర్ణన, సుభాషితాలు మొదలైన అంశాలిందులో విపులంగా ఉన్నాయి

భక్తి విశిష్టత –

న దానైర్నతపోభిర్వా యజ్ఞైర్వా బహుదక్షిణైః।
భక్తిహీనైర్మునిశ్రేష్ఠ తుష్యతే భగవాన్ హరిః॥

దానమ్మైనా, తపమ్మైనా, యజ్ఞమ్మైనా సంపూర్ణ భక్తి భావంతోటే చేయాలి అహంకారంతో చేస్తే అది ఫలించదు భగవంతుడు సంతుష్టుడు కాజాలడని భావము

లోకే స ధన్యః స శుచిః స విద్వాన్
స ఏవ వక్తా స చ ధర్మశీలః।
జ్ఞాతా స దాతా స చ సత్యవక్తా
యస్యాస్తి భక్తిః పురుషోత్తమాఖ్యే॥

ఎవనికైతే పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని పట్ల భక్తి భావముంటుందో అతడే లోకంలో ధన్యుడు, పవిత్రుడు, పండితుడు, వక్త, ధర్మతత్పరుడు, జ్ఞాని, దాత మరియు సత్యవంతుడని భావం అంటే,

భగవంతుని పట్ల వినమ్రత ఒక్కటి ఉంటే పై గుణాలన్నీ వాటంతట అవే వస్తాయని తాత్పర్యము

అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచీనగరం, అవంతికా, ద్వారవతి ఈ ఏడు నగరాలు మోక్షదాయకాలని కీర్తింపబడ్డాయి నారదపురాణంలో

ప్రజా రక్షణ, శత్రు సంహారం, న్యాయంతో కూడిన పన్ను విధానం, మృదు భాషిత్వం, గోరక్షణ తత్పరత, తిండి - బట్ట - ఇల్లు అనే కనీస సౌకర్యాలు ప్రజలకు చేకూర్చడం, మద్యపానం చేసేవారిని ఆ నగరం నుండి వెలివేయడం మొదలైనవి రాజధర్మాలు ఇందులో పేర్కొనబడినాయి

**దశహరా (దశరా) -**

పాపం పది రకాలు (1) దౌర్జన్యంతో వస్తువులను తీసికోవడం (2) ఇతరులను హింసించడం (3) పరస్త్రీలను అనుభవించడం (4) కఠినపుమాటలు (5) అబద్ధాలాడటం (6) చాడీలు చెప్పడం (7) అసంబద్ధప్రలాపం (8) ఇతరుల వస్తువులను కాజేయాలనే కోరిక (9) ఇతరులకు చెడు జరగాలని కోరుకోవడం (10) పనికిరాని విషయాల్లో పట్టుదల

పై పాపాలు నశించాలంటే జ్యేష్ఠశుద్ధ దశమినాడు భక్తితో భగవంతుని సేవించాలి అందుకే ఈ తిథికి ''దశహరా'' అని పేరు వచ్చింది ఈ పదమే క్రమంగా ''దశరా'' గా మారింది హర్యానా మొదలైన ప్రాంతాల్లో జ్యేష్ఠశుద్ధ దశమినాడు దశరాను ఆచరిస్తారు మనం ఆశ్వయుజ శుద్ధ దశమినాడు దీన్ని ఆచరిస్తున్నాము

**సుభాషితాలు -**

రత్నాల్లాంటి సుభాషితాలను తనలోదాచుకొంది నారదపురాణం వాటిల్లో కొన్నిటిని చూద్దాం -

- అశంకితుడు (సందేహం లేనివాడు) ఎప్పుడూ సుఖంగా ఉంటాడు నిత్య శంకితుడు సదా కష్టాలపాలవుతాడు

– యవ్వనం, పుష్కలమైన డబ్బు, అధికారం, అవివేకమనే నాలిగింటిలో ఏ ఒక్కటి ఉన్నా అనర్థమే మరి, ఒకే వ్యక్తిలో ఈ నాలుగు గుణాలు నిండుగా ఉంటే ఇక చెప్పవలసినదేముంది? ఈ భావాన్ని తెలియజేసే శ్లోకం –

యవ్వనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా ।
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్ ॥

– అపకీర్తిని మించిన మృత్యువు మరొకటుండదు

''అపకీర్తి సమో మృత్యుర్లోకేష్వన్యో న విద్యతే'' ।

– సత్పురుషులు నివసించే చోట కష్టాలుండవు సూర్యుడున్న చోట చీకట్లుండవు కదా!

యత్ర సన్తః ప్రవర్తన్తే తత్ర దుఃఖం న బాధతే ।
వర్తతే యత్ర మార్తండః కథం తత్ర తమో భవేత్ ॥

ఈ శ్లోకం పై భావాన్ని చెబుతున్నది

– శత్రువుల వినయ ప్రదర్శన, వేశ్యల సహృదయత, పాము బుసకొట్టకుండుట వీటిని నమ్మరాదు ఇవి ఎప్పటికైనా దెబ్బ తీస్తాయనడంలో సందేహం లేదు ఈ భావం –

దాసభావం చ శత్రూణాం వారస్త్రీణాం చ సౌహృదమ్ ।
సాధుభావంచ సర్పాణాం శ్రేయస్కామో న విశ్వసేత్ ॥

అనే శ్లోకం వల్ల తెలుస్తుంది

– సత్పురుషులు నీచులపట్ల కూడ దయాదృష్టితో ఉంటారు చంద్రుడు చండాలుని ఇంటి నుంచి తన వెన్నెలను తప్పించడు కదా!

దుర్జనేష్వపి సత్త్వేషు దయాం కుర్వన్తి సాధవః ।
నహి సంహరతే జ్యోత్స్నాం చంద్రశ్చండాల వేశ్మనః ॥

– సాధువులంటే ఎవరు?

''సర్వలోక హితాసక్తాః సాధవః పరికీర్తితాః ।''

సర్వజనులు హితం కోరేవారే సాధువులు

– మైత్రి ఎలా వస్తుంది?

సతాం సాప్తపదీ మైత్రీ సత్సతాం త్రిపదీ తథా ।
సత్సతామపి యే సన్త స్తేషాం మైత్రీ పదే పదే ॥

ఏడడుగులు కలసి నడిస్తే ఉత్తములు మిత్రులవుతారు మూడడగులు కలసినడిస్తే ఉత్తమోత్తములతో మైత్రి కలుగుతుంది అంతకంటే ఉత్తములతో అడుగడునా ఏర్పడే అనుబంధమే మైత్రీ భావం

– ఉత్తముడంటే ఎవరు?

సుజనో న యాతి వైరం పరహితబుద్ధిర్వినాశకాలేఽపి ।
ఛేదేఽపి చందన తరుః సురభయతి ముఖం కురారస్య ॥

సర్వదా ఇతరులకు మంచిని కోరువాడే ఉత్తముడు తనకు ప్రాణాపాయ స్థితి వచ్చినా సరే తన స్వభావం మార్చుకోడు శత్రువుకు సైతం హితాన్నే కోరుతూ మరణిస్తాడు దీనికి చక్కని దృష్టాంతం- గంధపు చెట్టు అందరికీ సువాసనలు పంచిపెడుతుంది చివరికి తనను నరికే గొడ్డలికి సైతం అది పరిమళాన్నే ఇస్తుంది కదా!

– దానము, అధ్యయనము ఈ రెండింటిని సర్వదా చేస్తూనే ఉండాలి ఎన్ని అవాంతరాలొచ్చినా ఆపరాదు

''అవన్ధ్యం దివసం కుర్యాత్ దానాధ్యయనకర్మసు''

– ప్రయత్నమంటే ఎలా ఉండాలి?

యత్కీటైః పాంసుభిః శక్ష్ణైః వల్మీకః క్రియతే మహాన్ ।
న తత్ర బల సామర్థ్యముద్యోగస్త త్రకారణమ్ ॥

చీమలు చిన్న మట్టిపెల్లలతో పెద్దపెద్ద పుట్టలను తయారు చేయగలుగుతున్నాయి చిన్న చీమలకు అంత శక్తి – సామార్థ్యాలు ఎలా వచ్చాయి? అనే ప్రశ్న కలుగుతుంది వాటిల్లో వాస్తవానికి శక్తి – సామర్థ్యాలు లేవు కాని, పుట్టను తయారు చేయాలనే గట్టి ప్రయత్నం మాత్రం పుష్కలంగా ఉంది ఆ ప్రయత్నమే అంతటి అసాధ్యమైన పనిని చేయిస్తుంది గనుక, చీమల్లో ఉన్న ప్రయత్నమనే గుణాన్ని మనమూ అలవరచుకొంటే అసాధ్యాల్ని సుసాధ్యాలు చేయవచ్చని హితవు పలుకుతోంది నారదపురాణం

– విద్య ఎలా వశమవుతుంది?

యథా ఖనన్ ఖనిత్రేణ భూతలం వారి విన్దతి ।

తథా గురుగతాం విద్యాం శుశ్రూషురధిగచ్ఛతి ॥

విద్యా సముపార్జనలో ఉత్తమమైన ఉపాయం గురుశుశ్రూష దీనితో గురువును తృప్తిపఱిచిన కొద్దీ విద్య వస్తూనే ఉంటుంది కొన్నిసార్లు చివాట్లు తప్పవు మరికొన్నిసార్లు దండన తప్పదు అన్నిటినీ భరించాలి నిరంతర శుశ్రూషతో వారి అనుగ్రహం పొందాలి విద్య ప్రవహిస్తుంది సందేహం లేదు దీనికో దృష్టాంతం బావి తవ్వేవాడు తన పని చేస్తూనే ఉంటాడు నెత్తిన మీద మట్టి పడుతుంటుంది చేతులు బొబ్బలెక్కుతాయి నీరసమొస్తుంది నిలవలేని స్థితి వస్తుంది అన్నిటికీ తట్టుకొంటాడు నీరు వచ్చే వఱకు త్రవ్వుతూనే ఉంటాడు తప్పకుండా నీరు వచ్చి తీరుతుంది ఆ నీటిలో తడుస్తాడు తన కష్టాలన్నీ మరచిపోతాడు ఆ విధంగా గురు శుశ్రూష చేస్తే చక్కని విద్య ప్రాప్తిస్తుందని భావం

ఇలాంటి సూక్తిరత్నాలెన్నో ఉన్నాయీపురాణంలో

యః శృణోతి నరో భక్త్యా శ్రావయేద్వా సమాహితః ।

స యాతి బ్రహ్మణో ధామ నాత్ర కార్యా విచారణా ॥

భక్తిశ్రద్ధలతో నారదపురాణం పఠించేవారు, వినువారు బ్రహ్మసాయుజ్యం పొందగలరు

  

# 7. మార్కండేయపురాణము

మునీశ్వరులు సదా ధర్మమార్గమే అనుసరిస్తారు ఆ ధర్మానికి సంబంధించి వారికి కొన్ని సందేహాలొచ్చాయి వాటిని మార్కండేయ మహర్షి ముందుంచారు వారి శంకానివృత్తికై ఆ మహర్షి చేసిన ఉపదేశమే మార్కండేయపురాణం ''మార్కండేయం దక్షిణోంఘ్రిః'' విష్ణుభగవానుని కుడి పాదంగా వర్ణితమైందీ పురాణం ''మార్కండేయ పురాణం హి తదాఖ్యాతం చ సప్తమమ్'' అనగా మహాపురాణాల్లో ఏడవదిది ఇందులో । 34 అధ్యాయాలున్నాయి శ్లోక సంఖ్య - 9000-

బలరాముని తీర్థయాత్రలు, హరిశ్చంద్రోపాఖ్యానం, ప్రాణుల ఉత్పత్తి విధానం, నరకయాతనల వర్ణన, పతివ్రతల మాహాత్మ్యం, కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయస్వామి యొక్క అనుగ్రహం పొందడం, రాజధర్మాలు, వర్ణాశ్రమాల వర్ణన, యోగశాస్త్రానికి సంబంధించిన సిద్ధాంతాలు, ఓంకార స్వరూపం, బ్రహ్మాండోత్పత్తి, ప్రాకృత - వైకృత సృష్టి వర్ణన, జంబూద్వీపవర్ణన, దేవీమాహాత్మ్యం, సూర్యవంశవర్ణన, కరంధమ చరితం, అవీక్షితవృత్తాంతం, వపుష్మంతుని సంహారం మొదలైన విషయాలిందులో ఉన్నాయి.

కలియుగంలో మానవుల కోరికలన్నిటిని తీర్చే దేవత దుర్గాదేవి సప్తశతీపారాయణతో ఈమెను ప్రసన్నం చేసికొంటారుపాసకులు ఆ సప్తశతి ఈ పురాణంలోనే సాక్షాత్కరిస్తుంది. ఈ కారణంగా మార్కండేయపురాణం ఎంతో ప్రశస్తిని పొందింది సంపదల్లోనూ, ఆపదల్లోనూ శ్రేయస్సునిస్తుంది సప్తశతి దేవీ నవరాత్రుల్లో ఈ పారాయణను విశేషంగా ఆచరిస్తారు

పతివ్రతాశిరోమణి మదాలస వృత్తాంతమిందులో ఉంది ఎంతో ఆదర్శప్రాయమీమె చరిత్ర విక్రాంతుడు, సుబాహువు, శతమర్దనుడను ముగ్గురు ఈమె కుమారులు వీరు తల్లివద్దే అధ్యయనం చేసి వైరాగ్యం పొంది ఉత్తమ శివభక్తులవుతారు నాలుగవ కొడుకు అలర్కుడు ఇతడు

తల్లి ఉపదేశాలను లక్ష్యపెట్టడు రాజ్యపరిపాలనే కీర్తిదాయకమని ఇతని వాదన అయితే, చివర్లో కొన్ని సంఘటనలు జరుగుతాయి ఈ కారణంగా అతనిలో మానసిక పరివర్తన కలుగుతుంది తన తల్లి మదాలస ఉపదేశించిన మార్గాన్నే అనుసరిస్తాడు ఇదీ సంక్షిప్తంగా ఆమె వృత్తాంతం

మహావిష్ణువుకు నాలుగు రూపాలున్నాయి **(1) వాసుదేవ రూపం** ఇది అనిర్వచనీయమైనది శ్వేతరూపంతో మహాయోగులకు మాత్రమే ప్రత్యక్షమవుతుంది **(2) శేషరూపం** పాతాళంలో నివసిస్తూ సమస్త భూమండలాన్ని ధరించే రూపమిది దీన్ని సంకర్షణరూపమనీ అంటారు **(3) ప్రద్యుమ్నరూపం** ప్రజారక్షణ, ధర్మసంస్థాపనార్థమూ అయినదీ రూపం ఈ రూపమే దశావతారాలకు సంబంధించింది **(4) అనిరుద్ధరూపం** వైకుంఠంలో శేషశాయి పై ఉండేదే ఈ రూపం

**ధర్మపక్షులు -**

పూర్వం మందపాలుడనే ముని ఉండేవాడు ఇతడు కఠిన బ్రహ్మచర్యం పాటించేవాడు ఒకనాడు యోగాభ్యాసంతో తన దేహం చాలించాడు కాని, పుణ్యలోకం చేరలేదు దీనికి కారణమేమి? అనడిగాడు దేవతల్ని సంతానం లేకపోవడమే అని సమాధానమిచ్చారు వారు శీఘ్ర సంతానం పక్షుల్లోనే సాధ్యం అందుకని 'జరిత' అనే పక్షితో రమించాడు జరతారి, సారస్వక్కు, అస్తంభమిత్రుడు, ద్రోణుడనే నలుగురికి తండ్రి అయ్యాడు

నాలుగవ కుమారుడైన ద్రోణుని భార్య తార్క్షి ఈమె పూర్వ జన్మలో ఒక అప్సరస పేరు వపువు ఈమె వృత్తాంతమిలా ఉంది - ఒకనాడింద్ర సభలో అప్సరసల్లో ఎవరు గొప్ప? అనే ప్రశ్న వచ్చింది న్యాయనిర్ణేత నారదమహర్షి ఎవరైతే హావభావాలతో దుర్వాసమునిని ఆకర్షిస్తారో ఆమే గొప్పదవుతుందని సెలవిచ్చాడు నారదుడు తన కలాంటి శక్తి - సామర్థ్యాలున్నాయి అన్నది వపువు దుర్వాసుని తపోభూమికి బయల్దేరింది తన నాట్యగానాలతో మునిని మైమరపించింది తనలో కలిగిన వికారానికి విస్మయం పొందాడు ముని తన తపోభంగానికే ఈమె

వచ్చిందని వెంటనే గ్రహించాడు ఆ వెంటనే ఆగ్రహించాడు ''పక్షివి కమ్ము'' అని శపించాడు శాపవిమోచనం కోరిందామె ''సంతానవతివయ్యాక బాణంతో మరణిస్తావు ఆ తరువాత ఇంద్రలోకం చేరుకోగలవు'' అన్నాడు దుర్వాసుడు

కందరుడు - మదనిక అనే పక్షిజంటకు సంతానంగా పుట్టింది ఈమెయే తార్క్ష్యద్రోణుని భార్య గర్భవతిగ ఉన్న ఈమె ఒకనాడు మహాభారత యుద్ధభూమిలో నింగిలో ఎగురుతోంది ఆ సమయంలో అర్జునుడొక గుల్మంమీదికి బాణం వేశాడు ఆ బాణం ఈతార్క్షికి తగిలింది వెంటనే గర్భస్రావమైంది నాలుగు గ్రుడ్లు బయటపడ్డాయి శాపం తీరింది ఇంద్రలోకానికి వెళ్ళింది శమీకమహాముని ఆ గ్రుడ్లను తీసికొని రక్షించాడు వాటి నుండి పింగాక్షుడు, విరాటుడు, వృతుడు, సుముఖుడనే పక్షులు బయటికి వచ్చాయి శమీకముని వీటిని పెంచి పోషించాడు

ఈ పక్షులు పూర్వజన్మలో సుకృశుడనే మహావిద్వాంసుని పుత్రులు తండ్రి శాప కారణంగా పక్షిజన్మలెత్తినా మానవ భాష వచ్చేలాగ, సకల శాస్త్ర విషయాలు తెలిసేలాగునా అనుగ్రహించాడు తండ్రి ''ధర్మపక్షులు'' అని వీటినంటారు మహాభారతంలోని సందేహాలన్నిటిని ఈ పక్షుల ద్వారా తీర్చుకొన్నాడు జైమినిమహర్షి ఈ కథ మార్కండేయపురాణంలో దర్శనమిస్తుంది

కొడుకులు 3 రకాలుగా ఉంటారని చెబుతుందీ పురాణం ఆ వివరాలు చూద్దాం -

(1) యదుపాత్తం యశః పిత్రా ధనం వీర్యమథాఽపి వా।
తన్న హాపయతే యస్తు స నరో మధ్యమః స్మృతః॥

తండ్రి సంపాదించిన కీర్తి, ధనము, పరాక్రమము మొదలైన వాటిని పోగొట్టకుండా నిలుపుకొనేవాడు మధ్యముడు

(2) తద్వీర్యాదధికం యస్తు పునరన్యత్ స్వశక్తితః।
నిష్పాదయతి తం ప్రాజ్ఞా వదన్తి నరముత్తమమ్॥

తండ్రి సంపాదించిన కీర్తి, దనాలే కాక స్వశక్తితో మరింత ఆ సంపదలనినుమడింపజేసికొనే వాడుత్తముడు

(౩) యః పిత్రా సముపాత్తాని ధనవీర్యయశాంసి వై ।
న్యూనతాం నయతి ప్రాజ్ఞాస్తమాహుః పురుషాధమమ్ ॥

తండ్రి తాలూకు పై సంపదలను నానాటికీ నాశనం చేసే వాడధముడని విద్వాంసులంటున్నారు

మరో విశేషం –

తండ్రి పేరు చెప్పకొని ఆ కీర్తితో కాలక్షేపం చేయాలనే కొడుకు పనికిమాలినవాడు వాడి జన్మ దండుగ ''నేను ఫలానా వాడి తండ్రిని'' అని ఏ తండ్రి సగర్వంగా చెప్పకోగలడో ఆ కొడుకే నిజమైన కొడుకని ఈ శ్లోకం చెబుతోంది –

ధిక్తస్య జన్మ యః పిత్రా లోకే విజ్ఞాయతే నరః ।
యత్పుత్రాత్ ఖ్యాతిమభ్యేతి తస్య జన్మ సుజన్మనః ॥

సమాజంలో పుత్రుల పాత్రలను, కర్తవ్యాలనూ ఉపదేశిస్తున్నాయి ఆణిముత్యాల్లాంటి పై శ్లోకాలు

మంచి మైత్రీ భావాన్ని తెలియజేసే ఒక అద్భుతమైన కథ మార్కండేయపురాణంలో కనిపిస్తుంది –

శత్రుజిత్తు మహారాజు కొడుకు ఋతుధ్వజుడు బుద్ధి, పరాక్రం, ఔదార్యం మొ॥ సకల గుణాలరాశియే గాక మంచి అందగాడితడు ఒకప్పడు శాస్త్రచర్చ, మరొకప్పడు కావ్యపారం, ఇంకొకప్పడు గానం, క్రీడలు, శస్త్రాస్త్ర ప్రయోగాలు ఒకటేమిటి అన్నింటా పాల్గొనేవాడు అశ్వతరుడనే నాగేంద్రుని కుమారులిద్దఱు ఇతనికి మంచి మిత్రులు వీరిద్దఱిని వదలి ఉండలేని స్థితికొచ్చాడు ఋతుధ్వజుడు

ఒకనాడు తమ తండ్రితో ఋతుధ్వజుని గుణగుణాలను వర్ణించారు అశ్వతరుని పుత్రులు అందుకు సంతోషించిన అశ్వతరుడు తమ మిత్రునికి కావలసిన ధన – కనక – వస్తు – వాహనాదులను కానుకలుగ ఇవ్వమని తన కొడుకులతో చెప్పాడు అలాంటి వాటికతనికి కొదవ లేదు మనమతనికి

ఒక సహాయం చేయవచ్చును కాని, అది మనవల్ల జరిగేదు కాదు త్రిమూర్తులు మాత్రమే చేయగలరు అన్నారాపుత్రులు

ప్రయత్నం చేస్తే సాధ్యం కానిదంటూ ఏదీ ఉండదు చిన్న చీమలు తమ ప్రయత్నంతో ఎంతదూరమైనా ప్రయాణం చేయగలవు గరుత్మంతుడు వేగంగా ఎగరగలడంటే అందుక్కారణం అతని ప్రయత్నమే భూలోకంలో నివసించే ధ్రువకుమారుడు తన ప్రయత్నంతో ఉన్నత స్థితిని చేరుకొన్నాడు కదా! గనుక, ప్రయత్నిస్తే మీరు సైతం మిత్రుని ఋణం తీర్చుకోగలరన్నాడశ్వతరుడు

తండ్రీ! ఋతుధ్వజుని వృత్తాంతం వివరంగా చెబుతాం వినండి పూర్వము గాలవుడనే ముని తన ఆశ్రమంలో తపస్సు చేసికొనేవాడు పాతాళకేతువనే రాక్షసుడు రోజుకొక వేషంతో వచ్చి అతని తపస్సుకు విఘ్నాలు సృష్టించేవాడు వాణ్ణి సంహరిస్తే తన తపశ్శక్తి క్షీణిస్తుందనే కారణంతో ఉపేక్షించాడు ముని ఒకరోజు ఈ రాక్షసుడి గురించే ఆలోచించే సమయంలో ఆకాశం నుండి ఒక గుఱ్ఱం వచ్చింది ''సూర్యుడి వలె విశ్రాంతి లేకుండ ప్రయాణం చేయగలదీ అశ్వం నేలమీద మాత్రమే గాక పాతాళం, ఆకాశం, సముద్రం మరెక్కడైనా సరే ఎంతో వేగంగా వెళ్ళగలదు శత్రుజిత్తు మహారాజు గారి పుత్రుడైన ఋతుధ్వజుడు దీన్ని అధిరోహించి నిన్ను పీడిస్తున్న రాక్షసుణ్ణి అంతమొందించగలదు'' అని పలికిందాకాశవాణి అదే విధంగా ముని అశ్వంతో ఋతుధ్వజుని కలిశాడు విషయం చెప్పాడు ఆ గుఱ్ఱం మీద ఆశ్రమానికి వెళ్ళాడు ఋతుధ్వజుడు రాక్షసుడు వరాహరూపంతో వచ్చాడు తరిమాడు రాకుమారుడు పాతాళానికి పరుగుతీసింది వరాహం ఇతడూ అక్కడికే వెళ్ళాడు ఇద్దరు సుందరీమణులున్నారక్కడ ఒకరు గంధర్వరాజైన విశ్వావసుని కూతురు పేరు మదాలస మరొకరు ఆమె సఖురాలు కుండల పాతళకేతుడు తమనిక్కడ బంధించాడు బంధవిముక్తుల్ని చేయమని కోరింది కుండల ఆమె కోరిక ప్రకారమే మదాలసను పెళ్ళాడాడు పాతాళకేతుడడ్డువచ్చాడు సంహరించాడు రాకుమారుడు భార్యతో తన నగరానికెళ్ళాడు

ఇలా ఉండగా కొన్ని రోజుల తర్వాత పాతాళకేతుని సోదరుడైన తాళకేతువు పన్నాగంతో మరణించింది మదాలస ఆ విరహవేదనతో బైరాగి వలె ఉన్నాడు ఋతుధ్వజుడు మదాలస మళ్ళీ బ్రతకగలిగితే అదే మనం చేయగలిగిన సహాయం అన్నారు నాగకుమారులు తమ తండ్రితో వెంటనే అశ్వతరుడు సరస్వతీదేవిని గురించి తపస్సు చేశాడు ఆమె ద్వారా సంగీత విద్యను వరంగా పొందాడు ఆ సంగీతంతో శివుని మెప్పించాడు మదాలసను బ్రతికించమని కోరాడు ''తథాస్తు'' అన్నాడు పార్వతీపతి బ్రతికింది మదాలస ఎంతో సంతోషంతో ఆమెనం ఋతుధ్వజునికప్పజెప్పాడు ఈ విధంగా స్నేహితుల సౌహార్దం కారణంగా మదాలస మళ్ళీ దక్కిందతనికి ఈ కథ ఎంతో విపులంగా ఉందీపురాణంలో

ఇక, పతివ్రతా ధర్మాలు – భర్త చేసికొన్న పుణ్యంలో సగంవాటా భార్యకు వస్తుందంటారు నిజమే కాని, అంత తేలిగ్గా రాదది పతిసేవతో మాత్రమే సాధ్యము ''పుణ్యస్యార్థాపహారిణ్యః పతిశుశ్రూషయైవ హి'' పరపురుషుణ్ణి చూసినపుడు అతని తెలివితేటలు, రూపం, మాటకారితనము తన భర్తలో లేవే అని ఏ భార్యా తలవరాదని మార్కండేయపురాణం హితవు పలుకుతోంది

శ్రుత్వా తత్పూజయేద్వస్తు పురాణం సప్తమం పునః।
సర్వపాపవినిర్ముక్తః పునాత్యేవ నిజం కులమ్ ॥

ఈ పురాణం భక్తి శ్రద్ధలతో విన్నవారికి తమ సకల పాపాలు నశించడమే గాక వంశాభివృద్ధి కలుగుతుంది

  

# 8. అగ్నిపురాణము

''వశిష్ఠాయాగ్నినా ప్రోక్తమాగ్నేయం తత్ప్రచక్షతే'' అనగా అగ్నిదేవుడు వశిష్ఠమహర్షికి చేసిన ఉపదేశమే అగ్నిపురాణం ''వామో హ్యాగ్నేయముచ్యతే'' శ్రీమహావిష్ణువు యొక్క ఎడమపాదంగా వర్ణితమైనదీ పురాణం ఇందులో 383 అధ్యాయాలు, 15,400 శ్లోకాలూ ఉన్నాయి

దశావతారవర్ణన, రామాయణ-మహాభారతాల్లోని కొన్ని ఘట్టాలు, సృష్టివర్ణన, దేవాలయాల నిర్మాణ ఫలము, సాలిగ్రామ లక్షణాలు, సూర్య-శివపూజా విధి, వాస్తుపూజా విధానం, గయాయాత్ర వర్ణన, శ్రాద్ధకల్పము, బ్రహ్మచారి-గృహస్థ- వానప్రస్థ-యతిధర్మాలు, అనేకవిధప్రాయశ్చిత్తాలు, పాడ్యమి మొదలుకొని ఆయా తిథుల్లో చేసే సకలవ్రతాలు, రాజధర్మాలు, స్వప్నఫలితాలు, శకున విజ్ఞానం, స్త్రీ- పురుష లక్షణాలు, ఆయుర్వేద శాస్త్రం, రత్న పరీక్షా విదానం, కావ్య - నాటకాలంకారలక్షణాలు, ప్రళయ వర్ణన, నరకం తీరు, అద్వైత బ్రహ్మతత్త్వం మొదలైన విషయాలీ పురాణంలో అగుపిస్తాయి

అగ్నిపురాణంలో కూర్మావతార వర్ణన ఈ రీతిగా ఉంది - దేవాసుర సంగ్రామం భయంకరంగా జరిగింది దేవతలోడిపోయారు వారి సంపదన్నీ పోయాయి దీనికి కారణం దుర్వాసమహాముని శాపమే బ్రహ్మాది దేవతలందరు మహావిష్ణువును దర్శించారు అసురుల్ని గెలిచే ఉపాయమడిగారు వెంటనే వారితో సంధిచేసికొమ్మని సెలవిచ్చాడు విష్ణుభగవానుడు ''మంధర పర్వతం కవ్వంగా, వాసుకి త్రాడుగ క్షీరసాగరం మథించాలి అలాచేస్తే అమృతం బయటికొస్తుంది అది అసురలకందరాదు మీకే దక్కాలి అందుకు నా సంపూర్ణ సహకారముంటుంది'' అన్నాడు దేవదేవుడు అంగీకరించారు దేవతలు క్షీరసాగరమథనం ఆరంభమైంది అయితే ఒక అవాంతరమొచ్చి పడింది. మందర పర్వతానికి ఆధారం లేదు అందువల్ల మథనం చేసేటప్పుడు జారిపోతుందది అదిగో, ఆ సమయంలో విష్ణుభగవానుడు కూర్మరూపం

ధరించాడు పర్వతానికాధారంగా నిలిచాడు అవాంతరం తొలగింది వెల్లిగా మధనం జరుగుతోంది ముందుగా హాలాహలం బయటికొచ్చింది దాన్ని పరమశివుడానందంగా తీసికొన్నాడు నీలకంఠుడయ్యాడు ఆ తరువాత పారిజాతం, కౌస్తుభం, అప్సరసలు, లక్ష్మీదేవి వగైరాలు శ్రీమన్నారాయణమూర్తికి దక్కాయి దన్వంతరి కమండలంతో బయటికొచ్చాడు అందులోనే ఉంది అమృతం అసురులు కమండం లాగేసుకొన్నారు దేవతలకు సగమిచ్చారు మిగిలిన సగభాగం తీసికొనివెళ్ళబోతున్నారు అంతే, వైష్ణవ మాయ జరిగింది విష్ణువు మోహినీరూపం దాల్చాడు ఆ దివ్య సౌందర్యానికసురులు మోహవశులయ్యారు ''నీవు మాదానిపై అమృతం పంచిపెట్టు'' అని కోరారు ''అలాగే'' అన్నాడాయన ముందుగా దేవతలకొడ్డించాడు అసురులకు మిగలదని రాహు - కేతువులకర్థమైంది గుట్టుచప్పుడు కాకుండా ఆ ఇద్దఱు దేవతల వరుసలోకొచ్చారు అమృతమందింది హాయిగా త్రాగారు ఈ దృశ్యం జాగ్రత్తగ గమనించారు సూర్య-చంద్రులు లక్ష్మీపతికి ఫిర్యాదు చేశారు రాహు-కేతువులకు శిక్ష తప్పలేదు ఈ కారణంగా ఈ ఇద్దఱు సూర్య-చంద్రుల్ని తఱచు కబళిస్తుంటారు దాన్నే సూర్యగ్రహణము, చంద్రగ్రహణము అంటాము ఈ విధంగా కూర్మావతార వర్ణన సంక్షిప్తంగా ఉందీ పురాణంలో.

ఇక, రామాయణంలోని కొన్ని ఘట్టాలు -

వాలివధ జరిగాక కిష్కింధాధిపతియైన సుగ్రీవుడు సీతాన్వేషణ విషయంలో పెద్దగ శ్రద్ధచూపలేదు. శాంతమూర్తి అయిన శ్రీరామచంద్రుడు సైతం కళ్ళెర్రజేశాడు లక్ష్మణుని ద్వారా ఒక సందేశం పంపాడు సుగ్రీవునికి ఆ సందేశమిలా ఉంది -

న చ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః।
సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలిపదమన్వగాః॥

సుగ్రీవా! చెడుదారి పట్టి వాలి మరణించాడు అలాంటి దారిలో నీవు నడవకు సీతాన్వేషణ విషయంలో దృష్టిపెట్టు అలాచేయకపోతే వాలికి

పట్టిన గతే నీకూపడుతుందని భావము దీన్ని సందేశమనడం కంటె హెచ్చరిక అంటేనే బాగుంటుందేమో?।

రామాయణంలోని మరో సన్నివేశం -

సీతనెత్తుకు రమ్మని మారీచుణ్ణి ఆదేశిస్తాడు రావణాసురుడు అది రాజాజ్ఞ తప్పక పాటించితీరాలి ఆ సమయంలో మారీచుని మనోగతమెంత ఆర్ద్రంగా ఉందో ఈ శ్లోకం చెబుతోంది -

రావణాదపి మర్తవ్యం మర్తవ్యం రాఘవాదపి।
అవశ్యం యది మర్తవ్యం వరం రామాన్న రావణాత్॥

సీతనెత్తుకొని రాకపోతే రాజాజ్ఞ ఉల్లంఘన అవుతుంది దీన్ని సహించడు రావణుడు తనని చంపేస్తాడు సరే, అతని ఆజ్ఞను పరిపాలిద్దామంటే రాముని చేతిలో చావు తప్పదు ముందు గొయ్యి, వెనుక నుయ్యి మరణం ఎలాగూ తప్పదు అలాంటప్పుడు రావణుని చేతిలో చావడం కన్నా రామబాణానికే గురికావడం శ్రేయస్కరమని భావం

రామాయణంలోనిదే ఇంకో సన్నివేశం -

యుద్ధరంగంలో రావణుని సైన్యాలు నేలకొరుగుతున్నాయి. మహాయోధులందరు మరణించారు ఈ ప్రపంచంతో సంబంధంలేని కుంభకర్ణున్ని నిద్ర నుండి లేపాల్సిన పరిస్థితి వచ్చింది అతి కష్టం మీద లేచాడు. యుద్ధం గురించి తెలిసికొన్నాడు సమరానికి కారణమడిగాడు. సీతనెత్తుకుని రావడమే కారణమని తెలిసింది అపుడు రావణాసురునితో ఇలా అంటాడు కుంభకర్ణుడు -

సీతాయా హరణం పాపం కృతం త్వం హి గురుర్మతః।
అతో గచ్ఛామి యుద్ధాయ రామం హన్మి న సంశయః॥

అన్నయ్యా! సీతనపహరించి పాపం మూటకట్టుకున్నావు నీవు చేసింది ముమ్మాటికే తప్పే అయినా నీవు నాకు పూజ్యుడవు గనుక తప్పకుండా రణరంగం వెళ్తాను రాముణ్ణి సంహరిస్తానని దీని భావం మహోన్నతులైనా సరే, అక్రమాలకు పాల్పడరాదని కుంభకర్ణుని ఉపదేశం ద్వారా హితవు పలుకుతోంది అగ్నిపురాణం ఈ విధంగా అయిదవ అధ్యాయం మొద

లుకొని పదకొండవ అధ్యాయం వఱకు శ్రీమద్రామాయణ వర్ణన ఉన్నది

12, 13, 14 అధ్యాయాల్లో మహాభారత ప్రస్తావన దర్శనమిస్తుంది మహాభారత సంగ్రామంలో మహావీరులందఱు వీరమరణం పొందారు దుర్యోధన వర్గీయులు ముగ్గురు, పాండవ వర్గీయులేడుగురు మాత్రమే మిగిలారని అగ్నిపురాణం చెబుతున్నది -

కృతవర్మా కృపో ద్రౌణి స్త్రయో ముక్తాస్తతో రణాత్।
పాండవాః సాత్యకిః కృష్ణస్సప్త ముక్తా న చాపరే॥

దుర్యోధన వర్గానికి సంబంధించి కృతవర్మ, కృపాచార్యుడు, అశ్వత్థామ అనే ముగ్గురు, పాండవ పక్షానికి సంబంధించి అయిదుగురు పాండవులు, కృష్ణుడు, సాత్యకి మిగిలారు అంటే రెండు పక్షాలకు సంబంధించి 10 మంది మాత్రమే రణరంగంలో బ్రతికారని భావం

ఇక, భగవంతుడంటే ఎవరు? అనే ప్రశ్నకిలా సమాధానం కనిపిస్తుందగ్నిపురాణంలో -

ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిమ్।
వేత్తి విద్యామవిద్యాంచ స వాచ్యో భగవానితి॥

సృష్టి - స్థితి - ప్రళయాలు, ప్రాణుల జీవన - మరణాలు, విద్య - అవిద్యలనెఱిగినవాడే భగవంతుడని భావం

దేవాలయ నిర్మాణం పవిత్ర కార్యం మనసులో కనీసమా సంకల్పం కలిగినా నూరు జన్మల పాపాలు పటాపంచలవుతాయి దేవాలయ నిర్మాతలు అభీష్ట లోకాలను చేరుకోగలరు బ్రహ్మహత్య మొదలైన మహాపాతకాలు దూరమవుతాయి సకల తీర్థస్నానఫలం దక్కుతుంది ఈ రీతిగా దేవాలయ నిర్మాణాన్ని ప్రేరేపిసున్నదీపురాణం

అగ్ని పురాణంలో కథలకు పెద్దగా చోటివ్వలేదు కాని, సృష్టిలోని విద్యలు, పదార్థాల లక్షణాలు, వాటి పరీక్షా విధానం, స్వప్నాలు, శకునాలకు సంబంధించిన ఫలితాలు మొదలైన విషయాలెన్నో దర్శనమిస్తాయి. స్వప్నాలకు సంబంధించి పరిశీలిద్దాం శుభస్వప్నాలు, అశుభస్వప్నాలని స్వప్నాలు రెండు రకాలు

| స్వప్నకాలం | | ఫలించే సమయం |
|---|---|---|
| తొలిజాము | - | ఒక సంవత్సరం లోపు |
| రెండవజాము | - | ఆరు మాసాల్లోపు |
| మూడవజాము | - | మూణ్నెల్ల లోపు |
| నాలుగవజాము | - | 15 రోజుల్లోపు |

**అశుభ స్వప్నాలు** -

గుండుగీయుంచుకోవడం, నగ్నంగా ఉండటం, కుళ్ళిన బట్టల్ని కట్టుకోవడం, పామును చంపడం, పంది - కుక్క - గాడిద - ఒంటెల నెక్కడం, పక్షిమాంసం తినడం, తల్లి గర్భంలో ప్రవేశించడం, చితి ప్రవేశం, దేవతలు - రాజు - గురువు వీరి కోపానికి గురికావడం, నదిలో కొట్టుకొనిపోవడం, పేడనీళ్ళతో స్నానం, వాంతులు - విరేచనాలు కావడం, దక్షిణ దిక్కుకేసి ప్రయాణం, ఇల్లు పడిపోవుట, పిశాచాల క్రీడ, ఓటమి, కాషాయ వస్త్రాలను ధరించడము మొదలైనవి

**శుభ స్వప్నాలు** --

పర్వతం - మేడ - ఏనుగు - గుఱ్ఱం వీటినెక్కడము, తెల్లని పూలు చూడటం, తెల్ల బట్టలు కట్టుకోవడం, శత్రునాశం, వాదం - జూదం - యుద్ధం వీటిలో గెలుపు, పాలు తాగడం, దేవతలు - రాజు - గురువు తనను అభినందించడం, రాజపట్టాభిషేకం - మొదలైనవి శుభస్వప్నాలు స్వప్నం చివర్లో రాజు - ఏనుగు - గుఱ్ఱం - బంగారు - ఆవు - ఎద్దు ఇవి కనిపిస్తే కుటుంబవృద్ధి ఈ కారణంగా నాలుగవ జాములో ఇలాంటి శుభస్వప్నాలను చూసినపుడు వెంటనే నిద్రనుంచి లేవాలి మళ్ళీనిద్రపోతే ఆ స్వప్నఫలితం దక్కదు

ఇలాంటి చక్కని విశేషాలిందులో ఉన్నాయి గనుకనే -

''ఆగ్నేయం పఠితం ధ్యాతం శుభం స్యాద్భుక్తి ముక్తిదమ్'' ఈ పురాణం చదివినా, స్మరించినా భుక్తి - ముక్తులు చేకూరుతాయి



# 9. భవిష్యపురాణము

''భవిష్యం దక్షిణో జానుః'' ఈ వచనం ప్రకారం మహావిష్ణువు యొక్క కుడిమోకాలితో ఈ పురాణం పోల్చడమైనది ''చతుర్దశ సహస్రాణి తథా పంచశతానిచ'' అనగా 14,500 శ్లోకాలిందులో ఉన్నాయి మొత్తం అధ్యాయాలు 585

సృష్టి వర్ణన, పురాణోత్పత్తి క్రమము, షోడశసంస్కారాలు, సావిత్రీదేవి మాహాత్మ్యం, స్త్రీల శుభాశుభ లక్షణాలు, స్త్రీ ధర్మాలు, నానావిదాలైన వ్రతాలు, రథసప్తమీ మాహాత్మ్యం, సర్వకాలాలకూ సూర్యుడే మూలమనే సిద్ధాంతం, సాంబుని చరిత్ర, సూర్యదేవ మాహాత్మ్యం, దేవతల ప్రతిమాల లక్షణాలు, సూర్యపూజా ఫలాలు, దర్మ స్వరూపం, వాస్తు పూజావిధానం, పద్మావతి - వీరవర - కామాంగి - త్రిలోకసుందరి - చంద్రావళి - జీమూతవాహనుడు మొదలైన వారి కథలు, శ్రీసత్యనారాయణస్వామి వ్రత కథలు, కల్క్యవతార వర్ణన, అన్నదాన ప్రాశస్త్యం, సకలదానాల విధానం, సదాచార ధర్మం మొదలైన విషయాలిందులో ఉన్నాయి సూర్యదేవవర్ణన ఈ పురాణంలో ఉన్నంత విస్తృతంగా మరెక్కడ లేదు

స్త్రీ ధర్మాలను తెలియజేసే సందర్భంలో ఒక శ్లోకమిలా ఉంది -

భర్తృచిత్తాను కూలత్వం యాసాం శీలమవిచ్యుతమ్।
తాసాం రత్న సువర్ణాదిః భార ఏవ న మండనమ్॥

ఏ స్త్రీ అయితే భర్తమనసును బాగా అర్థం చేసికొని అన్నివేళలా అతనికి అనుకూలంగా నడుచుకుంటుందో ఆమెయే ఉత్తమ ఇల్లాలు. ఆ ఒక్కగుణమే ఆమెకు ఆభరణం అంతేగాని, బంగారము మొదలైనవి ఆభరణాలు కానేరవు

తస్మాత్సర్వాస్వవస్థాసు మనోవాక్కాయకర్మభిః।
ప్రియం సమాచరేన్నిత్యం తచ్చిత్తానువిధాయినీ॥

గనుక అన్ని పరిస్థితుల్లోనూ కాయా, వాచా, మనసా, భర్తకు మంచిని చేకూర్చాలని భావము

ఇలాగే భార్య పట్ల భర్త ఎలా నడచుకోవాలో తెలియజేయడానికి ఒక అధ్యాయమే ఉంది

జాయా త్వర్థం శరీరస్య నృణాం ధర్మాదిసాధనే।
నాతస్తాసు వ్యథాం కాంచిత్ ప్రతికూలం సమాచరేత్॥

ఏ పురుషుడైనా ధర్మార్థ కామాల్ని సాధించాలంటే అర్ధాంగిగ భార్య పాత్ర ఎంతో ఉంది ఈ యథార్థాన్ని గ్రహించి ఆమె ఆశయాలకు అనుకూలంగా నడుచుకోవాలి మరియు ఆమెను ఏవిధంగానూ పీడింపరాదని భావము

ఈ విదంగా దంపతులు పరస్పరం అర్థం చేసికోవాలనీ, ఒకరి అభిప్రాయాలను మరొకరు గౌరవించాలనీ తద్వారా సుఖంగా జీవితనౌకను సాగించాలనీ ఉపదేశిస్తున్నది భవిష్యపురాణం

సూర్యపూజా ఫలవర్ణన సమయంలో –

రాజా చోరా గ్రహాః సర్పా దారిద్ర్యం దుఃఖసంపదః।
నైతే పీడయితుం శక్తాః ప్రసన్నే భాస్కరే సతి॥

ప్రత్యక్ష దేవుడైన సూర్యభగవానుని సంపూర్ణానుగ్రహం ఉన్నవారికి రాజభయం, చోరభయం, గ్రహపీడ, సర్పభయం, దారిద్ర్యం, దుఃఖ పరంపర మొదలైన ఏ విధమైన చింతలు ఉండవని భావము

సమాజంలో ఎన్నోరకాలైన పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి కొన్ని కాపురాలు పచ్చగ ఉంటే, మరికొన్నేమో మరీ తక్కువ రోజుల్లోనే కూలిపోతున్నాయి ఎందుకిలా జరుగుతోంది? ఈ పరిస్థితిని ఎలా అరికట్టాలి? అనే ప్రశ్నకు చక్కని సమాధానం చెబుతున్నదీ పురాణం

త్రిదా వివాహసంబంధో హీనతుల్యాధికైస్సహ।
తుల్యైస్సహ సమస్తేషామితరే నీచమధ్యమౌ॥
అసమైర్నింద్యతే సద్భిః ఉత్తమైః పరిభూయతే।
తుల్యైః ప్రశస్యతే య స్మాత్తస్మాత్సాధుతమో మతః॥
తస్మా ద్వివాహసంబంధం సఖ్యమేకాంతకారిణామ్।
సదృశైరేవ కుర్వీత నోత్తమేనాప్యనుత్తమైః॥

తమకంటె తక్కువస్థాయివారితో, ఎక్కువస్థాయివారితో మరియు సమాన స్థాయి వారితో అనే భేదాన్ని బట్టి వియ్యం మూడు రకాలు తక్కువ స్థాయి వారితో సంబంధమైతే లోకం తిడుతుంది ఎక్కువ స్థాయి వారితో అయితే వారితో సరితూగలేము గనుక అవమానాలు భరించాల్సి ఉంటుంది సమాన స్థాయి వారితో అయితే ఏ విధమైన చికాకులుండవు గనుక ఇటువంటి పెళ్ళి సంబంధాల్నే ఏర్పాటు చేసికోవాలని హితవు చెబుతున్నదీ పురాణం

భక్తి - ముక్తులకు మాత్రమే పరిమితంకాక సమాజహితదృష్టి పురాణాల్లో ఉందని చెప్పడానికి ఇలాంటి సందేశాలెన్నో ఉదాహరణలుగ నిలుస్తాయి తాము పేదవారే అయినా తమ పెళ్ళిసంబంధాలు లక్షాధికార్లతోటే జరగాలని కొందరు ఉవ్విళ్ళూరుతుంటారు అలాంటి వారికి కనువిప్పు కావాలి ఈ మహర్షి వచనాలు

ఇక, వివాహం ఎన్ని విధాలు? వాటి లక్షణా లేమిటి? అనే ప్రశ్నకు జవాబుగా ఈ క్రింది శ్లోకాలగుపిస్తాయి -

బ్రాహ్మో దైవస్తథా చార్షః ప్రాజాపత్య స్తథాఽఽసురః।
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచోఽష్టమోఽధమః॥

(1) బ్రాహ్మము (2) దైవము (3) ఆర్షము (4) ప్రాజాపత్యము (5) ఆసురము (6) గాంధర్వము (7) రాక్షసము (8) పైశాచమని వివాహం 8 విధాలు

(1) ఆచ్ఛాద్య చార్చయిత్వా తు శ్రుత శీలవతే స్వయమ్।
ఆహూయ దానం కన్యాయాః బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః॥

విద్యాసంపన్నుడైన వ్యక్తికి సంప్రదాయబద్ధంగా సకలవిధ లాంఛనాలతో కన్యాదానం చేస్తే దానికి బ్రాహ్మవివాహమని పేరు ఈ వివాహం ధర్మసమ్మతమైనది

(2) వితతే చాపి యజ్ఞే తు కర్మ కుర్వతి చార్త్విజే।
అలంకృత్య సుతాదానం దైవో ధర్మ ఉదాహృతః॥

యాగశాలలో ఋత్విక్కుడుగ ఉన్న వ్యక్తికి అలంకార సహితంగా

కన్యాదానం చేయడం దైవవివాహం ఇదియూ ధర్మ సమ్మతమే

(3) ఏకం గోమిధునం ద్వే వా వరాదాదాయ ధర్మతః।
కన్యాప్రదానం విధివదార్షీయో ధర్మ ఉచ్యతే ॥

ఒకటి లేక రెండు గోవుల జంటలను వరుని వైపు నుంచి ధర్మబద్ధంగా తీసికొని కన్యాదానం జరిపితే అది ఆర్ష వివాహ మవుతుంది

(4) సహోభౌ చరితం ధర్మమితి వాచాఽను భాష్యతు।
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యవిధిః స్మృతః॥

''ధర్మేచ, అర్థేచ, కామేచ నాతి చరామి'' అని వధూ - వరులిద్దఱును మాటకు కట్టుబడి వివాహమాడితే అది ప్రాజాపత్య వివాహం

(5) జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయాశ్చైవ శక్తితః।
కన్యాప్రదానం స్వచ్ఛందాదాసురో ధర్మ ఉచ్యతే॥

కన్య తాలూకు జ్ఞాతులకు శక్త్యనుసారము పైకం ముట్టజెప్పి జరిపే వివాహం అసుర వివాహం

(6) ఇచ్ఛయాఽన్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్య చ।
గాంధర్వః స విధిర్జ్ఞేయః మైధునః కామసంభవః॥

వధూ - వరులు పరస్పరము ఆకర్షణకు లోనై పెద్దలతో సంప్రదించక స్వయంగా జరుపుకొనేది గాంధర్వ వివాహం

(7) హత్వా ఛిత్వా చ భిత్వాచ క్రోశంతీం రుదతీం గృహాత్।
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే॥

ఇష్టంలేని కారణంగా ఏడుస్తూ పెడబొబ్బలు పెడుతున్న కన్యను కొట్టి, తిట్టి, లాక్కొని తెచ్చి వివాహం జరిపితే అది రాక్షసవివాహం

(8) సుప్తాం మత్తాం ప్రమత్తాం చ రహో యత్రోపగచ్ఛతి।
స పాపిష్ఠో వివాహానాం పైశాచః కథితోఽష్టమః॥

నిద్రావస్థలో గాని మైకంలో గాని ఉన్న కన్యను రహస్యంగా ఎత్తుకొని వచ్చి వివాహమాడితే అది పైశాచిక వివాహమవుతుంది ఇవీ అష్టవిధ వివాహాలు

ఇక, అన్నదానమహిమ -

అన్నం వై ప్రాణినాం ప్రాణా అన్నమోజో బలం సుఖం।

ఏతస్మాత్కారణాత్సద్భిః అన్నదః ప్రాణదః స్మృతః॥

ఏ ప్రాణికైనా ప్రాణంతో సమానమైనది అన్నం తేజస్సును, బలాన్ని, సుఖాన్ని కలుగజేస్తుందన్నం అన్నం లేనివాడిలో ఈ గుణాలు కనిపించవు అందుచేత అన్నదాత ప్రాణదాతగా కీర్తింపబడతాడంటూ అన్నదానానికి ప్రేరణ ఇస్తున్నదీ శ్లోకం

ఎన్నో విక్రమ - బేతాళ కథలు ఈ భవిష్య పురాణంలో సాక్షాత్కరిస్తాయి వాటిల్లో ఒక చిన్న కథ చూద్దాం -

యమునా నదీ తీరంలో ఒక నగరం ధర్మస్థలపురి ఆ నగర పరిపాలకుడు గుణాధిపుడు సుశీల - హరిశర్మ అనే పుణ్యదంపతులు ఆనగరంలో ఉండిరి హరిశర్మ వేద - వేదాంగాలు బాగా తెలిసినవాడు వీరికిద్దరు సంతానం సత్యశీలుడు కొడుకు కాగా మధుమతి కూతురు సత్యశీలుడు వేదాధ్యయనానికై కాశీకి వెళ్ళాడు

ఇలా ఉండగా వామనుడనే యువకుణ్ణి ప్రేమించింది మధుమతి తండ్రి హరిశర్మ త్రివిక్రముడనే వరుణ్ణి చూశాడు అన్న సత్యశీలుడేమో తన గురుపుత్రుడైన కేశవుణ్ణి వరునిగ నిర్ణయించాడు ఒక శుభ ముహూర్తంలో ఈ ముగ్గురు (వామన - త్రివిక్రమ - కేశవులు) పెళ్ళిచూపులకని మధుమతి ఇంటికి వచ్చారు సరిగ్గా అదే సమయంలో ఆమె పాముకఱచి మరణించింది ఆమెను బ్రతికించుకోవడానికి అందఱు అన్ని ప్రయత్నాలు చేశారు ప్రయోజనం లేకపోయింది

ఈబాధనుంచి తట్టుకోలేని త్రివిక్రముడు సన్యాసియై దేశసంచారం చేస్తున్నాడు కేశవుడు ఆమె అస్థుల్ని (ఎముకలు) తీసికొని తీర్థయాత్రలకెళ్ళాడు వామనుడు ఆమెనే తలుస్తూ చితిదగ్గతే ఉండిపోయాడు ఇదీ ఈ ముగ్గురి పరిస్థితి

త్రివిక్రముడు దేశాటన చేస్తూ ఒకరోజు సరయూనదీ తీరంలోని లక్ష్మణపురం చేరాడు అక్కడ రామశర్మ అనే పండితునింటికి భిక్షకు వెళ్ళాడు

సరిగ్గా ఆరోజే ఆ ఇంటి దాసికొడుకు చనిపోయాడు ఆ దాసి పుత్రభిక్ష పెట్టమని దీనంగా అర్థించింది రామశర్మను సంజీవినీ మంత్రంతో ఆ అబ్బాయిని బ్రతికించాడు రామశర్మ

ఈ మంత్రవిధానం తెలిసికొన్నాడు త్రివిక్రముడు వెంటనే మధుమతి చితి దగ్గఱికి వచ్చి ఆ మంత్రం పఠించాడు అంతకు ముందే చనిపోయిన రాజకుమారుడు బ్రతికాడు తనను బ్రతికించిన కారణంగా ''నీకేం కావాలో కోరుకో'' అన్నాడు త్రివిక్రమునితో ''కేశవుడు మధుమతి అస్థికల్ని తీసికొని తీర్థయాత్రలకెళ్ళాడు వెంటనే ఆలస్యం చేయక అతన్ని ఇక్కడికి పిలిపించే ఏర్పాటు చేయండి'' అనడిగాడు త్రివిక్రముడు అతని కోరికను మన్నించి కేశవుణ్ణి పిలిపించాడు రాజకుమారుడు ఆమె అస్థికల్ని తీసికొని సంజీవినీ మంత్రం పఠించాడు త్రివిక్రముడు మధుమతి బ్రతికింది

పై ముగ్గురు ఆమెతో పెళ్ళికి సిద్ధమయ్యారు ధర్మం ప్రకారం అర్హుడైన వాణ్ణే పెళ్ళాడతానన్నది మధుమతి ''విక్రమాదిత్యా! ఈ ముగ్గురిలో అర్హుడెవరు?'' అనడిగాడు బేతాళుడు సమాధానం చెప్పాడు విక్రమాదిత్యుడు –

> ప్రాణదాతా తు యో విప్రః పితేవ గుణతత్పరః ।
> అస్థిదాతా తు యో విప్రో భ్రాతృతుల్యః స వేదవిత్ ॥

మంత్రం పఠించి ఆమెను బ్రతికించిన త్రివిక్రముడు తండ్రితో సమానుడు అస్థులనిచ్చిన కారణంగా కేశవుడు సోదరతుల్యుడు ఆమె చితిని విడువక అక్కడే కాలక్షేపం చేసిన వామనుడికే మధుమతి చెందుతుందని దీని భావం

> యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే మానవో నృప ।
> అశ్వమేధఫలం ప్రాప్య గచ్ఛేద్భానౌ న సంశయః ॥

ఈ భవిష్యపురాణం విన్నవారు సకల పాపాల నుండి విముక్తులై అశ్వమేధయాగఫలాన్ని పొంది సూర్యభగవానుని సాయుజ్యం పొందగలరు.



# 10. బ్రహ్మవైవర్తపురాణము

సావర్ణినా నారదాయ కృష్ణమాహాత్మ్యముత్తమమ్।
బ్రహ్మరూప వరాహస్య చరితం వర్ణ్యతే ముహుః॥

ఈ ప్రమాణాన్ని బట్టి వరాహస్వామి మరియు శ్రీకృష్ణునికి సంబంధించి సావర్ణిమనువు నారదమహర్షికి తెలియజేసినదే బ్రహ్మవైవర్తపురాణం ''బ్రహ్మవైవర్తసంజ్ఞం తు వామో జానురుదాహృతః'' శ్రీమన్నారాయణుని ఎడమ మోకాలితో పోల్చడమైనదీ పురాణం

బ్రహ్మఖండం, ప్రకృతిఖండం, గణేశఖండం, శ్రీకృష్ణఖండమనే పేర్లతో నాలుగు ఖండాలిందులో ఉన్నాయి. ''తదష్టాదశ సాహస్రం బ్రహ్మవైవర్తముచ్యతే'' అనగా 18 వేల శ్లోకాలతో కూడినదీ పురాణం ''సారభూతం పురాణేషు బ్రహ్మవైవర్తముచ్యతే'' అష్టాదశ మహాపురాణాలన్నింటి సారమే ఈ పురాణం

బ్రహ్మఖండంలో పరబ్రహ్మ వర్ణన, ప్రకృతిఖండంలో శ్రీకృష్ణుని ఆదేశం ప్రకారం దుర్గ - లక్ష్మి - సరస్వతి మొదలైన రూపాలతో ప్రకృతి ఆవిర్భావం, గణేశఖండంలో వినాయకునికి సంబంధించిన సమగ్రవర్ణన, శ్రీకృష్ణఖండంలో దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, శ్రీకృష్ణ లీలలు మొదలైన అంశాలగుపిస్తాయి.

గణేశఖండంలో అతిథి సత్కారం గురించి ఈ విధంగా ఉంది-

అపూజితోఽతిథిర్యస్య భవనాద్వినివర్తతే।
పితృదేవాగ్నయః పశ్చాద్గురవో యాన్త్యపూజితాః॥

ఇంటికి వచ్చిన అతిథిని గౌరవంగా చూడకపోతే ఆ ఇంటి నుండి అదృశ్య రూపంతో ఉన్న పితృదేవతలు, దేవతలు, అగ్నిహోత్రుడు, గురువులు పూజలందుకోక వెళ్ళిపోగలరని భావము అందుకే ''అతిథిదేవో భవ'' అని ఉపనిషత్తులుద్ఘోషిస్తున్నాయి అతిథిని దేవతగ భావించాలని ఆశయం

ప్రతి మానవునికి జన్మనిచ్చిన తండ్రితో పాటు ఆ స్థాయిలో గౌరవ - మర్యాదలందుకొనేవారు ఐదుగురుంటారని సూచిస్తున్నదీ పురాణం-

విద్యాదాతాఽన్న దాతా చ భయత్రాతా చ జన్మదః।
కన్యాదాతా చ వేదోక్తా నరాణాం పితరః స్మృతాః॥

(1) విద్యాదాత (2) అన్నదాత (3) అభయదాత (4) జన్మదాత (5) కన్యాదాత వీరే ఆ అయిదుగురు

ఇట్లే, కొడుకంటే రక్త సంబంధంతో పుట్టినవాడు మాత్రమే గాక పుత్రదృష్టితో చూడదగ్గవారు ఐదురకాలుగా ఉంటారు వారు –
(1) సేవకుడు (2) శిష్యుడు (3) పోషితుడు (4) రక్త సంబంధంతో పుట్టినవాడు (5) శరణాగతుడు

ఆప్తబంధువులు, సిరిసంపదలకంటె మిన్నమైనది ధర్మం ధర్మం కంటె ప్రియమైనదేదీ లేదు అందుచేత ధర్మాన్ని రక్షించాలి సత్యం కంటె వేరే ధర్మంలేదు అసత్యం కంటె వేరే పాతకం లేదు ఇలాగే, గంగానదితో సమానమైన నది, మహా విష్ణువుతో సమానడైన దేవుడు లేడని వక్కాణిస్తోంది బ్రహ్మవైవర్తం –

నాస్తి ధర్మాత్పరో బన్ధుర్నాస్తి ధర్మాత్పరం ధనం।
ధర్మాత్ప్రియతరః కో వా స్వధర్మం రక్ష యత్నతః॥

నహి సత్యాత్పరో ధర్మో నాఽనృతాత్పాతకం మహత్।
నహి గంగా సమం తీర్థం న దైవం కేశవాత్పరం॥

ఇక, గురుమహిమ – ''గురౌ హి సర్వే దేవాశ్చ తిష్ఠన్తి సతతం ముదా'' సకల దేవతలు గురువులోనే దర్శనమిస్తారని భావం

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥

అనే ప్రసిద్ధశ్లోకం భావమూ ఇదే

పై అంశాలేగాక భగవత్స్వరూపం, సరస్వతీ పూజావిధానం, భూదాన మహిమ, గంగావతరణం, సంక్షిప్త రామాయణం, శంఖచూడ వృత్తాంతం, తులసీ మాహాత్మ్యం, మహాలక్ష్మీస్తోత్రం, దుర్గాదేవి ఉపాఖ్యానం, దేవకీ – వసుదేవుల వృత్తాంతం, రేవతీ బలరాముల వివాహం, శిశుపాల వద, శ్యమంతకోపాఖ్యానం మొదలైన విషయాలెన్నో ఉన్నాయిందులో

**వేదవతీవృత్తాంతం -**

ధర్మధ్వజుడు, కుశధ్వజుడు అనే రాజులుండిరి వీరిద్దఱు తోబుట్టువులు కుశధ్వజుని భార్య మాలవతీదేవి ఈమె మహాలక్ష్మి అనుగ్రహంతో ఒక కూతురును కన్నది ఆ శిశువు నేలమీద పడిన వెంటనే వేదఘోష వినిపించింది ఈ కారణంగా వేదవతి అని పేరు పెట్టారా శిశువుకు చిన్న వయస్సులోనే తపస్సుకోసం అడవులకెళ్ళింది మహావిష్ణుభక్తి పరాయణురాలామె విష్ణువునే తన భర్తగా కోరుకుంది కొన్నివేల సంవత్సరాలు భయంకరమైన తపస్సు చేసింది అయినా, శరీరం కృశించలేదు నవయవ్వనం తోటే ఉన్నది ఆమె కోరిక తరువాతి జన్మలో తీరగలదని ఆకాశవాణి పలికింది తన పట్టువదల్లేదు. గంధమాదన పర్వతం మీద తపస్సు కొనసాగించింది ఆ సమయంలో లంకాధిపతి రావణాసురుడక్కడికి వచ్చాడు అతిథి సత్కారం చేసింది వేదవతి. ఆమె అందాలను చూసి చకితుడయ్యాడు మోహించాడు దగ్గఱగా వెళ్ళాడు చేత్తో తాకబోయాడు అంతే, చేతులు, కాళ్ళు స్తంభించాయి "నా కారణంగా నీవు సమస్త బంధుమిత్రులను, భోగభాగ్యాలనూ పోగొట్టుకొందువు గాక!" శపించింది వేదవతి కదల్లేకపోయాడు రావణుడు దేవీస్తోత్రం చేశాడు ఆ స్తోత్ర ప్రభావంతో మునుపటి స్థితి వచ్చింది అతని స్పర్శతో అపవిత్రురాలయ్యాననే భావన కలిగిందామెకు అక్కడికక్కడే ఆత్మహత్య చేసికొంది ఈ ఊహించని సంఘటన చూసి కుమిలిపోయాడు రావణుడు

ఈ వేదవతియే తరువాతిజన్మలో జనకకన్యగ పుట్టింది ఆమెయే సీతాదేవి సీతమ్మ కారణంగానే రావణాసురుడు సర్వస్వం కోల్పోయాడు లంకానగరం నుంచి తిరిగి వచ్చింది సీత అగ్నిపరీక్ష కోరాడు శ్రీరామచంద్రుడు అగ్నిపునీత అయిందాసాధ్వి ఇంతటితో ఈ జన్మ ముగిసింది

ఆ తరువాయి జన్మలో ద్రుపదుని కూతురుగ యజ్ఞకుండంలో నుంచి పుట్టింది ఈ విధంగా కృతయుగంలో వేదవతిగ, త్రేతాయుగంలో

సీతాదేవిగ, ద్వాపరంలో ద్రౌపదిగనూ అవతరించిందీ సాధ్వీమణి

శ్రీరామచంద్రుడు అగ్నిప్రవేశం చేయమని సీతను కోరినప్పుడు విలవిల్లాడింది ''పతిం దేహి'' అంటూ అయిదుసార్లు శివుణ్ణి ప్రార్థించింది ఈ కారణంగానే ద్వాపరంలో పంచపాండవులను భర్తలుగ పొందింది పాంచాలి అయింది ఇదీ వేదవతీ వృత్తాంతం

కశ్యపమహర్షియొక్క మానసపుత్రిక మరియు వాసుకి సోదరి జరత్కారువు ఈమెను ఈ క్రింది విధంగా స్తోత్రం చేస్తే సర్వభయముండదని బ్రహ్మవైవర్తపురాణం చెబుతోంది -

జరత్కారుర్జగద్గౌరీ మనసా సిద్ధయోగినీ ।
వైష్ణవీ నాగభగినీ శైవీ నాగేశ్వరీ తథా ॥

జరుత్కారు ప్రియా ఽఽ స్తీకమాతా విషహరీతి చ ।
మహాజ్ఞానయుతా చైవ సా దేవీ విశ్వపూజితా ॥

ద్వాదశైతాని నామాని పూజాకాలే తు యః పఠేత్ ।
తస్య నాగభయం నాస్తి తస్య వంశోద్భవస్య చ ॥

నాగభీతే చ శయనే నాగగ్రస్తే చ మన్దిరే ।
నాగక్షతే మహాదుర్గే నాగవేష్టితవిగ్రహే ॥

ఇదం స్తోత్రం పఠిత్వా తు ముచ్యతే నాత్ర సంశయః ।
నిత్యం పఠేచ్చ తం దృష్ట్వా నాగవర్గః పలాయతే ॥

శుభదం పుణ్యదం చైవ విఘ్ననిఘ్నకరం పరమ్ ।
హరిదాస్యప్రదం చైవ పరలోకే ప్రహర్షదమ్ ॥

బ్రహ్మవైవర్తపురాణం తాలూకు పఠన- శ్రవణాలు శుభం, పుణ్యం చేకూరుస్తాయి సర్వవిఘ్నాలనూ దూరం చేస్తాయి హరిభక్తిని పెంపొందింపజేస్తాయి అంతేగాక, పరలోకంలో సైతం సుఖ - సంతోషాలు కలుగుతాయి

  

# 11. లింగపురాణము

అగ్నిలింగంలో ఉన్న శివుడుపదేశించిన పురాణమే లింగపురాణం. ''లైంగం తు గుల్ఫకం దక్షమ్'' శ్రీమహావిష్ణువు తాలూకు కుడిచీలమండగ వర్ణితమైనదీ పురాణం ''తదేకాశసాహస్రం హరమాహాత్మ్యసూచకం'' అనే వచనాన్ని బట్టి ఇందులో 11 వేల శ్లోకాలున్నాయి పూర్వార్థంలో 108, ఉత్తరార్థంలో 55 కలిపి 163 అధ్యాయాలున్నాయి 28 విధాలైన శివావతారాలకు సంబంధించిన కథలీ పురాణంలో అగుపిస్తాయి శివతత్త్వపరిశోధకులకీ పురాణం చాల ఉపయోగపడుతుంది

యమ-నియమాదులనే అష్టాంగయోగాలతో శివారాధన విధానం, విష్ణువు చేసిన శివస్తోత్రం, మహావిష్ణువు యొక్క నాభికమలం నుండి బ్రహ్మదేవుని పుట్టుక, లింగార్చన విధానం, మానస శివపూజ, బ్రహ్మదేవుడు రచించిన శివారాధనరీతి, యుగధర్మాలు, సప్త సముద్రాలు మరియు సప్త ద్వీపాల వర్ణన, అష్టదిక్పాలకుల నగరాలు - వాటి వర్ణన, చంద్రుని రథ వర్ణన, గ్రహమండల పరిమాణం, సూర్యదేవమాహాత్మ్యం, సూర్య - చంద్రవంశపు రాజుల వర్ణన, యయాతి చరితం, సంక్షిప్తంగా శ్రీకృష్ణచరిత్ర, త్రిపురాసుర సంహారం, శివభక్తి మాహాత్మ్యం, అహింసా ప్రశంస, శివదర్శనఫలం, కైలాసవర్ణన, నర-నారీమణులకు శుభప్రదమైన ఉమామహేశ్వరవ్రతం, సదాచార నిరూపణం, వారణాశి క్షేత్రమాహాత్మ్యం, నరసింహావతార వర్ణన, పార్వతీ కల్యాణం, వినాయక జన్మవృత్తాంతం, శివ దీక్షా విధానం, షోడశమహాదానవర్ణన - మొదలైన విషయాలు లింగ పురాణంలో దర్శనమిస్తాయి

కోరికలకు హద్దులుండవనీ, అనుభవించినకొద్దీ పెరుగుతూనే ఉంటాయనీ, కాయేన, వాచా, మనసా వీటికి బహుదూరంగా ఉండాలనీ వక్కాణిస్తున్నదీ పురాణం -

భోగేన తృప్తి ర్నైవాస్తి విషయాణాం విచారతః।
తస్మాద్విరాగః కర్తవ్యః మనసా కర్మణా గిరా ॥

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥

ఉత్తరార్థంలోని 13వ అధ్యాయంలో శివుని అష్టవిధమూర్తుల వర్ణన ఇలా ఉంది - (1) పృథివీరూపుడు - శర్వుడు (2) జలరూపుడు - భవుడు (3) అగ్నిరూపుడు - పశుపతి (4) వాయుమూర్తి - ఈశానుడు (5) ఆకాశమూర్తి - భీముడు (6) సూర్యమూర్తి - రుద్రుడు (7) సోమమూర్తి - మహాదేవుడు (8) యజమానమూర్తి - ఉగ్రుడు

శివభక్తి మహిమను చాటిచెప్పే ఒక కథ ఇలా ఉన్నదీ పురాణంలో -

పూర్వమొక కొండగుహలో శ్వేతుడనే ముని ఉండేవాడు శివారాధనమే తన జీవిత లక్ష్యంగా పెట్టుకొన్న భక్తాగ్రేసరుడు నమక - చమకాది మంత్రాలతోను, స్తోత్రాలతోనూ సర్వదా శివుణ్ణి కొలుస్తుండేవాడు ఇలా ఉండగ, ఆయువు నిండిన ఇతన్ని తీసికెళ్ళడానికొకనాడు యమధర్మరాజు వచ్చాడు ఆ సమయంలో శివపూజలో ఉన్నాడు శ్వేతముని ''నీ ఆయువు తీరింది శివపూజ వల్ల నీకు ఒరిగేదేమీ లేదు బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులెవ్వరూ నిన్ను రక్షింపలేరు ఆలస్యంచేయక నాతో రా'' అన్నాడు యముడు ''శంకరా! మహాదేవా! హరహరా! ఈ మృత్యుపాశం నుండి నన్ను తప్పించు'' అని బిగ్గఱగా అరిచాడు ముని ''సర్వదేవతలకు మూలమైన శివుడు నాకండగా ఉన్నాడు నీవు నన్నేమీ చేయలేవు వెంటనే నీ దారిన వెళ్ళు'' అన్నాడు

ఈ మాటలు విన్న యముడు పట్టరాని కోపంతో తన పాశంతో ఆ మునీశ్వరుణ్ణి బంధించాడు ''ఏడీ నీ శివుడు? ఏమైంది నీ శివపూజ? శివుడీ లింగంలో ఉన్నాడా? మరి బయటికి రాడేమి?'' అని పరిహసించాడు అంతే, పార్వతి, నంది మొదలైన తన సకల గణాలతో ప్రత్యక్షమయ్యాడు భక్తాభీష్టప్రదాత మహాదేవుడు భయకంపితుడయ్యాడు యమధర్మరాజు చేయగలిగిందేమీలేక మునిని శరణుకోరాడు శివుణ్ణి స్తోత్రం చేశాడు శాంతించాడు శివుడు మునికి మృత్యువు తప్పింది అతని కోరికల్ని పూర్తిచేశాడు గిరిజాపతి విమల భక్తిదాయకమైనదీ చిన్న కథ

కాశీ క్షేత్రమాహాత్మ్యవర్ణనసమయంలో -

యథా మోక్షమవాప్నోతి అన్యత్ర చ తథా క్వచిత్ ।
కామం హ్యత్ర మృతో దేవి జంతుర్మోక్షాయ కల్పతే ॥

కామం భుంజన్ స్వపన్ క్రీడన్ కుర్వన్హి వివిధాః క్రియాః ।
అవిముక్తే త్యజేత్ ప్రాణాన్ జంతుర్మోక్షాయ కల్పతే ॥

ఇతర క్షేత్రాల్లో ఎక్కడా లభ్యం కాని వారికి సైతం కాశీక్షేత్రంలో మోక్షం లభిస్తుంది ఈ క్షేత్రంలో మరణించిన ప్రతిజీవి మోక్షానికర్హుడే భోజనసమయంలో, నిద్రలో, ఆటలో ఏ అవస్థలో మరణించినా మోక్షమిస్తుందీ క్షేత్రమని భావం

అష్టదిక్పాలకుల్లో ఇంద్రుని నగరం అమరావతి ఈ విషయం సాధారణంగా అందరికీ తెలిసిందే మరి, ఇతర దిక్పాలకుల నగరాలేవి? అని ప్రశ్న కలుగుతుంది తేజస్విని, వైవస్వతి, కృష్ణవర్ణ, శుద్ధవతి, గంధవతి, అలక, యశోవతి అని ఈ నగరాల పేర్లు లింగపురాణంలో వీటి వివరణ ఉన్నది

శివపూజామాహాత్మ్యాన్ని తెలియజేసే మరో కథ -

వశిష్ఠమహర్షికి శక్తి మొదలైన నూరుగురు కొడుకులుండిరి ఒక శాప కారణంగా రుధిరుడనే రాక్షసుడు వీరినందరినీ భక్షించాడు ఈ దుర్వార్తను విన్న అరుంధతీ - వశిష్ఠులు పుత్రశోకం భరింపలేకపోయారు నూరుగురు కొడుకులు ఒకేసారి మృత్యువుపాలవడంతో వంశం మొత్తం నాశనమైందని ఎంతో బాధకు లోనయ్యారాదంపతులు ఆత్మహత్యకు సిద్ధపడి కొండమీద నుంచి దూకారు కాని, భూదేవి వారిని తన ఒడిలోకి తీసికొంది ఆత్మహత్యా ప్రయత్నం నుంచి విరమింపజేసింది అదే సమయంలో వశిష్ఠుని పెద్దకోడలు అదృశ్యంతి అక్కడికి వచ్చింది ''మహాశయా! నా గర్భంలో పెరుగుతున్న మీ మనవడికోసమైనా మీరు బ్రతకాలి నాకు ధైర్యం చెప్పాల్సిన మీరే ఇలా చేయడం యుక్తం కాదు'' అని ప్రార్థించింది అరుంధతి ఆమెను లేవనెత్తింది ఓదార్చింది

అపుడు మహావిష్ణువు ఆకాశం నుండి - ''మహర్షీ! శక్తి కుమారుడగు నీ మనవడు నాతో సమానుడు కాగలడు శివపూజా పరాయణుడవుతాడు శివుని ప్రభావంతో నీ వంశం ఉద్ధరింపబడుతుంది'' అని పలికి అదృశ్యమయ్యాడు

భర్తలేని బ్రతుకు నిరర్థకము జీవితంపై ఎంతో విరక్తురాలైంది అదృశ్యంతి అయితే అత్త - మామల కోసం, పుట్టబోయే కొడుకు కోసం బ్రతకాలనే నిర్ణయించుకొంది ఒక శుభముహూర్తంలో పుత్రోదయమయింది ఆ పుత్రుడే పరాశరుడు తనకు కొడుకు పుట్టాడన్న శుభవార్త తెలిసి పరలోకంలో ఉన్న శక్తిమహర్షి ఎంతో సంబరపడ్డాడు ఈ వార్తను తన సోదరులందరికీ తెలియజేసి వారితో సంతోషం పంచుకొన్నాడు వశిష్ఠాశ్రమంలోని మునుల ఆనందానికవధుల్లేవు తన కొడుకును చూసికొని ఆనందించిందాతల్లి అదే సమయంలో భర్తను తలచుకొని బాధను దిగమింగుకొంది

తన చిరంజీవిని జాగ్రత్తగ పెంచుతోంది అదృశ్యంతి పెద్దవాడవుతున్నాడు కొడుకు పసుపు-కుంకుమలు, మాంగల్యం లేని తల్లిని చూస్తున్నాడు ఒకరోజు తన తండ్రి గురించి అడిగాడా తల్లిని సమాధానం చెప్పలేదావె మళ్ళీ మళ్ళీ అడిగాడు తప్పలేదిక రాక్షసునికాహారమైన విషయం చెప్పింది కోపంతో ఎర్రబడ్డాడు పరాశరుడు సృష్టిలో రాక్షసులే లేకుండ చేయగలనని భయంకరంగా ప్రతిజ్ఞ చేశాడు క్షణాల్లో ఒక మట్టిలింగాన్ని తయారుచేశాడు శివసూక్తంతో నిష్ఠతో లింగార్చన చేశాడు శివుడు సపరివారంగా ప్రత్యక్షమయ్యాడు ఏం కావాలో కోరుకోమన్నాడు తన తండ్రి, పినదండ్రులను చూడదలచినట్లు కోరాడు పరాశరుడు శివానుగ్రహంతో పరలోకంలో ఉన్నవారిని చూడగలిగాడు అదే విధంగా శక్తి కూడ తన తల్లిదండ్రులను, భార్యను చూశాడు ఇదంతా శివపూజాఫలం సకలలోకానుగ్రహకారకుడైన చంద్రశేఖరుణ్ణి సదా పూజింపకోరాడు శక్తి తన కొడుకుతో సర్వేశ్వరుడు తన పని ముగించుకొని వెళ్ళిపోయాడు

తన మంత్ర ప్రభావంతో సకల రాక్షస సంహారం చేయబోయిన పరాశరుణ్ణి ఆపగలిగాడు తాత వశిష్ఠుడు క్రోధం తగదనీ, శాపప్రభావంతో నీ తండ్రులు మరణించారనీ, వారించాడాయన రాక్షసులు నిమిత్తమాత్రమేనని శాంతింపజేశాడు తాత పట్ల గౌరవంతో తన ప్రయత్నం విరమించాడు పరాశరుడు ఇందుకు సంతోషించిన పులస్త్యబ్రహ్మ - ''పరాశరా! సకల శాస్త్రజ్ఞుడవు కాగలవు నీవు నీకు పుట్టబోయే కొడుకు పురాణకర్త కాగలడు'' అని ఆశీర్వదించాడు ఆ పరాశర పుత్రుడే వ్యాసమహర్షి ఈ విధంగా శివపూజా మాహాత్మ్యాన్ని తెలియజేస్తున్నదీ కథ

యః పఠేత్ శృణుయాద్వాపి లైంగం పాపహరం నరః।
స భుక్తభోగో లోకేఽస్మిన్నన్తే శివపురం వ్రజేత్ ॥

ఈ పురాణం వినేవారు, చదివే వారు సకలభోగాలను అనుభవిస్తారు వారి పాపాలన్నీ దూరమౌతాయి చివర్లో కైలాసం చేరుకోగలరు

  

# 12. వరాహపురాణము

''విష్ణునాఽభిహితం క్షోణ్యై తద్వారాహమువ్యచ్యతే''
వరాహావతారంలో మహావిష్ణువు భూదేవికి చెప్పిన పురాణమే వరాహపురాణము ''చతుర్వింశత్సహస్రాణి తత్పురాణమిహోచ్యతే'' అనే వచనాన్ని బట్టి ఇందులో 24 వేల శ్లోకాలున్నాయి ''వారాహం వామగుల్ఫకమ్'' మహావిష్ణువు యొక్క ఎడమ చీలమండతో ఈ పురాణం పోల్చబడింది 215 అధ్యాయాలిందులో ఉన్నాయి

తొమ్మిది విధాలైన సృష్టి, నారదముని పూర్వజన్మ వృత్తాంతం, అష్టమూర్తిగ మహావిష్ణువు, ధర్మవ్యాధుని చరితము, దుర్జయ చరితము, అగ్నిదేవుడు మరియు అశ్వినీకుమారుల పుట్టుక, దక్షయాగ వినాశం, పార్వతీదేవి పుట్టుక, వినాయక సంభవం, పాడ్యమి మొదలైన ఆయా తిథుల ఆధిపత్యము, ఆయా మాసాల్లోని ద్వాదశీవ్రత మాహాత్మ్యం, సౌభాగ్య - కాంతి - శాంతి - ఆరోగ్యవ్రతాలు, నాలుగు యుగాల స్వరూపం, విష్ణుదీక్షా విధానం, అన్నదాన మాహాత్మ్యం, వరాహస్వామి భూదేవిని ఉద్ధరించడం, ఆయా ఋతువుల్లో విష్ణుపూజాఫలము, చక్రతీర్థ మాహాత్మ్యం, విష్ణుమందిరాల్లో గాన-నాట్యఫలము, మధురాక్షేత్ర ప్రాశస్త్యము, శ్రాద్ధ విధానం, నాచికేతుని వృత్తాంతం, యమ యాతనల వర్ణన, పతివ్రతా మాహాత్మ్యం, గోకర్ణక్షేత్ర మాహాత్మ్యం మొదలైన విషయాలు ఈవరాహపురాణంలో దర్శనమిస్తాయి

మహావిష్ణువు అష్టమూర్తిగ కీర్తింపబడుతున్నాడు (1)పృథివి, (2)జలము (3) అగ్ని (4) వాయువు (5) ఆకాశము (6) సూర్యుడు (7)చంద్రుడు (8) ఆత్మ ఇవీ స్వామివారి మూర్తులు

అష్టాదశ పురాణాల వివరణ ఇందులో ఇలా ఉన్నవి -

అష్టాదశ పురాణాని వేద ద్వైపాయనో గురుః।
బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం (వాయుః) భాగవతం తథా।

తధాన్యన్నారదీయం చ మార్కండేయం చ సప్తమమ్ ।
ఆగ్నేయమష్టమం ప్రోక్తం భవిష్యం నవమం తదా ॥

దశమం బ్రహ్మవైవర్తం లైంగమేకాదశం స్మృతమ్ ।
వారాహం ద్వాదశం ప్రోక్తం స్కాందం చాపి త్రయోదశమ్ ॥

చతుర్దశం వామనం చ కౌర్మం పంచదశం స్మృతమ్ ।
మత్స్యం చ గారుడం చైవ బ్రహ్మాండం చ తతః పరమ్ ॥

## భక్తుల అంగరక్షకుడు శ్రీమహావిష్ణువు -

వరాహపురాణం ప్రారంభంలో మహావిష్ణువు తన భక్తుల అంగాలను వివిధ రూపాలతో రక్షించగలడని చెప్పడమైనది ఆ వివరాలు -

కేశవుడు - పాదాలు, నారాయణుడు - పిక్కలు,
మాదవుడు - నడుము, గోవిందుడు - రహస్యాంగం,
విష్ణువు - నాభి, మధుసూదనుడు - ఉదరము,
త్రివిక్రముడు - తొడలు, వామనుడు - హృదయం;
శ్రీధరుడు - కంఠం, హృషీకేశుడు - ముఖం,
పద్మనాభుడు - కళ్ళు, దామోదరుడు - శిరస్సు,

## వైష్ణవమాయ -

మాయం అంటే ఏమిటి? అడిగింది భూదేవి అపుడు శ్రీవరాహస్వామి ఇలా సమాధానం చెప్పాడు బ్రహ్మరుద్రులుగాని, దేవేంద్రుడు గాని తెలిసికోలేని నా 'మాయ' గురించి చెబుతున్నాను-

కొన్నిచోట్ల అతివృష్టి, మరికొన్నిచోట్ల అనావృష్టి, చంద్రుడు ప్రకాశించుట మరియు క్షీణించుట, హేమంత ఋతువులో బావుల్లో నీరు వేడిగా ఉండటము, గ్రీష్మ ఋతువులో చల్లగ ఉండటము

సూర్యుడు తూర్పున ఉదయించడము, పడమట అస్తమించడం. గర్భంలో శిశువు ప్రవేశించడము, జీవుడు మాతృగర్భంలో ప్రవేశించి సుఖ - దుఃఖాలు పొందటము, గతజన్మ విషయాలు మరచిపోవడము,

హిమాలయ పర్వతం నుండి గంగానది భూలోకానికి రావడం, మేఘాలు సముద్రంలోని ఉప్పనీటిని గ్రహించి మంచి నీటిని ఇవ్వగలగడం, రోగగ్రస్తులైన మానవులు ఔషధాలను సేవించడం ద్వారా ఆరోగ్యవంతులు కావడం, కొందరైతే బ్రతకలేకపోవడము, ఇదంతా నా మాయ కారణంగా జరుగుతుంది కుబేరుడు ధనేశ్వరుడని అందఱు తలుస్తారు వాస్తవానికి ధనాధిపతిని నేనే వృత్రాసురుణ్ణి చంపింది ఇంద్రుడు కాదు, నాయొక్క మాయయే పంచభూతాలకు సంబంధించిన కర్తవ్య నిర్వహణంతయు నామాయే

## అన్నదాన మహిమ -

పూర్వము ఇలావృతమనే దేశాన్ని శ్వేతుడనే రాజు పరిపాలిస్తుండేవాడు అతడు తన రాజ్యంలోని వారికి భూదానం చేయాలని తలచాడు ఈ విషయాన్ని తన కులగురువైన వసిష్ఠమహర్షితో ప్రస్తావించాడు అపుడు మహర్షి అన్నాడు -

అన్నదానం దదత్ రాజన్ సర్వలోకసుఖావహమ్ ।
అన్నేన చైవ దత్తేన కిం న దత్తం మహీతలే ॥
సర్వేషామేవ దానానామన్నదానం విశిష్యతే ।
అన్నాద్భవంతి భూతాని అన్నే నైవ చ వర్ధతే ॥
తస్మాత్ సర్వప్రయత్నేన అన్నం దదస్వ భూపతే ।

అన్నిలోకాల్లోనూ, అన్నికాలాల్లోనూ సుఖదాయకమైనది అన్నదానం అన్నదానం చేస్తే అన్నీదానం చేసినట్లవుతుంది సృష్టిలోని సకల జీవులు అన్నం వలనే పుడుతున్నాయి, పెరుగుతున్నాయి గనుక, నీవు తప్పక అన్నదానం చేయాలి- అని భావం ఈ విధంగా అన్నదాన మహిమ ఈ పురాణంలో స్పష్టంగా చెప్పడమైనది

## రాగిపాత్రల ప్రాశస్త్యం -

మందిరాల్లో మరియు నిష్ఠాగరిష్ఠులైన మహానుభావుల ఇళ్ళలోనూ పూజా సమయాల్లో రాగిపాత్రలనే వాడుతుంటారు ఇది మన

నిత్యానుభవంలోని విషయం వెండి, బంగారు పాత్రలను వాడగలిగే దనవంతులు సైతం ఈ రాగి పాత్రలనే వాడటంలో గల మర్మం ఏమిటి? ఈ విషయమ్పై మహావిష్ణువును ప్రశ్నించింది భూదేవి

ముచ్య సౌవర్ణ-రౌప్యం చ కాంస్యం చైవ జనార్దన।
ఏతన్మే పరమం గుహ్యం తామ్రమస్తే రోచతే కధమ్॥

అపుడు వరాహరూపియైన విష్ణువిలా సమాధానం చెప్పాడు -

సౌవర్ణం రాజతం కాంస్యం యేషు దీయేత ప్రాపణా।
తాని సర్వాన్ పరిత్యజ్య తామ్రం చ మమ రోచతే॥

బంగారు, వెండి, కంచు మొదలైన పాత్రలతో కాక రాగి పాత్రలతో కర్మానుష్ఠానం చేస్తే నేను సంతోషిస్తాను ఏడువేల యుగాల క్రితం నా మాయ కారణంగా ఈ తామ్రం పుట్టింది గుడాకేశుడనే అసురుడు తామ్రరూపంతో నన్నారాధిస్తుండేవాడు ఒకసారి నేనాతని ఆశ్రమానికి వెళ్ళాను అద్భుతంగా ఉందాశ్రమం సంతోషించాను అతడు నన్నారాధించాడు తృప్తి పడ్డాను కావలసిన వరం కోరుకొమ్మన్నాను సుదర్శన చక్రంతో తనను వధించమని కోరాడు తన అవయవాలన్నీ తామ్రరూపం దాల్చాలనీ, భగవదారాధనకు ఆ ప్మాత్రలనే వాడాలనీ సవినయంగా కోరాడు గుడాకేశుడు ఒక శుభ ముహూర్తంలో వైశాఖశుక్లద్వాదశినాడు గుడాకేశసంహారం జరిగింది అతని కోరిక నెఱవేఱింది ఈ విధంగా మనకు తామ్ర పాత్రలు ప్రాప్తించాయి

పవిత్రాణాం పవిత్రం చ మంగళానాం చ మంగళమ్।
విశుద్ధానాం శుచిశ్చైవ తామ్రం సంసార మోక్షణమ్॥

రాగి అత్యంతము పవిత్రమైనదే గాక ఈ సంసారబంధం నుంచి ముక్తి నివ్వగలదు

## తీర్థ ప్రాశస్త్యం -

వరాహపురాణంలోని 137వ అధ్యాయంలో చక్రతీర్థం, రూపతీర్థం, యోగతీర్థం, సోమతీర్థమనే నాలుగు తీర్థాల గుఱించిన వివరణ ఉన్నది. ఈ తీర్థాల్లో స్నానాలు చేసేవారు పుణ్యలోకాలను పొందగలరు

వైశాఖ శుద్ధ ద్వాదశినాడు **చక్రతీర్థ** స్నానం చేస్తే । । వేల సంవత్సరాల పాటు ధన - ధాన్య సమృద్ధి పొందగలరు

కార్తీక శుద్ధ ద్వాదశినాడు **రూపతీర్థంలో** స్నానం చేస్తే పితృదేవతలకు మోక్షం సిద్ధిస్తుంది రూపవతి యైన భార్య ప్రాప్తిస్తుంది

మార్గశిర శుద్ద చతుర్దశినాడు **యోగతీర్థంలో** స్నానం చేస్తే రాగద్వేషాలు మరియు హింసకు దూరమవుతారు

వైశాఖ బహుళ ద్వాదశినాడు **సోమతీర్థంలో** స్నానమాచరిస్తే వేద-వేదాంగాదివిద్యలలో నిష్ణాతులై ౩౩ వేల సంవత్సరాలపాటు ఘనకీర్తులందుకుంటారు

## విష్ణుమందిరాల్లో సేవాఫలం -

భూదేవి వరాహస్వామిని అడిగింది - స్వామీ! విష్ణుమందిరాలను ఎవరైతే శుభ్రం చేస్తారో, ఆట - పాటలు, జాగరణలతో స్వామిని ఎవరైతే సేవిస్తారో వారికి కలిగే ఫలమేమిటి?

అందుకు సమాధానంగా - ''దేవీ! విష్ణుమందిరాల్లో ఎన్ని అడుగల నేలను శుభ్రం చేస్తే అన్ని వేల సంవత్సరాలు స్వర్గ సుఖాలనుభవిస్తారు విష్ణుగానం చేసే వారి పాటల్లో అక్షరాలెన్నుంటాయో అన్ని వేల సంవత్సరాలు అమరలోక సుఖాలు పొందుతారు నాట్యం చేసేవారు సంసార బంధాలకు దూరమవుతారు జాగరణ చేసేవారు జంబూద్వీపంలో చక్రవర్తి పదవిని పొందగలరు ఇలాగే భక్తితో నాకు పుష్పాలను సమర్పించేవారు అనేక పుణ్యకర్మలు చేసి చివర్లో వైకుంఠం చేరుకోగలరు'' అన్నాడు వరాహస్వామి

యావన్తః పాంసవో భూమేరుడ్డీయన్తే తు చాలితాః।
తావద్వర్ష శతాన్యాశు స్వర్గలోకే మహీయతే ॥

యావన్తి చాక్షరాణ్యేవ గీయమానే యశస్విని।
తావద్వర్ష సహస్రాణి ఇంద్రలోకే మహీయతే ॥

నృత్య మానస్య వక్ష్యామి త చ్ఛృణుష్వ వసుంధరే।
మానవో యేన గచ్ఛేత ఛిత్వా సంసారబంధనమ్ ॥

త్రింశద్వర్షసహస్రాణి త్రింశద్వర్ష శతాని చ ॥
యస్తు జాగరతే నిత్యం ఏవం కర్మపరాయణః ।
జంబూద్వీపం సమాసాద్య రాజరాజస్తు జాయతే ॥

**సత్యంయొక్క ప్రాశస్త్యం –**

సత్యమూలం జగత్సర్వం లోకాః సత్యే ప్రతిష్ఠితాః ।
సత్యేన లభతే సిద్ధిం ఋషయో బ్రహ్మవాదినః ॥
సత్యేన గమ్యతే స్వర్గం మోక్షం సత్యేన ప్రాప్యతే ।
సత్యేన తపతే సూర్యః సోమః సత్యేన రంజతి ॥

ఈ సకల జగత్తుకు ఆధారం సత్యమే తత్త్వవిదులైన ఋషులు సత్యం వలన మాత్రమే సిద్ధిపొందగలరు స్వర్గం గాని, మోక్షంగాని పొందాలంటే సత్యమే సాధనం సత్యం కారణంగానే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు ఈ సత్యం కారణంగానే చంద్రుడు లోకాలకు ఆహ్లాదాన్నిస్తున్నాడు

**నాచికేతుని వృత్తాంతం –**

సకల వేద – వేదాంగాలను అధ్యయనం చేసిన మహాముని ఉద్దాలకుడు ఇతని పుత్రుడు నాచికేతుడు తండ్రి వలె ఇతడు కూడ సకలవిద్యావిశారదుడు ఒక సందర్భంలో తండ్రిశాపానికి గురయ్యాడు వెంటనే యమలోకానికి పొమ్మని శపించాడాతండ్రి సవినయంగా యమపురికి బయల్దేరాడు నాచికేతుడు తన కోపానికి పశ్చాత్తాపం చెందాడు ఉద్దాలకుడు గట్టిగ ఏడ్చాడు తాను వెంటనే తిరిగిరాగలననీ, భయపడవలసిన అవసరం లేదనీ ఊరడించాడు పుత్రుడు తన యోగవిద్యతో వెంటనే యమపురికి చేరాడు సాదరంతో స్వాగతం పలికాడు యమధర్మరాజు తనలోకంలోని విశేషాలను చూపెట్టాడు గౌరవంగా అతనికి వీడ్కోలిచ్చాడు భూలోకం చేరుకున్నాడు నాచికేతుడు తన కొడుకును చూసుకొని ఆనంద పరవశుడైనాడు ఉద్దాలక మహాముని అక్కడున్న మునులందరికీ తన కుమారుని సామర్థ్యం గురించి చెప్పాడు

ఈ లోకంలో తన వంటి అదృష్టశాలి మరెవ్వరూ ఉండడని పొంగిపోయాడు యమలోకం విశేషాలనడిగారు అక్కడివారందరు నాచికేతుడిలా అన్నాడు -

అసత్యవాదులు, జంతువులు, స్త్రీలు, పిల్లలను వేధించేవారు, నమ్మకద్రోహులు, కృతఘ్నులు, పరస్త్రీ కాముకులు, కన్నెపిల్లలను బలత్కరించేవారు, వేద - శాస్త్రాలను దూషించేవారు, తల్లి - దండ్రులను, సదాచారంతో ఉన్న భార్యలను వదిలేవారు, గురువులను ద్వేషించేవారు, రాగద్వేషాలకు లోబడినవారు, ఇతరుల ఇండ్లను, పొలాలను అపహరించేవారు, ఆనకట్టలను తెంచేవారు, కనిపించిన ప్రతివస్తువును అమ్మేవారు, ప్రభువుల హితం కోసం ప్రాణత్యాగం చేయనివారు, తమ ప్రభువులను తామే చంపేవారు, యుద్ధంలో పారిపోయేవారు మొదలైనవారందరు యమలోకం చేరుతారు

వెయ్యి యోజనాల వెడల్పు, రెండువేల యోజనాల పొడవుతో ఎంతో విశాలమైనది యమపురి బంగారు మేడలు, స్వచ్ఛమైన నదులు, సరోవరాలు, పచ్చనిచెట్లు అక్కడున్నాయి ఈ విధంగా సకల సౌందర్య శోభావిరాజితం యమపురి

నాచికేతుడు యమధర్మరాజు దగ్గర ఉన్న సమయంలోనే నారదమహర్షి అక్కడికొచ్చాడు. ''స్త్రీలు ఏవిధమైన కర్మలను ఆచరిస్తే ఉత్తమలోకాలను పొందగలరు?'' అని అడిగాడు అందుకు సమాధానంగా యముడు – ''మహామునీ! స్త్రీలకు ప్రత్యేకించి ఏవిధమైన నియమాలు, దానాలు, ఉపవాసాలు అవసరం లేదు వారు చేయవలసిందల్లా ఒక్కటే అదే పతిపూజ పతి మేల్కొనే సమయానికి తాను మేల్కొనడం, అతను నిద్రపోతే తనకు నిద్ర, భర్త భోంచేశాకే తన భోజనం, భర్త మౌనంగా ఉంటే తానూ సహకరించాలి ఒకే దృష్టి, ఒకే చిత్తంతో పతివాక్యం వినాలి మగడు కోపంగా ఉన్నా తను శాంతంగా ఉండాలి పతియే స్త్రీలకు ప్రత్యక్షదైవము ఈ లక్షణాలున్న స్త్రీలను దేవతలు కూడ పూజిస్తారు వీరి విషయంలో నేను సైతం భయపడతాను ఇలాంటి స్త్రీలు

నాలోకం చూడరు ఏ సమయంలోనూ పరపురుషుణ్ణి తలవరాదు వీరు సూర్యోదయంకాక మునుపే నిద్రలేచి వాకిట ముగ్గులు పెట్టాలి ఈ విధంగా ఆచరించే స్త్రీలు ఉత్తమ లోకాలు పొందుతారు.'' అన్నాడు

ఈ విధంగా నాచికేతుని వృత్తాంతం ఎంతో విపులంగా సాక్షాత్కరిస్తున్నది వరాహపురాణంలో ఇలాంటి మరెన్నో వృత్తాంతాలతో శ్రీవరాహపురాణానికి ఎంతో ప్రాధాన్యమున్నది

శ్రుత్వా తు పూజయేద్యస్తు శాస్త్రం వారాహసంజ్ఞితమ్ ।
సర్వపాపవినిర్ముక్తో విష్ణుసాయుజ్యమావ్రజేత్ ॥

ఎవరైతే ఈ మహాపురాణాన్ని శ్రవణం చేస్తారో భక్తి - శ్రద్ధలతో పూజిస్తారో వారు సకల పాపాల బారి నుండి ముక్తులై విష్ణుసాయుజ్యం పొందగలరు

  

# 13. స్కాందపురాణము

''యత్ర స్కందః స్వయం శ్రోతా వక్తా సాక్షాన్మహేశ్వరః''

శివుడు తనకుపదేశించిన ఈ పురాణాన్ని భక్తి - శ్రద్ధలతో విన్నాడు కుమారస్వామి ఆ తరువాత తాను మహామునుల కుపదేశించాడు ''ఏకాశీతిసహస్రం తు స్కాందం సర్వాఘ- కృంతనమ్'' సకల పాపాలను దూరం చేయగలిగిన ఈ పురాణంలో 81 వేల శ్లోకాలున్నాయి అష్టాదశ మహాపురాణాల్లో చాల పెద్దదైనది స్కాందపురాణం మహావిష్ణువు యొక్క కురులతో పోల్చబడింది పురాణం ''స్కాందం పురాణం లోమాని'' అనే వచనమిక్కడ ప్రమాణం

(1) మహేశ్వర ఖండం (2) వైష్ణవ ఖండం (3) బ్రహ్మ ఖండం (4) కాశీ ఖండం (5) అవంతీ ఖండం (6) నాగర ఖండం (7) ప్రభాస ఖండమనే పేర్లతో ఏడు ఖండాలిందులో ఉన్నాయి

మహేశ్వర ఖండంలో - కేదార ఖండం, కౌమారీ ఖండం, అరుణాచలమాహాత్మ్యం మొ॥ అంశాలున్నాయి

వైష్ణవ ఖండంలో - వేంకటాచల మాహాత్మ్యం, జగన్నాధ క్షేత్ర మాహాత్మ్యం (పురుషోత్తమ క్షేత్ర మాహాత్మ్యం), బదరికాశ్రమ మాహాత్మ్యం, కార్తీకమాస మాహాత్మ్యం, మార్గశిరమాస మాహాత్మ్యం, అయోధ్యా మాహాత్మ్యం మొ॥ అంశాలు సాక్షాత్కరిస్తాయి

బ్రహ్మ ఖండంలో - సేతు మాహాత్మ్యం, ధర్మారణ్య ఖండం, బ్రహ్మోత్తర ఖండాలున్నాయి

కాశీ ఖండంలో - కాశీ క్షేత్రానికి సంబంధించిన సమగ్ర వర్ణన దర్శన మిస్తుంది

నాగర ఖండంలోని, తాపీ తీరంలోని తీర్థాల వర్ణన కనిపిస్తుంది ఈ కారణంగా ఈ ఖండానికి తాపీఖండమనే పేరు కూడ ఉంది విశ్వకర్మోపాఖ్యానం, హాటకేశ్వరోపాఖ్యానం మొ॥ ఉపాఖ్యానాలిందులో ఉన్నాయి

ప్రభాస ఖండంలో, ద్వారకానగర పరిసరాలకు సంబంధించి చక్కని వర్ణన ఉన్నది

ఖండరూపంతో మాత్రమే గాక సంహితారూపంతోనూ స్కాందపురాణమున్నది (1) సనత్కుమార సంహిత (2) సూత సంహిత (3) శంకర సంహిత (4) వైష్ణవ సంహిత (5) బ్రహ్మ సంహిత (6) సౌరసంహిత ఇవీ ఆ సంహితలు

సూత సంహితలో శివోపాసన ఎంతో విశదంగా ఉంది శివమాహాత్మ్యాన్ని తెలియజేసే ఒక శ్లోకం -

శివప్రసాదేన వినా న భుక్తయః శివప్రసాదేన వినా న ముక్తయః।
శివప్రసాదేన వినా న దేవతాః శివప్రసాదేన హి సర్వసిద్ధయః॥

శివానుగ్రహం లేనిదే ఆహారం దొరకదనీ, మోక్షం లభించదనీ, ఇతరదేవతల శక్తులు పనిచేయవనీ, శివానుగ్రహంవల్ల మాత్రమే సకల సిద్ధులు కలుగుతాయనీ ఈ శ్లోకం భావం

కాశీ ఖండానికి సంబంధించిన ఆసక్తిదాయకమైన ఒక అంశమిక్కడ ప్రస్తావించవలసియున్నది

అయోధ్యాయామథావంత్యాం మధురాయామథాఽపి వా ।
ద్వారవత్యాం చ కాంచ్యాం వా మాయా పుర్యాం మృతా నృప ॥
అపి పాతకినో యే చ కాలేన నిధనం గతాః ।
తేహి స్వర్గాదిహాగత్య కాశ్యాం మోక్షమవాప్నుయుః ॥

అనగా, అయోధ్య, అవంతి, మధుర, ద్వారక, కంచి, మాయాపురి అనే నగరాల్లో మరణించిన వారు ఆయానగరాల ప్రభావం వల్ల పాపాత్ములైనను స్వర్గాన్ని పొందగలరు స్వర్గసుఖాలనుభవించాక కాశీ నగరంలో జన్మించి అక్కడే ముక్తులవుతారు అంటే, పై ఆరు నగరాలు సాక్షాత్తు మోక్షదాయకాలు కావు కాశీక్షేత్రం మాత్రమే సాక్షాత్తు మోక్షదాయకమని భావం గనుకనే ''కాశ్యాం తు మరణాన్ముక్తిః'' అని పెద్దలంటారు

ఇట్లే,

క్షేమమూర్తిరియం కాశీ క్షేమమూర్తిర్భవాన్ భవః।
క్షేమమూర్తిస్త్రి పథగా నాన్యత్ క్షేమత్రయం క్వచిత్ ॥

క్షేమదాయక నగరం కాశీ, క్షేమాన్నిచ్చే దేవుడు విశ్వేశ్వరుడు, క్షేమదాయకమైనది గంగ ఈ మూడింటి కలయిక ఒక్క కాశీనగరానికి మాత్రమే పరిమితం మరెక్కడా ఈ మూడు ఒకే చోట కానరావని భావం కాశీక్షేత్ర పవిత్రతను చాటుతున్నదీ శ్లోకం

పలుచోట్ల దేవాలయాల జీర్ణోద్ధరణ జరుగుతుంటుంది ఈ కార్యక్రమం నిర్వహించేవారు ఏవిధమైన ఫలాన్ని పొందగలరో ఈ పురాణం చెబుతుంది -

కాలేన భగ్నమాపన్నం జీర్ణోద్ధారం కరోతి యః।
ఇహ తస్య ఫలస్యాన్తః ప్రళయేఽపి న జాయతే ॥

ఎవరైతే కాలగర్భంలో కలసిపోయిన దేవాలయాల జీర్ణోద్ధరణ జరిపిస్తారో వారు పొందిన పుణ్యం ప్రళయకాలంలో సైతం నశింపక శాశ్వతంగా ఉంటుందని చెప్పడమైనది

శ్రీసత్యనారాయణస్వామి వ్రతాన్ని భారతీయులెంతో భక్తి శ్రద్ధలతో ఆచరిస్తారు ప్రత్యేకించి తమ ఇంట ఏ శుభకార్యం జరిగినా ఈవ్రతంచేయడం తెలుగువారికానవాయితి ఎంతో మహిమతో కూడిన ఈ వ్రత కథ స్కాందపురాణంలోని రేవాఖండంలో దర్శనమిస్తుంది

పై విశేషాలే గాక ఈ పురాణంలో ఇంకా -

విభూతి మాహాత్మ్యం, గోకర్ణ క్షేత్రంలో రావణుడు ఈశ్వరుని పూజించుట, దేవతలు వానరులుగ జన్మించుట, రామావతార వర్ణన, క్షీరసాగర మథనం, అందులో లక్ష్మీదేవి, అమృతాల ఉత్పత్తి, విష్ణువు మోహినీ రూపం ధరించుట, గిరిజా కల్యాణం, కుమార సంభవం, తారకాసుర వధ, శివరాత్రి మాహాత్మ్యం, శివ - పార్వతుల జూదం, అందులో ఓడిన శివుడు కౌపీనం ధరించి కైలాసం వదలి అడవులకు వెళ్ళడం, పార్వతీదేవి కూడ ఆయన్ని అనుసరించడం, అన్న-గృహ- వాహన దానాల ఫలము,

ఓంకారమహిమ, స్వాయంభువు మొ॥ । 4 గురు మనువుల వర్ణన, తల్లి - దండ్రుల మాహాత్మ్యం, ఇంద్రద్యుమ్న చరితం, సప్తద్వీప వర్ణన, భీమేశ్వర మాహాత్మ్యం, మార్కండేయోపాఖ్యానం, హయగ్రీవోపాఖ్యానం, సోమవార వ్రత మాహాత్మ్యం, రుద్రాక్ష మాహాత్మ్యం, పురాణాలను నిందిస్తే కలిగే పాపాలు, అగస్త్యాశ్రమ వర్ణన, సదాచారాలు, గృహస్థ ధర్మాలు, మాంధాతృవృత్తాంతం, గోదాన మహిమ, గాయత్రీ మాహాత్మ్యం, శివరాత్రిమాహాత్మ్యం మొ॥ వృత్తాంతాలెన్నో ఉన్నాయి

## స్కాందపురాణంలో వనభోజనం -

ప్రతిమనిషి జీవితంలోనూ ఎన్నో ప్రధానఘట్టాలుంటాయి వాటిలో ఒకటి ఆహారసేవనం ''ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః'' పరిశుద్ధమైన ఆహారం తీసికొంటే సత్త్వగుణం పెంపొందుతుంది అందుకే ఆహారం తీసికొనేముందు దైవధ్యానం చేస్తారు ఒక్క భోజనంతో తప్ప మరే ఇతరసాధనంతోనూ మనం అవతలివారిని తృప్తిపఱచలేము తెలుగువారైన మనం భోజనప్రియులం కార్తీకమాసంలో మనవారు చేసే వనభోజనాల హడావిడి ఇంతా అంతా కాదు అయినవారితో కలసి ఈ మాసంలో కనీసం ఏదో ఒకరోజు వనభోజనానికి తప్పక వెళ్ళే ప్రయత్నం చేస్తారు ఈ కార్తీకమాసానికి, వనభోజనాలకు మధ్యనున్న సంబంధం ఏమిటి? అని ప్రశ్నించుకొంటే ఈ పురాణంలో సమాధానం స్పష్టంగ దొరకుతుంది

కార్తికే మాసి సంప్రాప్తే యః కుర్యాద్వనభోజనమ్।
స యాతి పరమం లోకం విష్ణుర్దేవస్య చక్రిణః॥

కార్తీకమాసంలో వనభోజనం చేసేవారు ఇహలోకయాత్ర ముగిశాక వైకుంఠం చేరుకోగలరని భావం

ఈ వనభోజనం ఏదో ఒక చెట్టు కింద కూర్చొని పూర్తి చేయడం కాక ఉసిరిచెట్టు కిందే చేయగలిగితే ఎంతో మంచిది

ధాత్రీవనే హరేఃపూజా ధాత్రీ ఛాయాసు భోజనమ్।
కార్తికే మాసి యః కుర్యాత్ తస్య పాపం వినశ్యతి॥

దాత్రీ ఛాయాం సమాశ్రిత్య కార్తికేఽన్నం భునక్తి యః।
అన్న సంసర్గజం పాపమావర్షం తస్య నశ్యతి॥

ఉసిరిచెట్టు పూజ, ఉసిరిచెట్టు నీడలో భోజనం ఎవరైతే చేస్తారో వారి పాపాలన్నీ దూరమవుతాయి కార్తీక మాసంలో ఉసిరిచెట్టు కింద భోంచేయడం వల్ల అన్నదోషమేదైనా ఉంటే అది దూరమవుతుంది ఇదీ కార్తీకమాసంలో వనభోజన ఫలం

## స్కాందపురాణంలో గురుపూజ -

సర్వేషామేవ దర్మాణాం గురుపూజా పరా మతా।
గురుశుశ్రుషయా సర్వం ప్రాప్నోతి హి న సంశయః॥
గురౌ తుష్టే చ తుష్టాః స్యుః దేవాస్సర్వే సవాసవాః।
గురౌ రుష్టే చ రుష్టాః స్యుః దేవాస్సర్వే సవాసవాః॥
యత్కించిద్వా సమాదిష్టో గురుణా తత్సమాచరేత్।
ఆజ్ఞప్తో గురుణా శిష్యః న తద్వాక్యం తు లంఘయేత్॥
గురౌ న ప్రాప్యతే యత్తన్నాన్యత్రాపి హి లభ్యతే।
గురుప్రసాదాత్సర్వంతు ప్రాప్నోత్యేవ న సంశయః॥

ధర్మాలన్నింటిలోను అత్యుత్తమమైనది గురుసేవ ఈ గురుసేవ వల్ల సకలాభీష్టాలు సిద్ధిస్తాయి గురువు మనపట్ల సంతోషిస్తే దేవతలందఱు సంతోషిస్తారు. అదేగనుక గురువు కోపగిస్తే దేవతలందఱు దూరమౌతారు వారి ఆజ్ఞను జవదాటరాదు గురువుల అనుగ్రహమొక్కటి పొందగలిగితే దేవతలందఱు అనుగ్రహించినట్లే

## పురాణాలెందుకు వినాలి?

ఈ సందేహానికి సమాధానంగా 136 శ్లోకాలతో ఎంతో విపులంగా పురాణాల మహత్త్వాన్ని తెలియజేశాడు వ్యాసభగవానుడు ఆ వివరాలు- సంసారబంధాలతో కొట్టుమిట్టాడుతున్న వారికి సులువైన మార్గంలో ముక్తిని ప్రసాదించగలిగేవి పురాణాలు వేదాధ్యయనం చేయలేని వారికి సులువైన సాధనమార్గాన్ని ఉపదేశించేవి పురాణాలు

అజ్ఞానమనే అంధకారంలో అలమటిస్తున్నవారికి జ్ఞానదీపాలు, భవరోగులకు మంచి ఔషధాలు, సకల సంపదలను కలుగజేసేవి ఈ పురాణాలు సతతము పురాణశ్రవణం చేసేవారు సాక్షాత్తు దేవతా స్వరూపులే పురాణాల్లోని కధలను ఎవరైతే భక్తిశ్రద్ధలతో వింటారో అలాంటి వారు ''కర్మ'' అనబడే అరణ్యాన్ని దహించి భగవత్సాన్నిధ్యాన్ని పొందగలరు నిత్యము పురాణ శ్రవణం చేయలేని బలహీనుడు కనీసం ఆయా పుణ్య తిధుల్లోనైనా ఆ ప్రయత్నం చేయాలి సర్వయజ్ఞఫలము, సర్వదానఫలము పురాణశ్రవణం ద్వారా కలుగుతుంది ఈకలియుగంలో పురాణ శ్రవణం కంటె పవిత్రమైన ధర్మం మరొకటి లేదు మానవజాతి మీద గల కృపాదృష్టిలో వ్యాసమహర్షి రచించిన ఈపురాణాలు సకలపాపనివారకాలు పురాణాలను చెప్పగలిగిన వారెవరైనా సరే వారు తప్పని సరిగ పూజనీయులు వారిని నీచ దృష్టితో చూడరాదు అలా చూస్తే శ్రేయస్సు కలుగదు గురువులకే గురువులు పురాణప్రవక్తలు.

ఈపురాణపాఠకులు పవిత్రాత్ములై ఉండాలి దానము, శాంతము, దయ, అసూయలేకుండుట మొదలైన గుణాలు వారిలో పుష్కలంగా ఉండాలి కొంటె ప్రశ్నలు వేసేవారు, ఆయా కధల్లో విపరీతార్థాలు తీసేవారు ఎవరైతే ఉంటారో అలాంటివారికి పురాణాలనుపదేశించరాదు. మంచిమనుషులున్నచోట, నదీతీరం, దేవాలయం మొదలైన పవిత్ర ప్రదేశాల్లో మాత్రమే పురాణ పఠనం చేయాలి పురాణశ్రవణసమయంలో మధ్యలో లేచిపోవడం, తలపాగా ధరించడం, తాంబూలభక్షణం మొదలైన అకృత్యాలు చేయరాదు పాపాలను హరించగలిగిన కధలను అపహాస్యం చేసేవారు నీచమైన జన్మలను పొందగలరు ఎంతో వినయంతో, పూజ్యభావంతో శ్రవణం చేయాలి ఈ విధంగా పురాణశ్రవణ మహిమ చక్కగ వర్ణితమైనదీ స్కాందపురాణంలో

**రుద్రాక్ష మహిమ –**

అభక్తో వాఽపి భక్తో వా నీచో నీచతరోఽపి వా ।
రుద్రాక్షాన్ ధారయేద్యస్తు ముచ్యతే సర్వపాతకైః ॥

రుద్రాక్ష ధారణం పుణ్యం కేన వా సదృశం భవేత్ ।
యో ధారయతి రుద్రాక్షాన్ రుద్రవత్ సోఽపి పూజ్యతే ॥

భక్తుడైనా, భక్తుడు కానివాడైనా సరే రుద్రాక్షలను ధరిస్తే సకల పాపాల నుండి ముక్తుడవుతాడు వీటిని ధరించడం వల్ల కలిగే పుణ్యానికి సాటియైన పుణ్యమేదీ లేదు. రుద్రాక్షలను ధరించినవాడు శివుని వలె పూజలందుకొంటాడు

రుద్రాక్షలతో ఏ మంత్రాన్నైనా జపిస్తే తప్పక సిద్ధి కలుగుతుంది వీటిని శిరస్సున ధరించి స్నానం చేస్తే గంగాస్నానఫలం ప్రాప్తిస్తుంది ఏకముఖి, పంచముఖి, ఏకాదశముఖి, చతుర్దశముఖి అను రీతిగా రుద్రాక్షలు నానా విధాలుగ ఉంటాయి

రుద్రాక్షమహిమను తెలియజేసే అద్భుతమైన కథ ఒకటి ఈవిధంగా సాక్షాత్కరిస్తుంది పురాణంలో -

పూర్వం కాశ్మీరరాజ్యాన్ని భద్రసేనమహారాజు పరిపాలిస్తుండేవాడు అతని కుమారుడు సుధర్ముడు ఇతడు చక్కని మేధావి మరియు బలవంతుడు మహామంత్రి గారి కుమారుడు తారకుడు ఈ ఇద్దరు పరస్పరం మంచి మిత్రులు చదువుఆటలు మొదలైన క్రియాకలాపాలను కలిసే సాగించేవారు ఈ ఇద్దరికీ ఆభరణాలంటే గిట్టవు అన్ని వేళలా సర్వాంగ సుందరంగా రుద్రాక్షలను మాత్రమే ధరించేవారు ఎందరెన్ని విధాల చెప్పినా ఈ అలవాటును మార్చుకోలేదు మహారాజు మరియు మహామంత్రికి తమ కుమారుల ధోరణి మింగుడు పడలేదు ఇలా ఉండగ, ఒకసారి పరాశరమహర్షి ఈమహారాజుదగ్గరికివచ్చాడు రాజభవనంలో పాదపూజలందుకొన్నాడు పరస్పరం కుశలప్రశ్నలయ్యాయి సుధర్మ - తారకులను మహామునికి పరిచయం చేశాడు మహారాజు ఎన్ని విధాలుగ శాసించినప్పటికీ వారు ఆభరణాలు దరించరు సరికదా, రుద్రాక్షలను మాత్రమే ధరిస్తున్నారని ఎంతో దీనంగా మొరపెట్టుకొన్నారాతండ్రులు అసలు వీరిలా ప్రవర్తించడానికి కారణమేమిటని అడిగారు

అపుడు పరాశరమహర్షి ఆ కుమారులిద్దరి పూర్వజన్మ వృత్తాంతమిలా వివరించాడు -

పూర్వం నంది గ్రామంలో ఒక వేశ్య ఉండేది. పేరు మహానంద అందాల రాశి శ్వేత చ్ఛత్రం, బంగారు వాహనం, బంగారు పాదరక్షలు, కన్నులు మిరిమిట్లు గొలిపే వస్త్రాలు, చంద్రకాంతులతో సమానంగా మెరిసే పట్టెమంచాలు, వెలకట్టలేని ఆభరణాలు, వందల సంఖ్యలో దాసీలు, నిత్యము షడ్రసాలతో విందుభోజనాలు, నానా విధాలైన చిత్రాలు, చక్కని భవంతి, పశుసంపద, ధాన్యసంపద ఇలాగ ఒకటేమిటి అన్నివిధాలైన వైభవాలను అనుభవించేది ఇన్ని వైభవాలతో తులతూగుతున్నా మహానందలో ఒక విశేష గుణముండేది నిత్యము శివపూజ స్వయంగా నిష్ఠతో ఆచరిస్తూ ఉండేది శివకథలను భక్తి శ్రద్ధలతో వినేది తన నాట్యశాలలో ఒక కోతి మరియు కోడిని పెంచుకొనేది వాటికి సరదాగ రుద్రాక్షలు కట్టింది ఆమెతో కలసి అవి చక్కగా లయబద్ధంగా నాట్యం చేసేవి వీటి నాట్యం చూస్తే చూపరులకాశ్చర్యం కలిగేది

ఇలా ఉండగ ఒకరోజు మహానంద ఇంటికి ఓ శివభక్తుడొచ్చాడు విభూతి, రుద్రాక్షలను ధరించాడతడు. అపర శంకరుని వలె మంచి తేజస్సుతో ఉన్నాడు అతన్ని చూసి ఆశ్చర్యపోయిందామె భక్తి- శ్రద్ధలతో అతన్ని పూజించింది అతని చేతికొక రత్నకంకణముంది అద్భుతంగా మెరుస్తోంది ఆ కంకణం తనకు కావాలని కోరింది మహానంద "దీనికి తగిన మూల్యం చెల్లించగలరా?" అడిగాడా భక్తాగ్రేసరుడు. "వ్యభిచారం మా వృత్తి. అయితే, ఈ కంకణం నాకిచ్చే మాటైతే మూడు రోజులు మీ భార్యగ పవిత్రంగా ఉంటాను" అంది మహానంద ఒప్పుకొన్నాడా శివ భక్తుడు తమ మధ్యన ఈ ఒప్పందానికి సూర్య - చంద్రులే సాక్షులన్నాడతడు సంతోషంగ ఆ కంకణ మిచ్చాడు దాంతో పాటు ఒక రత్నమయమైన శివలింగ మిచ్చాడు జాగ్రత్తగ దాన్ని దాచమన్నాడు పొరపాటున అదిపోతే తనకు మరణం ప్రాప్తిస్తుందన్నాడు తీసి కొందామె నాట్యశాలలో ఓ స్తంభం చాటున జాగ్రత్తగ దాచింది ఆ రాత్రి సుఖంగా నిద్రించారిద్దరు అర్ధరాత్రి సమయంలో అకస్మాత్తుగ మంట లొచ్చాయి నాట్యశాలలో వెంటనే మేల్కొందామె మొట్ట మొదటన పరుగులు తీసింది

తను పెంచుకొంటున్న కోతి మరియు కోడిని అక్కణ్ణుంచి తప్పించింది ప్రమాదం నుంచి తాను తప్పకొంది కాని, తను దాచి పెట్టిన రత్నలింగం బూడిదైంది ప్రాణసమానమైన ఆ శివలింగం లేకుంటే తను బ్రతుకలేనన్నాడు శివభక్తుడు చితికి ఏర్పాట్లు చేయమన్నాడు అందఱు చూస్తుండగ అగ్ని ప్రవేశం చేశాడు మూడు రోజులతని భార్యగ ఉంటానని వాగ్దానం చేసిన విషయాన్ని అక్కడి వారందఱికి తెలియజేసింది తన సంపదలన్నీ శివభక్తులకు చెందేలాగ ఏర్పాట్లు చేసింది భర్తతో కూడ తానూ అగ్నిలో దూకబోయింది. శివుడు ప్రత్యక్షమయ్యాడు సూర్యచంద్రాగ్నుల వలె అద్భుతంగా ప్రకాశిస్తున్నాడు సదాశివుడు మహానందను అడ్డుకొన్నాడు ''మహానందా! నీ భక్తిని, సత్యవ్రతాన్ని పరీక్షించడానికి నేనే శివభక్తునివేషంతో వచ్చాను నాట్యశాలలో మంటలు నేను సృష్టించినవే నా పరీక్షలో నెగ్గావు. నీకోరికలను తీర్చగలను'' అన్నాడు.''శంకరా! నాకు నీ సాయుజ్యం తప్ప మరే ఇతర సుఖాల అవసరం లేదు నాతో పాటు నా సేవకులు, దాసీలు, బంధువులను కూడ నీలో ఐక్యం చేసికో'' అని కోరిందామె ఆమె కోరిక ప్రకారం వారందఱు శివునితో కైలాసం చేరారు

''మహారాజా! అగ్నిప్రమాదం నుంచి తప్పకొని దూరంగా వెళ్ళి పోయిన కోతి మరియు కోడి కొంతకాలనికి మరణించాయి ఆ కోతి నీ కొడుకుగను, కోడి మంత్రిపుత్రుడుగను జన్మించారు పూర్వజన్మ సంస్కారం వలన ఈ ఇద్దఱు రుద్రాక్షలను ధరించడానికి అలవాటయ్యారు సంపూర్ణ శివానుగ్రహపాత్రులు వీరు ఇదీ వీరి పూర్వ జన్మ వృత్తాంతం ఈ విదంగా రుద్రాక్ష మాహాత్మ్యం సాటిలేనిది'' అని పరాశరుడు భద్రసేన మహారాజుతో చెప్పాడు భక్తి తత్త్వాన్ని తెలియజేసే ఇలాంటి కథలు స్కాంద పురాణంలో ఎన్నో ఉన్నాయి



# 14. వామనపురాణము

బ్రహ్మదేవుడు వామనమాహాత్మ్యాన్ని కీర్తిస్తూ బోధించిన పురాణమే వామనపురాణం ''త్వగస్య వామనం స్మృతం'' మహావిష్ణువు యొక్క చర్మంగా వర్ణింపబడినది ఈ పురాణం ''సంఖ్యయా దశసాహస్రం ప్రోక్తం కులపతే పురా'' అను వచనాన్ని బట్టి ఇందులో పదివేల శ్లోకాలున్నాయి ౯౫ అధ్యాయాలగుపిస్తాయి

ముఖ్యంగా వైష్ణవధర్మాలను బోధిస్తున్నదీ పురాణం విష్ణుభక్తులు, విష్ణుమందిరాలు, విష్ణుమందిర నిర్మాతలు ఈ ప్రస్తావనలే ఎక్కువగా ఉన్నాయి ఉత్పత్తి-ప్రళయాల వర్ణన, కామదహనం, ప్రహ్లాదునికి మహావిష్ణువు వరదానం, పుష్కరద్వీప వర్ణన, సుకేశిచరితము, దేవీమాహాత్మ్యము, వామనచరితం, సరస్వతీదేవి మాహాత్మ్యం, పలువిధాలైన తీర్థాలమహిమ, ఋణవిమోచన తీర్థాలు, కురుక్షేత్రమాహాత్మ్యం, పార్వతీ వివాహం, వినాయక విజయం, మురాసురసంహారం, చిత్రాంగదవివాహం, శ్రీదామచరితం, గజేంద్రమోక్షం మొదలైన విషయాలు కూడ ఉన్నాయి

12 మహావిష్ణువు స్తోత్రాలు, 8 శివస్తోత్రాలు, 4 దేవీ స్తోత్రాలు, మరియు సుదర్శన స్తోత్రం మొత్తం కలిపి 25 స్తోత్రాలిందులో ఉన్నాయి

దేవతల్లో ఉత్తముడు మహావిష్ణువు ఆయుధాల్లో శ్రేష్ఠం సుదర్శనం పక్షుల్లో గరుత్మంతుడు, సర్పాలలో వాసుకి, పంచభూతాల్లో పృథివి, నదుల్లో గంగ, నీట పుట్టిన వాటిలో కమలము, సరోవరాల్లో మానస సరోవరం, వనాల్లో నందనం, లోకాల్లో బ్రహ్మలోకం, ధర్మాల్లో సత్యం, క్రతువుల్లో అశ్వమేధం, తపోధనులలో అగస్త్యుడు, పురాణాల్లో మత్స్యపురాణం, స్మృతుల్లో మనుస్మృతి, తేజస్సులలో సూర్యుడు, జలాశయాల్లో సముద్రం, ధాన్యాల్లో వరి, చతుష్పాదులలో గోవు, పుష్పాల్లో జాజి, నగరాల్లో కంచి, సుందరీమణుల్లో రంభ, పట్టణాల్లో కుశస్థలి (శ్రీరామచంద్రుని పుత్రుడైన కుశుడు నిర్మించింది) పళ్ళల్లో మామిడి, తెల్లని

పదార్థాలలో పాలు, కళల్లో గణితము, విజ్ఞానాల్లో ఇంద్రజాలం, షడ్రసాల్లో లవణము, వృక్షాలలో అశ్వత్థం, సతీమణుల్లో పార్వతీదేవి, మొదలైన విధంగా శ్రేష్ఠపదార్థాలను వర్ణించాక పాపాత్ములలో కృతఘ్నుడికి సమానుడు లేడంటున్నది వామనపురాణం బ్రహ్మహత్య, గోహత్య మొదలైన మహాపాతకాలకు పరిహారమున్నది కాని కృతఘ్నతకు నిష్కృతి లేదని వివరించింది

ప్రతిమనిషి ఉదయం లేవగానే – బ్రహ్మ – విష్ణు – మహేశ్వరులు, సూర్యాది నవగ్రహాలు, సప్తఋషులు, సప్తలోకాలు తనకు శుభం చేకూర్చాలని చక్కని శ్లోకాలతో కర్తవ్యబోధ చేయడమైనదిందులో

ఆపత్కాలంలో సైతం కొందఱిని ఆశ్రయించరాదని హితవు చెబుతున్నదీ పురాణం ఆ కొందఱెవరో, వారి లక్షణాలేమిటో చూద్దాం-

(1) షండుడు – సకాలంలో స్నానము, దేవతారాధన చేయనివాడు మరియు తల్లిదండ్రులను గౌరవింపనివాడు

(2) మార్జారుడు – పుణ్యలోకప్రాప్తి కోసంగాక అహంకారం, నిర్లక్ష్యాలతో జపతపాలు చేసేవాడు

(3) ఆఖువు – కావలసినన్ని సంపదలున్నా తాను తినక, ఇతరులకూ పెట్టనివాడు.

(4) కుక్కుటుడు – పక్షపాతంతో తీర్పుచెప్పేవాడు.

(5) పతితుడు – తన ధర్మం వదలి పరధర్మం ఆచరించేవాడు

(6) అపవిద్ధుడు – గోహత్య, స్త్రీహత్య మొ॥ మహాపాతకాల-నాచరించేవాడు

(7) నగ్నుడు – దైవభక్తి లేనివాడు

(8) చండాలుడు – ఎంతో ఆశతో వచ్చినవారికి తాను సహాయపడక, ఇతరులు కూడ సహాయం [illegible]కుండా అడ్డుపడేవాడు మరియు శరణుకోరి వచ్చి[illegible] గాలికి వదిలేసేవాడు

(9) అధముడు – బంధువులు, స్నేహితులు, ఉత్తములు మొదలైన వారందఱికి దూరమైనవాడు

మనిషి ఆచరించాల్సిన సదాచారాలు ।22 శ్లోకాలతో చక్కగ వర్ణింపబడినవి

**పుత్రుని కంటే శిష్యుడే గొప్పవాడు** ఒక ఆసక్తిదాయకమైన విషయం- పుత్రుడు, శిష్యుడు ఈ ఇద్దఱు సమానులేనా? లేకతేడా ఏమైనా ఉందా? అని సనత్కుమారుడు బ్రహ్మదేవునిడిగాడు ( న విశేషో ఽస్తి పుత్రస్య శిష్యస్య చ పితామహ? )

బ్రహ్మదేవుడన్నాడు -

పున్నామో నరకాత్ త్రాతి పుత్రస్తేనేహ గీయతే ।
శేషపాపహరః శిష్య ఇతీయం వైదికీ శ్రుతిః ॥

'పుత్' అనే నరకం నుండి మాత్రమే రక్షింపగలిగేవాడు పుత్రుడు మిగిలిన పాపాలబారినుండి తప్పించగలిగేవాడు శిష్యుడు మాత్రమే అని భావం అంటే, గురువు తన శిష్యుణ్ణి పుత్రుని కంటె మిన్నగ ఆదరించాలని హితోక్తి

విష్ణుభక్తిని బోధించే ఈ శ్లోకాలను పరిశీలిద్దాం -

సా జిహ్వా యా హరిం స్తౌతి తచ్చిత్తం యత్తదర్పితమ్ ।
తావేవ కేవలౌ శ్లాఘ్యౌ యౌ తత్పూజాకృతౌ కరౌ ॥
రోగశ్చాన్యో న సాజిహ్వా యా న వక్తి హరేర్గుణాన్ ।
ఇదే భావం పోతనపద్యాల్లో ఇలా స్పష్టమవుతోంది -
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
కమలాక్షునర్చించు కరములు కరములు
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
పద్మనాభుని పొగడు పదములు పదములు

పాపాలను దూరం చేసికోవడమెలాగో ఈ కథ వివరిస్తోంది-

ముద్గలమహాముని కుమారుడు కోశకారుడు అన్ని వేదాలను చక్కగ అధ్యయనం చేశాడు ఇతని భార్య ధర్మిష్ఠ ఉత్తమ ఇల్లాలీమె వీరికొక కొడుకు పుట్టాడు ఆ శిశువుకు చూపు, మాటలేదు ఒకనాడు శూర్పాక్షి అనే రాక్షసి తన కొడుకును అక్కడ వదలి ఈ శిశువు నెత్తుకొని పోయింది

తినడానికి తన చోటికి తీసికెళ్ళింది ఈ రాక్షసి భర్త ఘటోదరుడు గుడ్డివాడితడు అలికిడి విన్నాడు ''ఏం తెచ్చావు?'' అడిగాడు తను చేసిన ఘనకార్యం చెప్పింది రాక్షసి ''నీవు చేసిన పని బాగులేదు మహాముని శాపానికి మనం గురికావల్సి వస్తుంది ఈ శిశువునక్కడే వదిలేసి రా'' అన్నాడు ఘటోదరుడు ''అలాగే'' అంది శూర్పాక్షి ఆ బాలకుణ్ణి తీసికొని ఆకాశమార్గంలో బయల్దేరింది

ఇలా ఉండగా తన పుత్రుని స్థానంలో రాక్షసబాలకుణ్ణి చూశాడు కోశకారుడు రాక్షసమాయ జరుగుతోందని గ్రహించాడు తన మంత్రాలతో ఆ బాలకుణ్ణి బంధించాడు శూర్పాక్షి వచ్చింది అదృశ్యరూపంతో ముని కుమారుణ్ణక్కడ ఉంచింది తన కొడుకును తీసుకోవాలని ప్రయత్నించింది. సాధ్యం కాలేదు మంత్రబద్ధుడయ్యాడా బాలకుడు చేయగలిగింది లేక భర్త దగ్గఱికి పరుగులు తీసింది ఆశ వదలుకొన్నారిద్దఱు

బాలకులిద్దఱికి నామకరణం జరిగింది మునికుమారుడు నిశాకరుడు రాక్షసపుత్రుడు దివాకరుడు ఆవుపాలతో పెరిగారిద్దఱు మునిపుత్రుడు మొదటివలె మందబుద్ధిగానే ఉన్నాడు అతనిలో ఏ మార్పు రాలేదు. అందఱిచివాట్లతో బాటు తల్లిదండ్రుల తిట్లనుకూడ భరించాడు ఇలాంటి కొడుకును భరించలేక దూరంగా ఉన్న నీళ్ళులేని బావిలోకి తోశాడాతండ్రి పెద్దబండ రాయినాబావి మీదుంచాడు ఆ బావిలో ఒక ఉసిరి చెట్టు ఉంది ఆ కాయలే బాలకుని- కాహారమయ్యాయి పదేళ్ళు గడిచాయి ఒకరోజు దర్మిష్ఠ ఆ ప్రాంతంలో తిరుగుతోంది బావి మీద బండరాయిని చూసింది ''ఎవరీ పని చేశారు?'' గట్టిగా అన్నదామె ''అమ్మా! ఈ పనిచేసిందెవరో కాదు నాన్నగారే!'' అన్నాడా బాలకుడు భయపడిందామె ''బావిలోనుంచి మాట్లాడుతున్న నీవెవరు?'' అనిడగింది ''అమ్మా! నేను నిశాకరుణ్ణి'' సమాధానం వచ్చింది మూగవాడైన తన కొడుకు నోట మాటవిని ఆశ్చర్యపోయింది అతి కష్టం మీద బండరాయిని తొలగించింది బయటి కొచ్చాడు నిశాకరుడు తన

రూపంతో ఉన్న కొడుకును తనివితీరా చూసికొందాతల్లి భర్త దగ్గఱికి వెళ్ళింది జరిగిన వృత్తాంతం వివరించింది సిగ్గుపడ్డాడు కోశకారుడు

''నిశాకరా! నీలో ఈ మార్పు ఎలా వచ్చింది?'' అడిగాడు తండ్రి తన మూగతనం, గుడ్డితనం, బుద్ధిమాంద్యం వీటికి కారణం వివరించాడు నిశాకరుడు – పూర్వ జన్మలో వేదశాస్త్రాలను, ధర్మార్థ కామ మోక్షాలనూ చక్కగా ఉపదేశించాడు నా తండ్రి నేను మహా విజ్ఞానినయ్యాను జ్ఞానంతోపాటు అహంకారమూ పెరిగింది పాపకార్యాలు మొదలెట్టాను. పరస్త్రీలు, పరధనం మీద నా మనసు లగ్నమయ్యేది ఈ కారణంగా మరణించాక నరకం ప్రాప్తించింది వెయ్యి సంవత్సరాలు నరకయాతలనుభవించాను ఆ తరువాత అరణ్యంలో పులిగా పుట్టాను వేటకొచ్చిన రాజభటులు నన్ను బంధించి నగరానికి తీసికెళ్ళారు పులిరూపంతో ఉన్నా ధర్మార్థకామశాస్త్రాలు నా మెందడులో మెదులుతుండేవి ఒకనాడు రాజు నగరం బయటికి వెళ్ళాడు ఆ సమయంలో రాణి ''అజిత'' నా దగ్గఱికొచ్చింది సౌందర్యరాశి ఆమె ఆమెను చూశాక మన్మధుడు నాలో అలజడి సృష్టించాడు ఆమె అందచందాలను వర్ణించాను ఆకర్షితురాలైంది తమ శరీరాలొకటయ్యే ఉపాయమడిగింది బోను తలుపు తెరవమన్నాను ఇది సమయంకాదు రాత్రికి వస్తానన్నది అలాకాదు, ఇప్పడే తెరవమన్నాను. తెరిచింది బయటి కొచ్చాను ఆమెను దగ్గఱికి తీసికొన్నాను అలికిడి విన్న రాజభటులు పెద్దతాళ్ళు, గొలుసులతో నన్ను బంధించారు చెట్టుకు కట్టి చంపారు

పరస్త్రీ పొందు కారణంగా మళ్ళీ నరకం చేరాను మరో వేయి సంవత్సరాలక్కడ గడిచాయి ఆ తరువాత తెల్లగాడిద జన్మనెత్తాను ఒక ఇంట్లో పెరుగుతున్నాను. నా యజమాని ఇల్లాలు తన పుట్టింటికి వెళ్ళాల్సివచ్చింది ''ఈ గాడిదనెక్కి ప్రయాణం చెయ్యి'' అన్నాడు యజమాని తన భార్యతో దారిలో ఒకచోట ఆమె నదీ స్నానం చేయబోయింది ఆమెను అనుభవించాలనే కోరికతో దగ్గఱికెళ్ళాను ఆ దార్లో నడుస్తున్న ఒకడు నన్ను చావమోదాడు పరుగెత్తాను కాలు జారిపడ్డాను తీవ్రంగా గాయపడ్డాను

ఆరు రోజులయ్యాక మరణించాను మామూలుగానే నరకం చేరాను ఆ తరువాత చిలుకగ, ఎద్దుగ పుట్టాను అప్పుడూ ఇలాంటి పనులే చేశాను నరకప్రాప్తి అయ్యాక, గుడ్డి, మూగ, వెర్రి లక్షణాలతో మీ కొడుకుగ పుట్టాను ఇప్పుడే జ్ఞానోదయమయింది పూర్వజన్మలో అధ్యయనం చేసిన శాస్త్రాలు గుర్తుకొస్తున్నాయి పాపప్రక్షాళనకోసం బదరికాశ్రమం వెళ్తున్నాను - అని చెప్పి తల్లి - దండ్రులకు నమస్కరించి వెళ్లిపోయాడు నిశాకరుడు

కాయేన, వాచా, మనసా పూర్వజన్మలో చేసిన పాపాలన్నీ తరువాతి జన్మల్లో స్మరణలోకి వస్తాయి. తపస్సునాచరించి వాటిని దూరం చేసికోవాలని ఉపదేశిస్తోందీ కథ

''యే పఠంతి చ శృణ్వన్తి తేఽపి యాతి పరాం గతిమ్''

ఈ వామనపురాణం వినువారు, పఠించువారు ఉత్తమ గతిని పొందగలరు

  

# 15. కూర్మపురాణము

''ఇదం తు పంచదశకం పురాణం కౌర్మముత్తమమ్'' అష్టాదశ మహాపురాణాల్లో పదిహేనవది కూర్మపురాణం ''కౌర్మం పృష్ఠం సమాఖ్యాతమ్'' అనగా శ్రీమన్నారాయణుని పృష్ఠ (వీపు) భాగంగా వర్ణితమ్మైనదీపురాణం 17 వేల శ్లోకాలున్నాయి పూర్వార్థంలో 53, ఉత్తరార్థంలో 46 కలిపి 99 అధ్యాయాలున్నాయి కూర్మరూపంలో ఉన్న శ్రీమహావిష్ణువు ఇంద్రుని సమక్షంలో మహర్షులకుపదేశించిన పురాణమిది

లక్ష్మీదేవి-ఇంద్రద్యుమ్నుల సంవాదం, విష్ణువు-మహర్షుల మధ్య సంవాదం, సృష్టిప్రక్రియ, వర్ణాశ్రమధర్మాలు, భృగువంశవర్ణన, వ్యాస-పాండవసంవాదం, యుగధర్మాలు, కాశీ-ప్రయాగల మాహాత్మ్యం, సదాచార వర్ణన, ద్వాదశాదిత్య వర్ణన, హేమకూట వర్ణన, అష్టాంగయోగాలు, ఆశౌచవిధి, వానప్రస్థాశ్రమ మహత్త్వం, యతిభిక్షాప్రకారాలు, సురాపాన ప్రాయశ్చిత్తం, నర్మదానదీ మాహాత్మ్యం మొదలైన అంశాలెన్నో కూర్మపురాణంలో చోటుచేసికొన్నాయి.

మరీచి, భృగువు, అంగిరసుడు, పులస్త్యుడు, పురహుడు, క్రతువు, దక్షుడు, అత్రి, వశిష్ఠుడు ఈ తొమ్మండుగురు బ్రహ్మపుత్రులని చెబుతోందీ పురాణం

పూర్వము ప్రజలందఱు ఏవిధమ్మైన బాధలు లేనివారై, శుద్ధాంతః కరణులై స్వధర్మాలను ఆచరించేవారు ఆ తరువాత కాలవశాత్తు రాగద్వేషాలు బయల్దేరాయని కూర్మపురాణం వక్కాణిస్తున్నది

ధర్మం తాలూకు ప్రాధాన్యం -

ధర్మాత్ సంజాయతే హ్యర్థో ధర్మాత్ కామోఽభిజాయతే।
ధర్మ ఏవాపవర్గాయ తస్మాద్ధర్మం సమాశ్రయేత్॥

ధర్మంవల్లే అర్థం, కామం, మోక్షం సిద్ధిస్తాయి గనుక ధర్మాన్ని విడవకుండ సర్వదా ఆశ్రయించాలని చెప్పడమ్మైనది

**శివకేశవుల అభేదం -**

శంకరుడు దేవదేవుడనీ, సృష్టి - స్థితి - లయలకు కారకుడనీ వర్ణింపబడింది శివుని మరో రూపమే విష్ణువు ఈ రహస్యం స్వయంగా విష్ణుభగవానుడే ఇలా చెప్పాడు -

సృజత్యేష జగత్ కృత్స్నం పాతి సంహరతే తథా ।
కాలో భూత్వా మహాదేవః కేవలో నిష్కలశ్శివః ॥

బ్రహ్మాణం విదధే పూర్వం భవంతం యస్సనాతనః ।
వేదాంశ్చ ప్రదదౌ తుభ్యం సోఽయమాయాతి శంకరః ॥

అస్యైవ చాపరాం మూర్తిం విశ్వయోనిం సనాతనీం।
వాసుదేవాభిధానం మామవేహి ప్రపితామహ ॥

ఓ బ్రహ్మదేవా! ఎవడైతే ఈ లోకాలను సృష్టిస్తున్నాడో, రక్షిస్తున్నాడో మరియు ప్రళయం చేస్తున్నాడో ఆ మహాదేవుడైన శంకరుడొస్తున్నాడు బ్రహ్మవైన నిన్ను సృష్టించిందాసదాశివుడే వేదాలను నీకు ప్రసాదించిందీ అతడే. విశ్వకారణమైన నా వాసుదేవాకారము అతనిదే అని పై శ్లోకాల భావం ఈ విధంగా శివ- కేశవుల ఐక్యాన్ని బోధిస్తున్నది కూర్మపురాణం

భక్తులు ఏయే రూపాలతో కొలిస్తే ఆ రూపాలతో శివుడే వారి అభీష్టాలను నెరవేరుస్తాడంటూ -

యం యం భేదం సమాశ్రిత్య యజంతి పరమేశ్వరమ్ ।
తత్తద్రూపం సమాస్థాయ ప్రదదాతి ఫలం శివః ॥

ఈ విధంగా శివమాహాత్మ్యం పేర్కొనడమైనది

మనసమాజంలో కొందఱు తమ బాధ్యతల్ని మఱచి తీర్థయాత్రల నెపంతో తిరుగుతుంటారు ఇలా చేయడం వల్ల ఇహలోకంలో గాని, పరలోకంలో గాని ఫలితం ఉండబోదని చెబుతోంది కూర్మపురాణం -

యః స్వధర్మాన్ పరిత్యజ్య తీర్థసేవాం కరోతి హి ।
న తస్య ఫలతే తీర్థమిహలోకే పరత్ర చ ॥

పరిసరాల పవిత్రతను లక్ష్యపెట్టని కొందఱు దేవాలయాల్లోనూ,

దేవతా ఉద్యానవనాల్లోనూ మల - మూత్ర విసర్జన చేస్తుంటారు. అటువంటివారు పాపానికి గురికాగలరనీ, అందుకు ప్రాయశ్చిత్తం తప్పదనీ హెచ్చరిస్తుంది పురాణం

పుణ్యక్షేత్రాల దర్శనం సకల పాపనివారకం పుణ్యక్షేత్రాల్లో ప్రశస్తమైంది కాశీక్షేత్రమని ఈ శ్లోకం చెబుతుంది -

పుణ్యక్షేత్రాభిగమనం సర్వపాపవిశోధనమ్।
సర్వేషామపి చైతేషాం తీర్థానాం పరమా పురీ ॥

నామ్నా వారణసీ దివ్యా కోటికోట్యయుతాధికా।

కాశీక్షేత్ర మాహాత్మ్యం గురించి అద్భుతమైన వర్ణన ఉన్నదీ పురాణంలో

వేదవిభాగం చేసే వారందరూ వ్యాసులనీ, వీరు మొత్తం 28 గురు ఉన్నరనీ పరాశరసుతుడైన కృష్ణద్వైపాయనుడు 28వ వాడని పేర్కొనడమైనది

సామాజికుల కనీస కర్తవ్యాల్లో ఒకటిలా ఉంది -

పంథా దేయో బ్రాహ్మణాయ స్త్రియై రాజ్ఞే హ్యచక్షుషే।
వృద్ధాయ భారభుగ్నాయ రోగిణే దుర్బలాయ చ ॥

మనం దారిలో నడుస్తుంటాము అప్పుడు బ్రహ్మజ్ఞాన సంపన్నులు, స్త్రీలు, రాజులు, అంధులు, ముసలివారు, బరువులు మోసేవారు, రోగులు, బలహీనులు ఎదురైతే వారికి దారినిచ్చి నడవాలి అంతే గాని, వారిని తోసికొంటూ నడవరాదని భావం.

## గురువులదగ్గర ఎలా నడచుకోవాలి?

న పాదౌ సారయేదస్య సన్నిధానే కదాచన।
జృంభాహాస్యాదికం చైవ కంఠప్రావరణం తథా ॥

ఎట్టి పరిస్థితుల్లోనూ గురువుగారి ఎదుట కాళ్ళుచాపరాదు ఆవలింత, పరిహాస వచనాలు పనికిరావు కంఠాభరణాలు ధరింపరాదని భావం

గురువులను, దేవతలను, వేదాలను కొందరు నిందిస్తుంటారు అది వారి స్వభావం అలా చెయ్యకపోతే వారికి కాలక్షేపం కాదు అలాంటి

వారికే విధమైన సమాధానమూ ఇవ్వరాదు పాపాత్ములైనవారు యుగయుగాల్లో పాపఫలితం తప్పక అనుభవిస్తారు గనుక, అలా వారికేసి కనీసం చూడరాదు చెవులు మూసికొని వెళ్ళాలంటూ-

నిందయేద్వై గురూన్ దేవాన్ వేదం వా సోపబృంహణమ్।
కల్పకోటి శతం సాగ్రం రౌరవే పచ్యతే నరః।

తూష్ణీమాసీత నిందాయాం న బ్రూయాత్ కించిదుత్తరమ్।
కర్ణౌ పిధాయ గంతవ్యం న చైతానవలోకయేత్॥

అంటూ కర్తవ్యోపదేశం చేస్తున్నదీ పురాణం
వామన చరితమిలా ఉందీ పురాణంలో -

విష్ణుభక్తాగ్రేసరుడు ప్రహ్లాదుడు ఇతని పుత్రుల్లో ఒకడు విరోచనుడు మహాబలశాలి. ఇంద్రాది దేవతలందర్నీ ఓడించాడు ధర్మం తప్పక రాజ్యపాలన చేస్తున్నాడు మహావిష్ణువు ప్రేరణతో ఒకసారతని దగ్గఱకెళ్ళాడు సనత్కుమారుడు సాదరంగా ఆహ్వానించి పూజించాడు విరోచనుడు రాకకు కారణమడిగాడు ఆత్మజ్ఞానం ఉపదేశించేందుకే వచ్చానన్నాడా మునీశ్వరుడు జ్ఞానోపదేశం చేశాడు దాంతో రాజుకు వైరాగ్యమొచ్చింది తన కొడుకైన బలికి రాజ్యభారమప్పగించాడు తాను యోగవిద్యలో లీనమయ్యాడు

తండ్రివలె మహాపరాక్రమి బలి ధర్మపాలన సాగిస్తున్నాడు ఇతడు కూడ ఇంద్రాదులనోడించాడు దీన్ని సహింపలేకపోయింది దేవమాత అదితి బలి మొదలైన అసురులను సంహరించేందుకు స్వయంగా మహావిష్ణువే తన గర్భంలో పుట్టాలని సంకల్పించింది ఇందుకోసం భయంకరమైన తపస్సు చేసింది ప్రత్యక్షమయ్యాడు కేశవుడు ఆనందంతో పరవశించింది అదితి విష్ణుస్తోత్రం చేసింది తన కోరికను విన్నవించుకొంది ''తథాఽస్తు'' అన్నాడు భగవానుడు కొంతకాలానికామె గర్భవతయింది బలిచక్రవర్తి రాజ్యంలో అకాల వర్షం దిక్కులు పిక్కటిల్లేలా పిడుగుపాట్లు భయపడ్డాడు బలి ఈ ప్రకృతి వైపరీత్యానికి కారణమేమిటని తన తాతగారైన ప్రహ్లాదుణ్ణి అడిగాడు

విషయం గ్రహించాడాయన మహావిష్ణువు మరో అవతారమెత్తబోతున్నాడు అసుర వినాశం జరగబోతోంది ఆ మాధవుణ్ణే శరణు వేడమని ఉపదేశించాడు అట్లే చేశాడు బలి

శుభముహూర్తం రానే వచ్చింది అదితి గర్భంలోంచి అవతరించాడు శ్రీమన్నారాయణుడు ఉపనయనం జరిగింది వేదాధ్యయనం చేశాడు సదాచారసంపన్నుడయ్యాడా చిరంజీవి. అతడే వామనుడు

ఇలా ఉండగ మహాయజ్ఞమొకటి చేశాడు బలిచక్రవర్తి వచ్చిన బ్రాహ్మణులందరికీ కోరిన దక్షిణలిచ్చాడు వామనుడొచ్చాడు జింకచర్మం ధరించాడు బ్రహ్మదండం చేతపట్టాడు పొట్టివాడు మహాతేజస్వి సూర్యుని వలె ప్రకాశిస్తున్నాడు ''భిక్షాం దేహి'' అన్నాడు ఏంకావాలో కోరుకోమన్నాడు బలిచక్రవర్తి ఎంతో వినయముందా మాటల్లో తన అడుగులతో మూడడగుల నేలనడిగాడు వామనుడు (స్వపద్భ్యాం క్రమితం దేశమయాచత బలిం త్రిభిః) సంతోషంగా అంగీకరించాడు బలి వామనపాదాలను ప్రక్షాళన చేశాడు రెండడుగులతో భూమ్యాకాశాలను ఆక్రమించాడు వామనమూర్తి మూడవ అడుగును చక్రవర్తి తలపై పెట్టాడు పాతాళం చేరాడు బలి ఆ తరువాత విష్ణుసాయుజ్యం పొందాడు

ఈ రీతిగ వామనచరితం అద్భుతంగా దర్శనమిస్తుంది కూర్మపురాణంలో

కూర్మపురాణంలో ఓ భక్తికథ -

పూర్వం చంద్రవంశంలో దుర్జయుడనే రాజుండేవాడు సకల శాస్త్రాలు క్షుణ్ణంగా నేర్చాడు ఇతని భార్య ఉత్తమురాలు అన్ని విధాలైన సుగుణాలున్నాయీమెలో మహాపతివ్రత ఒకనాడు యమునా నదీ తీరానికెళ్ళాడు దుర్జయుడు మధురగానం వినిపించింది ఆ దిశగా చూశాడు. ఊర్వశి కనిపించింది అద్భుతసౌందర్యం ఆశ్చర్యపోయాడు సరిగ్గా అప్పడే దుర్జయుణ్ణి చూసిందామె అపర మన్మథుడిలా ఉన్నాడు ఇతని రూపసంపదకు చకితురాలైంది ఊర్వశి పరస్పరం

ఆకర్షితులయ్యారు కొంత సమయం కలసి గడిపారు తరువాత తన నగరానికి బయల్దేరాడు రాజు మళ్ళీ ఇక్కడే కలిసికొందామంది ఊర్వశి

నగరానికి వెళ్ళిన అతడు తన భార్యను చూసే సాహసం చేయలేకపోయాడు. కారణం, ఆమె పతివ్రత కావడమే ఇతని భయానికి కారణమడిగిందామె చెప్పలేదతడు తన జ్ఞానదృష్టితో విషయం తెలిసికొందా ఇల్లాలు ''ప్రభూ! రాజైనవాడెప్పుడూ భయపడరాదు అది దేశానికి క్షేమం కాదు చేసిన తప్పకు ప్రాయశ్చిత్తం చేసికోవడం మంచిది'' అన్నది

ఈ మాటలు విన్నవెంటనే కణ్వాశ్రమానికి బయల్దేరాడు దుర్జయుడు తన తప్పిదానికి ప్రాయశ్చిత్తం తెలిసికొన్నాడు ఆశ్రమం నుండి బయల్దేరాడు దారిలో ఒక గంధర్వుడెదురయ్యాడు అతని మెడలో ఓ హారం కనిపించింది ఆశ్చర్యపోయాడు. తాను ఊర్వశికి ప్రేమకానుకగ ఇచ్చిన హారమది అంతే, తట్టుకోలేకపోయాడు భయంకరంగా ఆ గంధర్వునితో పోరాడాడు ఎట్టకేలకు తన వశంచేసికొన్నాడాహారాన్ని. కామాతురుడై మళ్ళీ యమునా తీరానికెళ్ళాడు ఊర్వశికోసం వెదికాడు. కనిపించలేదు భూమండలమంతా గాలించాడు ప్రయోజనం శూన్యం. మానస సరోవరం వెళ్ళాడు అక్కడ కనిపించిందామె ఆనందం పట్టలేక పోయాడు హారంతో ఆమెనలంకరించాడు. శారీరక సుఖం పొందాడు. ''నగరానికి వెళ్ళి ఏం చేశావు?'' అడిగింది ఊర్వశి భార్య హిత వచనాలు, కణ్వ దర్శనం, హారం సాధించడం వగైరాలన్నీ చెప్పాడు ''నీ హితం కోరి చెబుతాన్నా ఇక్కణ్ణుంచి వెంటనే వెళ్ళిపో లేకపోతే మునిశాపానికి నీవు, నీ భార్య ఆగ్రహానికి నేను గురికావలసి వస్తుంది'' అంది ఊర్వశి కామాతురుడైన అతనికా మాటలు రుచించలేదు అపుడు తన వికృతరూపం చూపెట్టిందామె ఆ భయంకరాకారాన్ని చూడలేకపోయాడు కనువిప్పు కలిగింది తనను తానే నిందించుకొన్నాడు కందమూల ఫలాలతో 12 సంవత్సరాలు, గాలి మాత్రమే ఆహారంగా మరో 12 సంవత్సరాలు తీవ్రంగా తపస్సు చేశాడు

సిగ్గుతో వెళ్ళి కణ్వమహర్షికి జరిగిన వృత్తాంతం వివరించాడు కరుణించాడు మునీశ్వరుడు కాశీక్షేత్రం వెళ్ళి గంగాస్నానం, విశ్వేశ్వర దర్శనం చేసికోమన్నాడు అలాగే చేశాడు దుర్జయుడు తన పాపానికి ప్రాయశ్చిత్తం జరిగింది మళ్ళీ తన నగరానికెళ్ళి ప్రజలకు చక్కని పరిపాలన అందించాడు ఇలాంటి భక్తి ప్రదాయకమ్మైన కథలెన్నో ఉన్నాయీ పురాణంలో

ఏతత్కూర్మపురాణం తు చతుర్వర్గ ఫలప్రదమ్ ।
పరతాం శృణ్వతాం నృణాం సర్వోత్కృష్టగతిప్రదమ్ ॥

ధర్మార్థకామ మోక్షాలనివ్వగలిగిందీ పురాణం భక్తి శ్రద్ధలతో దీనిని చదివేవారు, వినేవారు సద్గతిని పొందగలరు

  

# 16. మత్స్యపురాణము

శ్రీవిష్ణు భగవానుడు మత్స్యరూపంతో వైవస్వత మనువు-కుపదేశించిన పురాణమిది ''మాత్స్యం మేదః ప్రకీర్త్యతే'' మహావిష్ణువు యొక్క మెదడుతో ఈ పురాణం పోల్చడమైనది. ''తన్మత్స్యమితి జానీధ్వం సహస్రాణి చతుర్దశ' ఇందులో 14 వేల శ్లోకాలున్నాయని భావం 281 అధ్యాయాలున్నాయి

మత్స్యావతార వర్ణన, బ్రహ్మాండ సృష్టి, గర్భిణీ ధర్మాలు, సూర్య-చంద్రవంశవర్ణన, గయాక్షేత్ర వర్ణన, పురూరవ చరితం, కచ - దేవయానుల వృత్తాంతం, కార్తవీర్యార్జున చరితం, శ్యమన్తకోపాఖ్యానం, శుక్రాచార్యులు చేసిన శివస్తుతి, కలిధర్మాలు, కృష్ణాష్టమీ వ్రతం, అక్షయతృతీయా వ్రతం, కల్యాణ సప్తమీ వ్రతం, విశోక సప్తమీ వ్రతం, ఫలసప్తమీ వ్రతం, మహాదాన వర్ణన, పుష్పవాహన కథ, ప్రయాగ క్షేత్ర మహాత్మ్యం, యమునా నదీస్నాన మహాత్మ్యం, సప్తద్వీపాల వర్ణన, త్రిపురాసురవృత్తాంతం, దేవాసురసంగ్రామం, త్రేతాయుగ - ద్వాపరయుగ - కలియుగధర్మాలు, ఋషి లక్షణాలు, తారకాసుర వృత్తాంతం, పార్వతీ కల్యాణం, వినాయక విజయం, కుమార సంభవం, నృసింహావతారవర్ణన, శ్రీవిష్ణుభగవానుని లీలలు, కాశీక్షేత్ర మాహాత్మ్యం, సావిత్రీ - సత్య వంతుల చరిత్ర, రాజ ధర్మాలు, సామ - దాన - భేద - దండోపాయాలు, మంచి, చెడుకలలు - వాటి ఫలితాలు, వామన - వరాహావతారాల వర్ణన, క్షీరసాగర మధనం, వాస్తుశాస్త్ర సిద్ధాంతాలు, క్రియాయోగ వర్ణన, అనేక విధాలైన ప్రతిమాల లక్షణాలు మొదలైన విషయాలు మత్స్యపురాణంలో దర్శనమిస్తాయి

లబ్ధ్వా జన్మ న యః కశ్చిద్ఘటయేత్పౌరుషం నరః ।
జన్మ తస్య వృధా భూతమజన్మాతు విశేష్యతే ॥

ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి మనిషి ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలను సాధించే ప్రయత్నం చేయాలి అలా చేయనివాడి జన్మ

వ్యర్థము అటువంటివాడు బ్రతికియున్నా మరణించిన వాడితో సమానమని భావం ఈ విధంగా పురుషార్థాల పట్ల మానవుణ్ణి ప్రేరేపిస్తున్నదీ పురాణం

శ్రాద్ధకాలంలో పితృదేవతలకు అన్న - పానాదులను సమర్పించడం మన సంప్రదాయం వాటికి సంబంధించి

**ఆసక్తిదాయకమైన కొన్ని అంశాలు -**

దేవో యది పితా జాతః శుభకర్మానుసారతః ।
తస్యాన్నమమృతం భూత్వా దివ్యత్వేప్యనుగచ్ఛతి ॥
దైత్యత్వే భోగరూపేణ పశుత్వే చ తృణం భవేత్ ।
శ్రాద్ధాన్నం వాయురూపేణ సర్వత్వేఽప్యనుగచ్ఛతి ॥
పానం భవతి యక్షత్వే గృధ్రత్వేఽపి తథాఽమిషమ్ ।
మనుష్యత్వేఽన్నపానాని నానాభోగరసం భవేత్ ॥

మరణించిన పితృపితామహాదులు తమ శుభకర్మలవలన దేవతలుగ పుడితే శ్రాద్ధంలో సమర్పించిన ఆహారం అమృతంగా మారుతుంది దైత్యులైతే భోజనమవుతుంది పశువులై జన్మనెత్తితే గడ్డిగా మారుతుంది పాములుగ జన్మిస్తే ఆహారం వాయురూపంగా పరిణమిస్తుంది యక్షులైతే నీరుగ, గ్రద్దలైతే మాంసంగ, మళ్ళీ మనుష్యరూపంతోటే పుట్టినట్లయితే అన్నము - నీళ్ళుగానే ఉంటుందని భావం. ఇలా చెప్పడం ద్వారా శ్రాద్ధకర్మల ఆవశ్యకత తెలుస్తోంది

ఇట్లే, కాలం గురించిన ప్రస్తావనలో - బ్రహ్మకాలమానం ప్రకారం నూరు సంవత్సరాలైతే ఆ కాలం శివునికొక దినమవుతుంది శివుని కాలమానం ప్రకారం నూరేళ్ళు మహావిష్ణువుకొక నిమిషమవుతుంది మహావిష్ణువు మేల్కొంటే అది సృష్టి స్థితి పవళిస్తే ప్రళయస్థితి అని ఈ పురాణం వల్ల తెలుస్తున్నది

వాస్తుశాస్త్రోప్రదేశకులుగ -(1) భృగువు (2) అత్రి (3) వశిష్ఠుడు (4) విశ్వకర్మ (5) మయుడు (6) నారదుడు (7) నగ్నజిత్తు (8)

విశాలాక్షుడు (9) పురందరుడు (10) బ్రహ్మ (11) కుమారుడు (12) నందీశుడు (13) శౌనకుడు (14) గర్గుడు (15) వాసుదేవుడు (16) అనిరుద్ధుడు (17) శుకుడు (18) బృహస్పతి - అనే 18 పేర్లు వినిపిస్తున్నాయి

పతివ్రతల ప్రభావం గురించి -

తాసాం తు వాక్యం భవతీహ మిథ్యా
న జాతు లోకేషు చరాచరేషు ।
తస్మాత్సదా తాః పరిపూజనీయాః ।

అని చెప్పడమైనది పతివ్రతల మాటలు ఎంతో ప్రభావంతో కూడి ఉంటాయి వారి నోటి నుండి బయటికొచ్చే ఏ మాటా వ్యర్థం కాదు ఈ కారణంగా వారి పట్ల పూజ్యభావంతో మెలగాలని భావం

**అవయవాల స్పందన - వాటి ఫలితాలు -**

మత్స్యస్వరూపుడైన శ్రీమన్నారాయణుడు అవయవాల స్పందన మరియు ఫలితాల గురించి ఇలా వర్ణించాడు -

పురుషులకు ఎడమ భాగంలోనూ, వెన్ను ప్రాంతంలోనూ, గుండెమీద అదిరితే శుభం కాదు. కుడివైపు అదిరితే మంచిది తల - భూలాభం, లలాటం- స్థానవృద్ధి, కనుబొమ్మలు - ఆడపొందు, కన్ను - సేవకులు దొరకుట, కంటికొస- ధనలాభం, కనురెప్పలు - శత్రుజయం, చెవి - శుభవార్త వినికిడి, ముక్కు- సౌఖ్యం, అధరోష్ఠం - ఇష్టస్త్రీ లాభం, కంఠం - సుఖం, భుజం - సుఖం పెరుగుట, చేయి - మిత్రలాభం, అరచేయి - దనలాభం, పొట్ట - సంతోషం

**పితృశ్రాద్ధఫలం -**

పితృదేవతలకు శ్రాద్ధం చేస్తే కలిగే ఫలం గురించి ఒక చక్కని కథ మత్స్యపురాణంలో ఉంది -

పూర్వం కురుక్షేత్రంలో కౌశికుడనే విద్యావంతుడుండేవాడు ఖస్సృపుడు, క్రోధనుడు, హింస్రుడు, మిథునుడు, కవి, వాగ్దుష్టుడు,

పితృవర్తి అను ఏడుగురు కొడుకులుండిరతనికి గర్గుడనే మహాపండితుని దగ్గఱ అధ్యయనం చేయసాగారు వీరు ఆ సమయంలో భయంకరమైన కరువుకాటకాలొచ్చాయి ఎప్పటిలాగే ఒకరోజు తమగురువుగారి హోమధేనువును మేత కోసం అడవికి తీసికెళ్ళారు వీరికి బాగా ఆకలయింది ఆహారం దొరకలేదు వేరే ఉపాయం లేక ఆ గోవును చంపి తిన్నారు దూడను మాత్రం గురువుగారి దగ్గరకు తీసుకెళ్ళారు ఆవును పెద్దపులి తిన్నదని అబద్ధమాడారు ఈ గోహత్య కారణంగా వీరు నీచ జన్మలను పొందారు కాని, పూర్వజన్మ జ్ఞాపకాలన్నీ ఉన్నాయి ఆ తరువాత జింకలై, తదనంతరం చక్రవాకపక్షులై మానససరోవరప్రాంతంలో తిరగసాగారు

ఒకనాడు విభ్రాజుడనే పాంచాలదేశరాజు ఆ ప్రాంతానికి వెళ్ళాడు అతని వైభవం చూశాక తానూ రాజుకాదలచింది ఏడవపక్షి అయిదు మరియు ఆరవ పక్షులు తాము మంత్రులు కావాలని తలచారు మొదటి నాలుగు పక్షులు మాత్రం ఏవిధమైన కోరికలనూ కోరుకోలేదు ఏడవ పక్షి తన కోరిక ప్రకారం విభ్రాజమహారాజుకు కొడుకుగ పుట్టింది పేరు బ్రహ్మదత్తుడు సమస్త విద్యలు, సకల జంతుభాషలు నేర్చుకొంది అయిదు, ఆరవ పక్షులు మంత్రి పుత్రులుగ జన్మనెత్తాయి కండరీకుడు, సువాలుడని వీరి పేర్లు మొదటి నాలుగు పక్షులు ఒక బ్రాహ్మణుని ఇంట పుట్టాయి బ్రహ్మదత్తునికి యుక్తవయసు వచ్చింది అతనికి పట్టాభిషేకం చేసి అడవులకెళ్ళాడు తండ్రి విభ్రాజుడు

ఇలా ఉండగా ఈ సోదరులేడుగురు చంపిన ఆవు దేవలుడనే వానికి కూతురుగ పుట్టింది ఆమెను వివాహం చేసికొని సుఖంగా కాలక్షేపం చేయసాగాడు బ్రహ్మదత్తుడు ఒకనాడు ఈ ఇద్దఱు విహారం కోసం ఒక ఉద్యానవనానికెళ్ళారు అక్కడ ఆలు – మగలైన ఓ చీమల జంట తగువులాడుకొంటోంది సకలజంతుభాషలు తెలిసిన కారణంగా ఆతగవును ఎంతో ఆసక్తితో చూడసాగాడు బ్రహ్మమిత్రుడు ఆడ చీమను శాంత పఱచేందుకు ఇలా అంటోంది మగచీమ –

న త్వయా సదృశీ లోకే కామినీ విద్యతే క్వచిత్ ।
మధ్యే క్షామాఽతి జఘనా బృహద్వక్షోరుగామినీ ॥
భోక్ష్యసే మయి భుక్తే త్వం స్నాసి స్నాతే తథా మయి ।
ప్రోషితే సతి దీనాత్వం కృద్ధేఽపి భయచంచలా ॥
కిమర్థం వద కల్యాణి! సరోషవదనా స్థితా ।

ప్రేయసీ! నీవంటి అందగత్తె లోకంలో ఎక్కడా లేదు సన్నని నడుము, లావైన జఘనం, చక్కని వక్షోజాలు మొదలైన బాహ్య సౌందర్యమే గాక నీ ఆత్మ సౌందర్యమూ ఎంతో గొప్పది నేను తిండి తిన్నాకే నీవు తినడం, నాకు స్నానం చేయించాక నీవు చేయడం, నేనెక్కడికైనా ప్రయాణమై వెళితే దీనంగా కాలక్షేపం చేయడం, నేను కోప్పడితే భయంతో వణకిపోవడం మొదలైనవి నీ స్వభావాలు ఇలాంటి నీవు ఎందుకో నా మీద అలిగావు కారణం చెప్పు - అని భావం

అపుడంది ఆడచీమ -

త్వయా మోదకచూర్ణం తు మాం విహాయాభిలష్యతా ।
ప్రమత్తేన వ్యతిక్రాన్తే దినేఽన్యస్యాః సమర్పితమ్ ॥

కుడుముల పిండి నీవు నాకివ్వక మరో ఆడచీమకివ్వడం న్యాయమా? అందుకే నా కోపంగా ఉందని భావం

అందుకు సమాధానంగా మగచీమ అంది -

త్వత్సాదృశ్యాన్మయా దత్తమన్యస్యా వరవర్ణిని ।
తదేకమపరాధం మే క్షన్తుమర్హసి భామిని ॥
నైతదేవం కరిష్యామి పునః క్వాపీహ సువ్రతే ।
స్పృశామి పాదౌ సత్యేన ప్రసీద ప్రణతస్యమే ॥

భామినీ! ఆ ఆడచీమ అచ్చం నీలాగే ఉంది నీవే అనే భ్రమతో నేనలా చేశాను ఈ ఒక్క తప్పు మన్నించు ఇకమీద ఎప్పుడూ ఇలాంటి పొరపాటు

జరగదు నీ పాదాల సాక్షిగ చెబుతున్నాను - అని భావం ఈ మాటలతో ఆడచీమకు తన మగనిపై కోపం పోయింది సంతోషంతో పరస్పరం గాఢాలింగనం చేసుకొన్నారు ఇదీ అక్కడి దృశ్యం ఎంత అద్భుతంగా ఉంది! ఈ సంభాషణను పూర్తిగ అర్థం చేసికొన్నాడు బ్రహ్మదత్తుడు తనలోనే నవ్వుకొన్నాడు.

బ్రహ్మదత్తుని సకలజంతువుల భాషాజ్ఞానానికి కారణం తన తండ్రియైన విభ్రాజుని తపః ప్రభావమే అతడు మహావిష్ణువును ప్రార్థించాడు తన కుమారునికి సకల విద్యలు ప్రాప్తించేలా ప్రసన్నం చేసికొన్నాడు ఇదీ తెరవెనుకకథ

ఇలా ఉండగ, బ్రహ్మదత్తుని పెద్దన్నయ్యలు నలుగురు బీద బ్రాహ్మణుని ఇంటపెరిగి పెద్దవారయ్యారు యోగాభ్యాసం కోసం బయల్దేరారు ఈ ముసలితనంలో నన్ను విడిచి వెళ్తున్నారు నాకు దిక్కెవరు? అని ప్రశ్నించాడు తండ్రి మరేం పరవాలేదు నీ కొక శ్లోకం చెబుతాము ఈ నగరానికి రాజైన బ్రహ్మదత్తుని దగ్గఱ చదివితే నీ కష్టాలు గట్టెక్కుతాయి. ఈ విధంగా చెప్పి ఆ శ్లోకముపదేశించి తమ దారిన వెళ్ళారు

చీమలజంట సంభాషణను తన భార్యకు వివరించాడు బ్రహ్మదత్తుడు ఆమె నమ్మలేదు ''నీకు చీమల భాష ఎలా తెలుస్తుంది? నీవు నన్ను చూసే నవ్వావు'' అని కఠినంగా మాట్లాడింది. అలిగింది చేయగలిగిందేమీలేక ఆమెతో రాజమందిరానికి వెళ్ళిపోయాడు. ఆ మరునాడే ''సప్తరాత్రవ్రతం'' అనే మంత్రం ప్రారంభించాడు నియమ నిష్ఠలతో ఆచరించాడు. ఏడవరాత్రి అతనికోకల వచ్చింది మహావిష్ణువు బ్రాహ్మణవేషంతో ప్రత్యక్షమయ్యాడు ''ఈ ఉదయం నీవు నగరమంతా తిరుగు నీకొక ముసలివాడు కనిపిస్తాడు అతన్ని చూశాక నీ సందేహాలు తీరుతాయి'' అని చెప్పి అదృశ్యమయ్యాడు బ్రహ్మదత్తుడట్లే చేశాడు ఒక ముసలివాడెదురయ్యాడు ఒకరి నొకరు చూసికొన్నారు ఆ వృద్ధుడీ శ్లోకం వినిపించాడు -

యే విప్రముఖ్యాః కురుజాంగలేషు వ్యాధాస్తథా దాశపురే మృగాశ్చ।
కాళంజరే సప్త చ చక్రవాకా యే మానసే తే వయమత్ర సిద్ధాః॥

కురుక్షేత్రంలో బ్రాహ్మణులుగను, దాశపురంలో వేటగాళ్ళుగను, కాళంజరమనే చోట జింకలుగను, మానససరోవరంలో చక్రవాక పక్షులుగను ఉండిన మన ఏడుగురిలో ప్రస్తుతం మేము నలుగురము యోగసిద్ధులయ్యాము – అని దీని భావం ఈ భావం స్ఫురించిన వెంటనే బ్రహ్మదత్తుడు, అతనితో మంత్రులుగ ఉన్న ఇద్దఅన్నయ్యలు పూర్వజన్మలను గుర్తు తెచ్చుకొన్నారు కొద్దిసేపయ్యాక తెలివొచ్చింది ఐహిక సుఖాలతో కాలం వ్యర్థం చేయదలచుకోలేదు తాము కూడ యోగ సిద్ధులు కావాలని నిర్ణయించుకొన్నారు ముసలి బ్రాహ్మణునికి ఎన్నో సంపదలు, అగ్రహారాలు ఇచ్చారు బ్రహ్మదత్తుడు తన పుత్రుడైన విష్వక్సేనునికి రాజ్యభారమప్పజెప్పాడు తన ఇద్దఅన్నయ్యలతో కలసి మానస సరోవరతీరానికి వెళ్ళాడు అక్కడ తమ నలుగురు పెద్దన్నయ్యలతో కలసి యోగసిద్ధిపొందారు.

ఈ విధంగా ఒకప్పడు మహాపాతకమైన గోహత్య చేసినప్పటికీ వీరు యోగసిద్ధులు కాగలిగారు దీనిక్కారణం భక్తి – శ్రద్ధలతో ఆచరించిన పితృశ్రాద్ధమే

ఏవమాయుర్ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖాని చ।
ప్రయచ్ఛన్తి సుతాన్రాజ్యం నృణాం ప్రీతాః పితామహాః॥

య ఇదం పితృమాహాత్మ్యం బ్రహ్మదత్తస్యచ ద్విజాః।
నరేభ్యః శ్రావయేద్యోవా శృణోత్యథ పఠేత వా॥
కల్పకోటిశతం సాగ్రం బ్రహ్మలోకే మహీయతే॥

పితృదేవతలు సంతుష్టులయితే తమ సంతతికి ఆయువు, ధనము, విద్య, స్వర్గం, మోక్షం మొదలైన సుఖాలనిస్తారు పితృదేవతల మాహాత్మ్యం తెలియజేసే ఈ బ్రహ్మదత్తుని కథ వినువారు, చదువువారు

బ్రహ్మసాయుజ్యం పొందగలరని భావము

అస్మాత్పురాణాదపి పాదమేకం పఠేత్తు యః సోఽపి విముక్తపాపః।
నారాయణాఖ్యం పదమేతి నూనమనంగవద్దివ్యసుఖాని భుంక్తే॥

పవిత్రమైన ఈ మత్స్యపురాణంలో కనీసం ఒక్కపాదభాగం చదివినా చేసిన పాపాలన్నీ హరిస్తాయి చివర, శ్రీమన్నారాయణుని నిలయమైన వైకుంఠం చేరికొని సకలసుఖాలను అనుభవించగలరు

  

# 17. గరుడపురాణము

పక్షిరాజైన గరుత్మంతుడు అడిగిన ప్రశ్నలకు మహావిష్ణువు చెప్పిన సమాధానమే గరుడపురాణం ''ఏకోనవింశత్ సౌపర్ణం'' అనగా ఇందులో 19 వేల శ్లోకాలున్నాయి పూర్వఖండంల 229 అధ్యాయాలు, ఉత్తరఖండంలో 35 అధ్యాయాలు కలిపి మొత్తం ఇందులోని అధ్యాయాలు 264 ''మజ్జా తు గారుడం ప్రోక్తం'' అనగా ఆదిదేవుని క్రొవ్వు అంశంగా ఈ పురాణం వర్ణింపబడింది

గరుడపురాణంలో ఉత్తరఖండంలోని ప్రేతకల్పం గురించి మాత్రమే చాలమంది ఎఱుగుదురు మరణానంతరం జీవుని స్థితి ఎలా ఉంటుంది? ఏ యోనియందెలా ప్రవేశిస్తాడు? ఏవిధమైన సుఖదుఃఖాల్ని అనుభవిస్తాడు? మొదలైన ప్రశ్నలన్నిటికీ ఇందులో జవాబులున్నాయి మృతుని ఇంట పదవదినంలోపుగా ఈ పురాణపఠనం చాలాచోట్ల జరుగుతుంటుంది యమలోక వర్ణన, మరియు శ్రాద్ధసంబంధమైన సకల విషయాలిందులో ప్రస్తావించడమైనది

ఈ పురాణానికి సంబంధించి ఒక ముఖ్యవిషయం ప్రస్తావించ వలసియుంది గరుడపురాణమనే సరికి యమలోకానికి సంబంధించిన విషయాలు మాత్రమే ఇందులో ఉంటయనే భావన చాలామందికి ఉంది కాని, వాస్తవానికి ఇతర పురాణాల్లో లేని ఎన్నో అమూల్య విషయాల్ని తనలో దాచుకొంది గరుడపురాణంలోని పూర్వఖండం ఉదాహరణకు –

భగవదవతారాలు, సరస్వతీ ఉపాసనావిధానం, విష్ణుదీక్ష, పంచముఖ శివార్చనవిధి, రోగాదులను వారించే సుదర్శన చక్రపూజా విధానం, సూర్యార్చనవిధి, దేవతా ప్రతిష్ఠవిధి, నిత్య – నైమిత్తిక – కామ్యకర్మల వివరణ, మహాపాతకాలప్రాయశ్చిత్తం, బావుల తవ్వకం మొ॥ కార్యక్రమాలకు సంబంధించి యోగ్యమైన నక్షత్ర వివరాలు, నవగ్రహదశలు, వాటి శుభాశుభఫలితాలు, హస్త సాముద్రిక విచారము,

(ముత్యాల పరీక్షా విధానం, ఇంద్రనీల - వైదూర్య - పుష్యరాగ - మరకత - పద్మరాగ - వజ్ర - గోమేధిక - ప్రవాళ- స్ఫటికములనబడే నవరత్నాల పరీక్షారీతులు) బ్రహ్మచర్యాశ్రమ వర్ణన, గృహస్థ - వానప్రస్థ - సన్యాసాశ్రమాల వర్ణన, అఖండ ద్వాదశీ వ్రతం, చాతుర్మాస్య వ్రతం, భీష్మ పంచక వ్రతం, కృష్ణాష్టమీ వ్రతం, వీరనవమీ వ్రతం, సకల రోగాలకు గల కారణాలు, స్త్రీరోగాలు - వాటి చికిత్స, ఆయుర్వేదవైద్యులకెంతో ఉపయోగపడే రహస్యాలు, అనేక విధాలైన ఛందస్సులు - వాటి లక్షణాలు మొదలైనవి 69 నుండి 80వ అధ్యాయం వఱకు ముత్యము, పుష్యరాగము, వైఢూర్యము, స్ఫటికము, పద్మరాగము, మరకతము మొదలైన విలువైన రత్నాల పరీక్షా విధానం, 108 - 115 అధ్యాయాల మధ్య నీతి బోధలు, 146 - 190 అధ్యాయాల మధ్య ఆయుర్వేద చికిత్స, బుద్ధిబలం పెరిగేందుకు వాడవలసిన ఔషధాలు మరియు పశుచికిత్స గుఱించియు చెప్పడమైనది ఈ పురాణంలోని కొన్ని నీతి వచనాల్ని పరిశీలిద్దాం -

(1) ''పరవేశ్మని వాసం చ న కుర్వీత కదాచన'' - ఇతరుల ఇంట నివసింపరాదు

(2) భార్య అంటే ఎలా ఉండాలి? దీనికి సమాధానంగా -

''యస్య భార్యా గుణజ్ఞా చ భర్తారమనుగామినీ।

అల్పేఽల్పేన సంతుష్టా సా ప్రియా న ప్రియా ప్రియా॥

ఏ స్త్రీ సర్వదా భర్తమార్గంలో నడచుకొంటుందో, సకల సుగుణాల రాశియో, భర్త అందించే చిన్న సుఖాన్ని కూడ పరమానందంగా భావిస్తుందో ఆవిడే ఉత్తమ ఇల్లాలనియు ప్రేయసి అయినంత మాత్రాన ఉత్తమ ఇల్లాలు కాలేదనియు చెప్పడమైనది

(3) కొందఱు యజమానులు నిష్కారణంగా తమ సేవకులపై కేకలు వేస్తుంటారు. అవమానిస్తుంటారు అట్టివారు నల్లత్రాచుతో పోల్చదగిన వారని చెబుతోంది గరుడపురాణం

కారణేన వినా భృత్యే యస్తు కుప్యతి మానవః।
స గృహ్ణాతి విషోన్మాదం కృష్ణసర్పవిసర్జితమ్ ॥

ఈ శ్లోకం పై భావాన్ని తెలియజేస్తుంది

(4) ధనము, జ్ఞానము, రూపము, మైత్రి ఇవి ఎలా ఉండాలో ఈవిధంగా చెప్పడమైనది –

అర్థేన కిం కృపణహస్తగతేన పుంసా
జ్ఞానేన కిం బహుశరాకులసంకులేన।
రూపేణ కిం గుణ పరాక్రమవర్జితేన।
మిత్రేణ కిం వ్యసనకాలపరాఙ్ముఖేన ॥

పిసినారి చేతిలో ఉన్న ధనము, మొండివాడికున్న జ్ఞానము, మంచి గుణాలు, పరాక్రమము లేని అంద చందాలు, కష్టకాలంలో ఆదుకోని మైత్రి వ్యర్థమని చెప్పడమైనది

(5) కష్టకాలంలో చిరపరిచితులు సైతం మెల్లిగా తప్పకుంటారని చెప్పే ఈ నీతిశ్లోకమిలా ఉంది –

వృక్షం క్షీణఫలం త్యజన్తి విహగాః శుష్కం సరస్సారసాః
నిర్ద్రవ్యం పురుషం త్యజన్తి గణికా భ్రష్టం నృపం మంత్రిణః।
పుష్పం పర్యుషితం త్యజన్తి మధుపా దగ్ధం వనాన్తం మృగాః
సర్వః కార్యవశాజ్జనో హి రమతే కస్యాస్తికో వల్లభః?

పక్షులు పండ్లులేని చెట్లను విడచి వెళ్ళిపోతాయి నీరులేక ఎండిపోయిన చెరువుల్లో తామరలుండవు ధనం లేని కారణంగా వేశ్యలు పురుషుల్ని వదిలేస్తారు అధికారం లేని రాజుగారి దరిదాపుల్లో మంత్రులు ఎక్కడా కనిపించరు పూలు వాడితే తుమ్మెదలు అక్కడికి రావు కాలిపోయిన అడవిలో జంతువులుండవు ఇక్కడ ఒక విషయం గమనించాలి చెట్లకు పండ్లుకాస్తే పక్షులు మళ్ళీవస్తాయి చెరువుల్లోకి నీరు వస్తే అక్కడ తామరలు నవ్వుతూ ఉంటాయి అదృష్టవశాత్తు డబ్బు కలసివస్తే వదిలేసిన వేశ్యలు మళ్ళీ వచ్చి తమ కళల్ని ప్రదర్శిస్తారు పోయిన అధికారం

తిరిగి ప్రాప్తిస్తే మంత్రులంతా వచ్చి ఆ రాజును వేనోళ్ళ పొగిడి ఆకాశానికెత్తుతారు పూలు కళకళలాడితే తుమ్మెదలక్కడికి వచ్చి ఎంతో అనురాగాన్ని చూపెడతాయి కాలిపోయిన అడవి చిగిరిస్తే జంతువులు మళ్ళీ వచ్చి ఆ అడవినే ఆశ్రయిస్తాయి స్వార్థం యొక్క స్వరూప - స్వభావాలీ విధంగా ఉంటాయని వక్కాణిస్తున్నదీ చక్కని శ్లోకం

(౮) ఇట్లే మరణించాక కాక బ్రతికి యుండగనే మోక్ష సుఖాన్ని పొందగలిగే వారివిషయమై ఇలా ఉంది -

స్వధర్మకర్మార్జితజీవితానాం శాస్త్రేషు దారేషు సదా రతానామ్।
జితేంద్రియాణామతిథిప్రియాణాం గృహేఽపి మోక్షః పురుషోత్తమానామ్॥

తమధర్మము, కర్మలద్వారా జీవనం చేసేవారు, శాస్త్రాధ్యయనం పట్ల తమ భార్యల పట్ల ఎల్లప్పుడూ ఆసక్తి చూపేవారు, ఇంద్రియ నిగ్రహం గలవారు. అతిథి సేవే పరమభాగ్యంగా తలచేవారు తమ ఇంటనే మోక్షసుఖాన్ని అనుభవిస్తూ ఉత్తమపురుషులుగ కీర్తింపబడతారని భావం

ఈ విధంగా గరుడపురాణంలో ఎన్నో సందేశాలు దర్శనమిస్తాయి

గరుడపురాణంలో కథలకన్నా నీతివచనాలెంతో మధురంగా ఉన్నాయి వాటిలో మరికొన్నిటిని చూద్దాం -

- దుర్మార్గుల వలన ఇహలోకానికి గాని పరలోకాలకు గాని ఏవిధమైన హితమూ చేకూరదు. గనుక, అటువంటివారితో స్నేహం చేయక ఉత్తములతోటే సహవాసం చేయాలి
- మూర్ఖులైన శిష్యులకు పాఠాలు చెప్పడం వల్ల, నీచురాలైన భార్యను పొందడం వల్ల, దుర్మార్గుల కాశ్రయమివ్వడం వల్ల మహామేధావి సైతం అప్రతిష్ఠపాలవుతాడు
- జనాలను సృష్టించేది, సంహరించేదీ కాలమే మనం నిద్రాస్థితిలో ఉన్నా కాలం మాత్రం మేలుకొనే ఉంటుంది గనుక, ఏవిధంగా చూసినా కాలాన్ని కాదని జరిగేదేదీ ఉండదు
- శత్రువైనా మన హితం కోరేవాడైతే వాడే నిజమైన బంధువు బంధువుగా

ఉంటూ మన వినాశాన్ని కోరేవాడు నిజమైన శత్రువు ఎలాగంటే, మన శరీరంలోనే పుట్టినదైనప్పటికీ వ్యాధిని దగ్గర చేరనీయరాదు ఎక్కడో అడవుల్లో ఉన్నవైనా ఔషధాలు మనకు సేవింపదగినవే

- హృదయ విశాల భావాన్ని చాటే ఒక సూక్తి రత్నమిలా ఉన్నది- హితైషి ఎవ్వరైనా సరే మన బంధువుగానే పరిగణించాలి పోషించేవాడు తండ్రితో సమానము నమ్మిక కల్గినవాడు మిత్రుడు మనం నివసించే ప్రాంతమేదైతే దాన్నే మనదేశంగా భావించాలి
- దుర్మార్గురాలైన భార్య, నీచుడైన మిత్రుడు, ఎదురించే సేవకుడు, పాములకు నెలవైన ఇంట్లో నివాసము కలిగినవానికి మృత్యువు అంటూ వేరే ఉండదు
- ఏ దేశంలో అయితే తగిన మర్యాద, ఆదరణలుండవో బంధువులుండరో, మంచి విద్యను పొందగలిగే అవకాశాలుండవో అలాంటిదేశాన్ని విడవడమే శ్రేయస్కరం
- చక్కగ అధ్యయనం చేయదలచిన వాడెవ్వడూ నిద్ర, భోజనాల గురించి ఆలోచించడు ఎంత సుదూర ప్రాంతమైనా గరుడవేగంతో వెళ్ళి అక్కడ తన లక్ష్యాన్ని సాధిస్తాడు
- మందలో వేలాది గోవులుననప్పటికీ అందులో తన తల్లిని చాలా తేలిగ్గా గుర్తించి అక్కడికి చేరుకుంటుంది దూడ అదేవిధంగా, మనమెంత దూరంగా ఉండాలనుకొన్నా మన కర్మ వదలక వెంటాడుతూనే ఉంటుంది

ఇంకా ఇలాంటి సూక్తిరత్నాలనెన్నిటికో ఆశ్రయం గరుడపురాణం

విష్ణుపూజావిధానం, గరుడవిద్య, సర్పమంత్రం, హయగ్రీవ పూజావిధి, గాయత్రీ మాహాత్మ్యం, సాలిగ్రామ లక్షణాలు, సప్తద్వీప వర్ణన, స్త్రీ- పురుషుల మంచి - చెడు లక్షణాలు, పంచ మహాయజ్ఞాలు, యతిధర్మాలు, రాజలక్షణాలు, సేవక లక్షణాలు, సర్వరోగ నివారణోపాయాలు, రాజలక్షణాలు, సేవక లక్షణాలు, సర్వరోగ నివారణోపాయాలు, బ్రహ్మజ్ఞాన ప్రాప్తి మొ॥ విషయాలెన్నిటికో

నిలయమీగరుడపురాణం

అగ్రవర్ణాలకు చెందిన కొందరు తక్కువ కులాలకు చెందిన వారనే భావంతో కొందర్ని నీచదృష్టితో చూస్తుంటారు ఇది ఎంత మాత్రం తగదని హెచ్చరిస్తున్నదీ పురాణం

కస్య దోషః కులేనాస్తి వ్యాధినా కో న పీడితః।
కేన న వ్యసనం ప్రాప్తం శ్రియః కస్య నిరన్తరాః॥

తక్కువ కులంలో పుట్టడమే ఒక నేరం కాదనీ, వ్యాధులెవరికైనా రావచ్చుననీ, కష్టాలందరికీ వస్తాయనీ సంపదలెవ్వరికీ శాశ్వతం కావనీ దీని భావం

''కీర్తితం పాపశమనం పఠతాం శృణ్వతాం నృణామ్''

ఈ పురాణం పఠించువారు, శ్రవణం చేయువారు సకల పాపాల నుండి విముక్తులు కాగలరని చెప్పడమైనది

  

## 18. బ్రహ్మాండపురాణము

బ్రహ్మసృష్టికి సంబంధించి సమస్త విశేషాలనందించే పురాణమిది "బ్రహ్మాండమస్థి గీయతే" మహావిష్ణువు యొక్క అస్థులనగా ఎముకలతో పోల్చడమైనదీ పురాణం "బ్రహ్మాండం ద్వాదశైవ తు" అంటే ఈ పురాణంలో 12 వేల శ్లోకాలున్నాయని భావం ప్రక్రియాపాదము, అనుషంగపాదము, ఉపోద్ఘాతపాదము, ఉపసంహారపాదమనే పేర్లతో నాలుగు పాదాలున్నాయి బ్రహ్మాండపురాణంలో

ప్రక్రియాపాదంలో నైమిశారణ్యానికి సంబంధించిన సమగ్రవర్ణన, సృష్టి వర్ణన, బ్రహ్మ పుట్టుక, వరాహావతార వర్ణన మొదలైన అంశాలున్నాయి

అనుషంగపాదంలో ఆశ్రమధర్మాలు, భృగువు మొదలైన మునుల జన్మవృత్తాంతము, దక్షుడు శివుని దూషించడం, సతీదేవి అగ్నిప్రవేశం, దక్ష - శంకరులు పరస్పరం శపించుకొనడం, ప్రియవ్రతుని వర్ణన, జంబూద్వీపం మొదలైన ద్వీపాల వర్ణన ,సూర్యభగవానుని మహిమ, చంద్రాదిగ్రహాలు మరియు నక్షత్రాలు సూర్యుని అధీనంలో ఉండుట, పగలు, రాత్రి, వారాలు, నెలలు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలు, యుగాలనే పేర్లతో పిలవబడే కాలమంతటికీ మూలకారణం సూర్యుడే అని నిరూపించుట, లింగోత్పత్తి, యుగ ధర్మాలు, ఆయా యుగాల్లోని ప్రజలు లక్షణాలు మొదలైన విషయాలు దర్శనమిస్తాయి

ఉపోద్ఘాతపాదంలో సప్తర్షుల పుట్టుక, నరసింహావతార వర్ణన, కుమారస్వామి పుట్టుక, పుణ్యప్రదేశాల వర్ణన, శ్రాద్ధ కార్యాలకు ప్రశస్తమైన నదులు మరియు తీర్థాల వర్ణన, అన్నదాన మహిమ, గయా శ్రాద్ధఫలము, శివానుగ్రహం కోసం పరశురాముని తపస్సు, కార్తవీర్యార్జునుడు జమదగ్నిని వధించడం, సంజీవినీవిద్యకారణంగా జమదగ్ని మళ్ళీ పుట్టడం, శ్రీకృష్ణ ప్రేమామృత స్తోత్రం, సగరుని చరిత్ర, యయాతి చరిత్ర మొదలైన విశేషాలున్నాయి

ఉపసంహారపాదంలో లలితాదేవికి సంబంధించిన విస్తృతవర్ణన, కామాక్షీదేవీ మాహాత్మ్యము, దేవీదీక్ష మొదలైన ఘట్టాలు సాక్షాత్కరిస్తాయి.

య ఇదం కీర్తయేద్వత్స శృణోతి చ సమాహితః।
స విధూయేహ పాపాని యాతి లోకమనామయమ్॥

ఈ బ్రహ్మాండపురాణం పఠించువారు మరియు వినువారు సమస్తపాపాలకు దూరమై ఉత్తమలోకాలను పొందగలరు



# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 04 | 09 | భక్తి | భక్తికి |
| 19 | 03 | కలసట్టైయింది | కలసట్టైంది |
| 28 | 11 | సన్యాసి | సన్న్యాసి |
| 28 | 12 | సన్యాసి | సన్న్యాసి |
| 29 | 13-14 | సన్నా్యసి | సన్న్యాసి |
| 35 | 13 | -కర్దమ | కర్దమ |
| 39 | 05 | ఖంగం | ఖండం |
| 45 | 20 | తారిక్ష | తార్క్షి |
| 46 | 06 | తార్క్షి | తార్క్షి |
| 50 | 05 | శ్లోకాలూ | శ్లోకాలు |
| 50 | 16 | సంపదన్నీ | సంపదలన్నీ |
| 55 | 08 | ప్రతిమాల | ప్రతిమల |
| 108 | 03 | పూర్వఖండంల | పూర్వఖండంలో |